PRSVM02A189

సాహిత్య ప్రస్థానం
ఫిబ్రవరి 2018

సంపుటి : 17 సంపాదకీయం సంచిక : 2

# ప్రాథమిక హక్కు అవసరం

ఫిబవరి 21. మాతృభాషా దినోత్సవం. మరో విధంగా చెప్పాలంటే తల్లిపాల లాటి సహజమైన అమ్మభాషను తల్చుకోవలసిన, నిలుపుకోవలసిన రోజు. ప్రపంచ ప్రజల స్వంత భాషలు సమాధి అయిపోతున్నాయని భాషాధ్యయనాలు ఘోషిస్తున్నాయి. కాని మన దేశంలో చాలా మందికి అందులోనూ మేధావులనుకునేవారికి కూడా ఈ సమస్య తీవ్రత తెలియకపోవడం విచారకరం. రెండు రాష్ట్రాల్లోనూ, దేశంలోనూ ప్రపంచవ్యాపితంగానూ 13 కోట్లమంది మాట్లాడే తెలుగు భాష ఎలా మాయమై పోతుందని వారు కోప్పడుతుంటారు. అటవీ జీవుల, ఆఫ్రికా వాసుల అనేక భాషలు అంతరించిపోవడంలోని పాఠాలేమిటో అర్థం చేసుకోరు. మన దేశంలో సంస్కృతాన్ని దైవభాషగా పూజించే వారికి లోటు లేదు గాని ఆ భాష కొత్తగా వికసిస్తుందని ఎవరైనా చెప్పగలరా? రాజులూ పండితులూ నెత్తిన పెట్టుకున్న భాషకే దిక్కు లేనప్పుడు కుటుంబాల, ప్రభుత్వాల, విద్యావేత్తల ఈసడింపులకూ, నిర్లక్ష్యానికి గురవుతున్న సామాన్యుల భాషగా తెలుగుకు ముప్పు లేదనడం అవాస్తవికతే గాక అజ్ఞానం కూడా.

రెండో విషయం విద్యాబోధన. శాస్త్రీయ పరిశోధనలూ సామాజిక అనుభవాలూ సమాజాల చరిత్రలూ ఏవి చూసినా తొలిపాఠాలు తల్లి భాషలో చదివితేనే తర్వాత ఉన్నతస్థాయిలో మరింతగా రాణించగలరని అర్థమవుతుంది. మహారాజులు పండితమ్మన్యులు విజ్ఞాన వేత్తల ఆత్మకథలు చెబుతున్నాయి. ప్రపంచీకరణ పేరిట దేశీయ భాషా సంస్కృతులను విధ్వంసం చేస్తున్న నేటి నేపథ్యంలో మరింతగా వర్తించే సత్యమిది. వెనుకబడిన వారిలో చాలా మంది అర్థాంతరంగా చదువు మానేయడానికి కారణం ఆంగ్లభాషాధిక్యతే. గతంలో సంస్కృతం వారిపై స్వారీ చేస్తే ఇప్పుడు ఇంగ్లీషు వేధిస్తున్నది. తల్లి పాలు ఆరోగ్యానికి తొలి రక్షణ కల్పించినట్టే అమ్మభాష అధ్యయనాలకు తొలిమెట్టు.

భాషా సాహిత్యాల ప్రజాస్వామీకరణ అవసరాన్ని గుర్తించబట్టే గిడుగూ గురజాడ వంటి వారు వ్యవహార భాషకోసం పోరాడారు. ఆర్థిక సరళీకరణ ప్రమాదకరం గాని భాషా సరళీకరణ చాలా అవసరం. ఇప్పుడు మాతృభాషా పరిరక్షణ పేరిట ఉద్యమించే కొందరు పాత చాందసాలను, పాండిత్యాలను తెలుగు వెలుగులుగా భావించడం కూడా అశాస్త్రీయమే. అతకని పదాలను సృష్టించి అదే గొప్ప సేవగా చెప్పుకున్నా ప్రయోజనం శూన్యం. ఎయిర్ హోస్టెస్ అంటే విమాన సేవికే గాని గగన సఖి కాదు. వాల్ పోస్టర్ అంటే గోడ ప్రకటనే గాని గోడ పత్రిక కాదు. ఫేస్ బుక్ అంటే ముఖ పుస్తకం అంతకన్నా కాదు. అర్థం చూడని భాషా సృష్టి అనర్థమే.

తెలుగు భాషా వికాసం రేపటి తరాలను నిర్దేశించే విద్యాలయాల్లో జరగాలి గాని శిథిలమై పోతున్న రాజాస్థానాల్లో, దేవస్థానాల్లో కానేకాదు. అచ్చ తెలుగు అంటే ప్రజల తెలుగు. శ్లోకాలు వల్లెవేయించడం, గీతాపారాయణాలు చేయించడం మాతృభాషాభివృద్ధికి మార్గం కాదు. ఈ రెండు రకాల విపరీతాల నుంచి తెలుగును కాపాడుకోవడం తెలుగుబిడ్డల కర్తవ్యం. పెద్దల బాధ్యత.



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com

సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- ◆ 5 సంవత్సరాల చందా రూ.1000 /
◆ 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## కథలు



## కవితలు



## వ్యాసాలు



## ఇంటర్వ్యూలు



## కవిత

### ఒంటరిగా...

- లోసారి సుధాకర్
9949946991

భయం భయం నాలో
చీకటి భయపెడుతుంది
జాబిలి లేని రాత్రిలా
నల్లగా ఈ రేయి
బయట శీతల రేఖమీద
మంచుకురుస్తున్న నిశ్శబ్దం
గుండెల్లో వణుకు
చెలి చేసిన గాయంలా



ఋతువులెన్ని మారినా
కాలచక్రం పరుగు ఆగలేదు
మల్లెలు కురిసిన
యవ్వన క్షణాలు మాసి పోలేదు
ఆమె మరలిరాని వసంతం
ఇక ఈ విశాల శూన్యంలో
ఒంటరితనమొక్కటే
నా చిరనేస్తం.



# ఇల్లులో జీవించిన మనిషి

అద్దేపల్లి ప్రభు
9848930203

**ఆ యింటికి వెళ్దామని నిశ్చయించుకున్నాం. ఆ యింట్లో అతని దగ్గర ఎక్కడా దొరకని రంగు చేపలున్నాయి. వెళ్ళి ఆ చేపల్ని కొనుక్కుని మాచిన్న ఎక్వేరియంలో పెంచుకోవాలి.**

యిల్లు చూస్తే దడగా వుంటుంది. శిథిలాల్లో మిగిలిపోయిన నిర్మాణంలా ఉంటుందా యిల్లు. డాబా గోడల మీద రకరకాల మొక్కలు మొలిచి ఉన్నాయి. ఎండకి ఎండీ.. వానకి నానీ ఇల్లు గోడలన్నీ నాచుపట్టి నల్లగా ఉన్నాయి. బయిట గేటు సగం విరిగిపోయి ఉంది. చుట్టూ ఉన్న స్థలంలో మొక్కలన్నీ పిచ్చి పిచ్చిగా పెరిగి ఉన్నాయి.

యిల్లొక ప్రశ్న... అనుమానం... కుతూహలం...

యింటో అతను.. భార్యా... ఇద్దరోముగ్గురో కూతుళ్ళు ఉంటారు. వాళ్ళు బయటకి వొచ్చినప్పుడు చూస్తుంటాం గనక అది తెల్సు. కానీ అతనికి గానీ... వాళ్ళకి గానీ చుట్టూ ఎవరితోనూ ఎటువంటి సంబంధాలూ లేవు. అతను మాట్లాడడు. భార్య మాట్లాడదు. ఆవు చేన్లో మేస్తే దూడ గట్టు మీద మేస్తుందా.. పిల్లలూ అంతే..

అతని గురించి అందరికీ సందేహమే.. అసలా కుటుంబం ఏమిటీ? ఎందుకు వాళ్ళలా ఉంటున్నారో..

అవును ఇవన్నీ మనకనవసరం. మనకి చేపలు కావాలి. అంతే. వెళ్ళాం.

గేటు చప్పుడు కాడంతోనే చూర్లో ఉన్న గబ్బిలాలు ఓసారి కదిలి మళ్ళీ వేళ్ళాడ్డంలో మునిగిపోయాయి. గేటుకి గుమ్మానికీ మధ్య కాస్త ఖాళీ. అరుగు ఎక్కి గుమ్మం దగ్గరకెళ్ళి తలుపు కొట్టాం. తాతల కాలం నాటి తలుపు. గట్టిగా తడితే పడిపోతుందేమో.. తటపటాయిస్తూనే మళ్ళీ కొట్టాం.

"ఎవరదీ.." లోపల్నుంచి ఓ గొంతు.

అది వికటంగా ఉంది. పుల్ల విరిచినట్టుంది. చిన్నప్పటి కథల్లోని దెయ్యంలా ఉంది ఆ గొంతు.

గుండె దడదడలాడింది. ఉందామా... పారిపోదామా... తలుపు తెరుచుకుంది. వోరగా తలుపు తీసి ఖాళీకి అడ్డంగా నిలబడి,

"ఏం కావాలి?"అన్నాడతను.

అవును. అచ్చం దెయ్యం లాగానే ఉన్నాడు. మనిషి పొట్టివాడు. నెత్తి మీద జుట్టు లేదు. బట్టతల. సరిగ్గా కొత్తెం మీద ఉంది జుట్టు. గడ్డం నెరిసిపోయి తెల్లగా ఉంది. కానీ అతని

ముఖం అంతా తెల్లగానే కనిపిస్తోంది. ముక్కు బాగా లావు. బాగా పొడుగు. కళ్ళు పగిలిన సీమచింత గింజల్లా ఉన్నాయి. ముఖం తుమ్మల్లో గుంకిన పొద్దు.

"ఏం కావాలి..." రెట్టించాడు.

"చా... పలు రంగువి కావాలి.."అన్నాం.

ఓసారి కిందికీ మీదికి చూశాడు.

"కొంటారా?"అన్నాడు.

తలూపి.. "ఆరెంజీ.. బ్లాక్ .. కావాలి"అన్నాం.

"రండి" అని తను బయటకి వచ్చాడు.

చాలా చిన్న నిక్కరు వేసుకుని ఉన్నాడతను. బయటకి వొచ్చి తలుపు మూసేసాడు. పక్కనున్న మరో గుమ్మం తలుపు తీసి లోని కెళ్ళాడు.

లోపలంతా చీకటి చీకటిగా ఉంది. దీనికానుకుని ఉన్న గది స్లాబు పడిపోయినట్టుంది. ఆ వెలుగు పడుతోంది.

తలుపు తీసి లోని కెళ్ళాడు.

లోపలంతా చీకటి చీకటిగా ఉంది. దీనికానుకుని ఉన్న గది స్లాబు పడిపోయినట్టుంది. ఆ వెలుగు పడుతోంది. గది ఒక భూతాల కార్ఖానా.. బూజు.. దుమ్ము...

ముసలి వాడి వెంట సిందుబాద్‌లా వెళ్ళాం.

వెలుగు బాగా పడుతున్న చోట పెద్ద ఎక్వేరియం ఉంది. చాలా పెద్దది. అందులో గుంపులు గుంపులుగా చేపలు తోకాడించుకుంటూ తిరుగుతున్నాయి. మేమనుకోని చేపలు కూడా ఉన్నాయి దాంట్లో.

కానీ చేపలకన్నా ఇల్లు వింతగా ఉంది. అది లావుగా నోరు తెరుచుకున్న కొండచిలువలా ఉంది. గోడలన్నీ పెచ్చులు రాలిపోయి ఉన్నాయి. ఏదో తెలియని అనిశ్చింత... గసపోస్తున్నట్లుగా ఉంది.

"ఏ చేపలు కావాలి" అతని గొంతు.

నాలుగు చేపలు చూపించాం.

"నాలుగూ ఏభైరూపాయలు.. కావాలా..."

మా దగ్గరంత డబ్బు లేదు. మళ్ళీ వస్తామని చెప్పాం. వొచ్చేసాం. మా వెనక అతను తిట్టుకుంటూ తలుపు వైడం మా కర్థమవుతూనే ఉంది.

ఇదంతా చిన్నప్పుడు.

ఏమిటా ఇల్లు.

అతడు పొద్దున ఏడు గంటలకి బైటకొచ్చి తాతల కాలం నాటి సైకిలొకటి తీసి వెళ్ళి పోతాడు. అతడి భార్య మరో అరగంటకి నడుచుకుంటూ వెళ్తుంది. ఎనిమిది గంటలకి అతడి ముగ్గురు కూతుళ్ళూ వెళ్తారు. వాళ్ళు ఎక్కడికి వెళ్తారు అనేది రహస్యం ఏమీ కాదు. అతడు ఒక కిరణా కొట్లో పద్దులు రాస్తాడు. అతడి భార్య అదే కొట్లో చిన్నా చితకా పనులు చేస్తుంది. ఇద్దరు కూతుళ్ళు ప్రెస్‌లో పని చేస్తున్నారు. ఒక కూతురు షాపులో సేల్స్ గర్ల్.

కానీ ఆ యింటి చుట్టూ ఏదో తెలియని రహస్యం ఉంది. చుట్టుపక్కల ఎవ్వరితోనూ ఏ విధమైన సంబంధం లేకుండా.. ఓ పండగా పబ్బమూ లేకుండా వాళ్ళలా ఎందుకుంటున్నారో తెలియదు.

ఉత్సుకత కొన్నాళ్ళకి అలవాటైపోతుంది. వాళ్లలాగే అలవాటైపోయారు. వాళ్ళ దినచర్యా.. వాళ్ళ ఏకాంతం.. వాళ్ళ వొంటి కొమ్ము సొంటి కాయుతనం అన్నీ క్రమంగా అలవాటైపోయాయి. కానీ బాగా వయసు మళ్ళిన పెద్దవాళ్ళకి వాళ్ళ గతం తెలుసు.

వాడి పేరు రామారావు. వాడు పుట్టేనాటికి ఆ యిల్లు సంపదతో తులతూగుతున్నది. అంత వరకూ స్వాతంత్ర్యం కోసం ఉద్యమాలనీ...ఊళ్ళనీ తిరిగిన వాళ్ళ నాన్న స్వాతంత్ర్యం వచ్చాకా రాజకీయాలు వదిలేసి వచ్చేసాడు. వూళ్ళో ఉన్న వ్యవసాయంతో పాటు పట్టణంలో సబ్బుల ఫ్యాక్టరీ ఒకటి పెట్టాడు వాళ్ళ నాన్న. అందుకోసం పట్నానికి మకాం మార్చారు. ఆ కాలంలోనే పుట్టాడు రామారావు. అతడు పుట్టినప్పుడు జ్యోతిష్కులు వాడి జాతకం చూసి వీడు మహా జాతకుడు కోట్లకు పడగలెత్తుతాడు అని చెప్పారు. నిజంగానే సబ్బుల ఫ్యాక్టరీ లాభసాటిగా నడిచింది. అనతి కాలంలోనే పట్టణంలో అప్పటికి ఎవ్వరికీ లేని బిల్డింగ్ కట్టించాడు వాళ్ళ నాన్న. పెద్ద యిల్లు. ఎప్పుడూ కళకళలాతూ ఉండేది. ఫ్యాక్టరీ బాగుండడంతో క్రమంగా పొలాలన్నీ అమ్మేసి పూర్తిగా పట్నం వచ్చేసారు వాళ్ళు. రామారావు బాల్యమంతా ఆ సంపదతోనే గడిచింది. అప్పట్లో ఊళ్ళో కెల్లా ఖరీదైన స్కూల్లో చదివాడు. మొట్ట మొదటిసారిగా ఆ పట్నంలో కారు కొన్నవాడు వాళ్ళనాన్న. రామారావుకి జ్యోతిష్కులు చెప్పిన మాట బాగా గుర్తుంది. వాణ్ణి వాడి చుట్టాలందరూ కోటీశ్వరుడు అనే పిలిచేవారు.

రామారావుకి పదిహేను.. పదహారేళ్ళ వయసుండగా వాళ్ళ ఫ్యాక్టరీ మెల్లిగా దివాలా తియ్యడం మొదలు పెట్టింది. వాళ్ళ నాన్నకి అదెలా జరుగుతోందో అర్థం కాలేదు. పెద్ద పెద్ద విదేశీ కంపెనీల వాళ్ళు చేసే సబ్బుల మీద జనానికి మోజు పెరిగి అవే కొనడం మొదలెట్టడంతో క్రమంగా ఫ్యాక్టరీ అప్పుల్లో కూరుకుపోయింది. ఆస్తులన్నీ ఒక్కొక్కటిగా

జారిపోయాయి. కోలుకోలేని ఈ దెబ్బతో రామారావు వాళ్ళ నాన్న బెంగటిల్లి ఆ దిగులుతోనే మంచం పట్టి చచ్చిపోయాడు. ఫ్యాక్టరీ పూర్తిగా దివాలా తీసి మూత పడిపోయింది. అప్పులు తీర్చడానికి ఉన్న ఆస్తులన్నీ తెగనమ్ముకోగా ఒకే ఒక్క యిల్లు మిగిలింది. అ యిల్లు కూడా కోర్టు కేసుల్లో మునిగిపోయింది.

రామారావుకి ఇరవయ్యేళ్ళ వయసులోనే పెళ్ళి చేసేసారు. వరసగా పిల్లలు... ముగ్గురు ఆడపిల్లలు పుట్టేసారు. భార్యా ముగ్గురు పిల్లలతో కేసుల్లో ఇరుక్కుపోయిన ఇంటితో మిగిలిపోయాడు రామారావు.

అతనికి జీవితంలో ఒకే ఒక్క ఆశయం మిగిలింది. తను పోయిన అస్తుల్ని సంపాదించాలి. కోటీశ్వరుడు కావాలి. అంతే దానికోసమే అతను డబ్బు పోగేయడం మొదలు పెట్టాడు. ఒక పూటే తిండి. సినిమాలు.. షికార్లు... పండగలు.. పబ్బాలు... ఏమీ లేవు. బట్టలు సైతం వొంటిమీద పూర్తిగా అరిగిపోతే రోడ్డు మీద అమ్మే పాత బట్టలు కొనుక్కోవడం అంతే... అతనికి వయసు పెరుగుతున్న కొద్దీ కోటీశ్వరుడు అనే స్థితి ఒక పిచ్చులా పట్టుకుంది. తను డబ్బు కూడ పెట్టుకునే ప్రయత్నంలో అతను పూర్తిగా తనలో తాను మునిగిపోయాడు. ఇంకెవరితోనూ మాటా మంతీ లేదు. సరదా సంబరమూ లేదు.

“వాడి దగ్గిర చాలా డబ్బుంది. అలా బికారోళ్ళా ఉంటాడు గానీ... ఆడు చాలా డబ్బు పోగేశాడు”అంటారు ముసలోళ్ళు.

ఇదంతా గతం. కానీ ఇప్పుడొక పజిల్.

రామారావు పెద్ద కూతురు చచ్చిపోయిందనే సంగతి ఆ వీధిలో ఒక సంచలనం అయ్యింది. ఏదో జబ్బుపడ్డట్టు ఉండే ఆ కుటుంబంలోని వ్యక్తులు ఎప్పుడూ జమాఖర్చుల్లో వాళ్ళలానే ఉంటారు. కానీ ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకోవడంతో వీధిలో వాళ్ళందరూ రామారావుని తిట్టుకోవడం మొదలు పెట్టారు.

“వెధవ... డబ్బు పోగేశాడు కానీ పిల్లలకి అచ్చటా ముచ్చటా ఏమైనా తీర్చాడా.. ముప్పయి యేళ్ళు దాటినా పెళ్ళిళ్ళు చేయకపోతే ఏమవుతుంది. ”అంటూ రామారావుని తిట్టడం మొదలు పెట్టారు.

కానీ ఎవ్వరూ అతన్ని ముఖాన్న అడిగిన వాళ్ళు లేరు.

అతడు ఎవ్వరికీ జవాబుదారీ కాదు.

కూతురి మరణం అతన్ని ఏం చేసిందో తెలియదు. కానీ ఆమె ఆత్మహత్య గురించి వీధి వీధంతా రకరకాల కథనాలు వినిపించాయి. ఆమెని ఓ కుర్రాడు పెళ్ళి చేసుకుంటానన్నాడనీ.. కానీ ఆమె పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే తనకి నష్టమని రామారావు ఆ పెళ్ళి జరక్కుండా చెడగొట్టాడనీ అందుకనే ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుందనీ అంటారు.

రామారావు వీటిని పట్టించుకోలేదు.

సరిగ్గా ఏడాది తరువాత అతను ఎలాంటి హడావుడీ లేకుండా సబ్బుల ఫ్యాక్టరీని ప్రారంభించాడు. వూరికి ఆనుకొని ఉన్న చిన్న పల్లెటూళ్ళో మారుమూల చిన్న పెంకుటింట్లో ఒకరిద్దరు పని వాళ్ళు తన కుటుంబం కలిసి మొదలు పెట్టారు.

బట్టల సబ్బులు, స్నానం సబ్బులు తయారు చేసారు. వాటిని పల్లెటూళ్ళో కిరాణా కొట్లలో ఇచ్చేవాడు. తను సైకిల్ మీద అట్టపెట్టెలో పెట్టుకొని ఇంటింటికీ తిరిగి అమ్మేవాడు. ఎంత తిరిగినా ఎన్ని వూళ్ళు తిరిగినా తనూ తన భార్యా పిల్లలూ అమ్మే ఆ నాలుగు సబ్బులే తప్ప కిరణా కొట్లలో యిచ్చినవన్నీ యిచ్చినట్టే తిరిగి వచ్చేసాయి.

“అబ్బే యివెవరూ కొంటం లేదండీ.. అయినా ఈ రోజుల్లో యిలాంటి వాటికి డిమాండేదండీ బాబూ... సబ్బుల ప్రకటనలు చూసారా.. ఆ టీవీలో ఆ అమ్మాయి అలా స్నానం చేస్తుంది చూసారా... అలా ఉండాలి...”

“ఈ సబ్బు చాలా మంచిది. పైగా అది పదిరూపాయలు.. మన సబ్బు మూడు రూపాయలే కదా..”

“పిచ్చోళ్ళా ఉన్నారండీబాబూ రేటెవడికండీ కావాలీ? మనకి రోజూ టీవీలో కనిపించే సబ్బుంటది సూశారా.. అదీ .. అది కావాలి. మరి మీ సబ్బులు.. దీని మీది పాకింగ్ ఇలాగా ఉంటం? యిప్పుడు ఏదన్నా అమ్మాలంటే మన సరుకు కాదండీ బాగుంటం... టీవీల్లో ప్రకటనలుండాలి.. అందంగా పాకింగులుండాలి.. అలాగుంటే మీరే చెత్త అమ్మినా కొంటారు. సరే ఇదంతా ఎందుగ్గానీ... ఇంకీ సబ్బులొద్దులెండీ...”

రామారావు కళ్ళు పొడిగా ఉంటాయి. వాటిలో తడి ఏనాడో ఆరిపోయింది. అతడు గ్రామాల వెంట సైకిల్ మీద తిరుగుతూ తన సబ్బుల్ని అమ్మడం గురించి పథకాలు వేసాడు. అతడు టీవీ చూడ్డు. సినిమా చూడ్డు. కాబట్టి ఇవేవీ అతనికి తెలీదు. ప్రకటనలనీ .. టీవీలనీ.. విన్న తరువాత వూళ్ళో సబ్బు ప్రకటన హోర్డింగ్ చూసాడతడు. ఎవరో అమ్మాయి దరిదాపు నగ్నంగా స్నానం చేస్తోంది. ఒక మూల సబ్బు పేరు రాసుంది. దాన్ని చూస్తూ నిలబడి పోయాడతడు.

సబ్బు ఒకటే. ఆ సబ్బయినా తను తయారు చేసే సబ్బయినా ఒకటే. దాని ఖరీదు కూడా ఒకటే.. కానీ ఆ కంపెనీ సబ్బు ఖరీదుగా చాలా ఖరీదుగా అనిపిస్తోంది. తన సబ్బు పేదగా.. దరిద్రంగా అనిపిస్తోంది. ఏమిటిది? ఈ అనిపించడం అనే దాన్ని ఎలా తయారు చేయాలి? దానికి

ఎంత ఖర్చు చెయ్యాలి?

సబ్బుకీ మనిషికీ... అవసరానికీ కొనడానికీ మధ్య అగాథం ఉంది. దాన్నెలా దాటాలి?

అమ్మకాలు పూర్తిగా పడిపోయాయి. రామారావు సబ్బుల ఫ్యాక్టరీ మూత పడిపోయింది. అతను ఫ్యాక్టరీ నడిపిన ఈ ఏడాది కాలంలోనూ మనిషి మరింత కృశించి పోయాడు. మళ్ళీ అప్పులు మిగిలాయి. అతడి యింటినిండా వేల కొద్దీ సబ్బులు మాత్రం ఉన్నాయి. యిల్లంతా సబ్బుల వాసన. యిల్లు రెండు గదులు బాగున్నవి. మిగిలిన గదుల స్లాబులు పడిపోయాయి. ఒక గదిలో సబ్బుల్ని పెట్టాడు. ఒక గదిలో తన కుటుంబం.

కూతుళ్ళు సబ్బుల్ని సంచుల్లో వేసుకొని గ్రామాల్లో ఇల్లిల్లూ తిరిగే వారు. రామారావు తెగిపోయిన హవాయి జోళ్ళకి పిన్నీసులు పెట్టుకుని కాళ్ళీడ్చుకుంటూ రోడ్లు పట్టుకుని తిరిగే వాడు. వాళ్ళు ఏం తినే వాళ్ళో తెలియదు. అతని కళ్ళు రోజు రోజుకి మసి పట్టిన చిమ్నీల్లా తయారయ్యాయి. దాదాపుగా ఆ వీధిలో పిల్లలు అతన్ని పిచ్చోడనే ఆట పట్టించే వాళ్ళు.

సాయింత్రం ఆరు గంటల వేళలో ఆ యింటి ముందు ఆగిన ఖరీదైన కారుని చూసి - చూసిన వాళ్ళు ఆశ్చర్యపడ్డారు. చూడని వాళ్ళు విని బుగ్గలు నొక్కుకున్నారు.

రామారావు కోర్టు కేసులో గెలిచాడు. ఇల్లు తనదే అయింది. ఊరు మధ్యలోకి వచ్చిన సర్పవరంలో పొలమూ తనదే అయ్యింది.

"కోటీశ్వరుడవూ... దేవుడు ఇన్నాళ్ళకి నిన్ను దయచూపాడయ్యా... ఇంక ఈ ఆస్తులు తిరుగులేకుండా నీవే. నీ జీవితకాలపు దైద్రం వొదిలిపోయిందనుకో... ఇల్లు ఏం చేసుకుంటావో చేసుకో... సర్పవరంలో పొలం రియలెస్టేటు వాళ్ళకి అమ్మేద్దాం. అన్నీ పోను దాదాపు డెబ్బయి లక్షలు వస్తాయి. పైగా నీ ఇద్దరు పిల్లలకీ, నీకూ తలకో అపార్టుమెంటూ ఇస్తారు. ఈ దైద్రాన్ని వొదిలి ఈ చివరి దశలో హాయిగా బతికై..." అన్నాడు లాయరు.

యాభై యేళ్ళ జీవితంలో మొట్ట మొదటి గెలుపు.

అతడి కళ్ళు వెలగనూ లేదు. ముఖానికి కాంతి రానూ లేదు.

విన్నాడు.

ఆ రాత్రి భార్యా కూతుళ్ళు బాధతోనో... ఆనందంతోనో ఏడవడం విన్నాడు. అద్దంలో ముఖం చూసుకుని పళ్ళికిలించాడు. అక్కడో పన్నూ ఇక్కడో పన్నూ.. ఉంది. కుక్క కోరలా పసుపు పచ్చగా ఉన్న పళ్ళతో ఇకిలిస్తున్న తన మొఖం చూసి తనే భయపడ్డాడు.

మరో పది రోజులకి సర్పవరం పొలం అమ్ముడైపోయి సంచి నిండా డబ్బుల కట్టలు వచ్చి చేరాయి. ఒక పక్కన సబ్బుల వాసన. ఆ వాసన అతనికి తెలియదు. మధ్యలోంచి కొత్తరకం వాసన. ఇది డబ్బు వాసన. ఒకటి రెండూ కాదు డెబ్బయి లక్షలు...

భార్యా కూతుళ్ళూ ఆ డబ్బు సంచీని ముట్టుకుని మురిసిపోతున్నారు.

రామారావు దొడ్లోకి వెళ్ళి చిన్నపాటి వేపకొమ్మని విరగ్గొట్టుకుని ఆకులన్నీ దూసి కర్రతో వచ్చాడు.

భార్యా కూతుళ్ళు చూస్తున్నారు.

అతడు వేపకర్ర తీసుకొని డబ్బు మూటని బాదడం మొదలు పెట్టాడు.

"ఛావు... వెధవా.. చావు... చావు..." అంటూ అరుస్తున్నాడు.

భార్య దు:ఖాన్ని అపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తోంది.

పిల్లలిద్దరూ తండ్రిని పట్టుకుని ఆపారు.

"ఏభై ఏళ్ళ పాటు జీవితంలో నన్ను హింస పెట్టి ఎందుకూ పనికి రాని వాణ్ణి చేసిన రాక్షసిరా యిది. నా కష్టానికి నా తెలివికి మీ కష్టానికి మీ తెలివికి ఇది రాలేదు. ఇప్పుడు దీంతో అవసరమే లేనప్పుడు వచ్చి వెక్కిరిస్తోందిది.." అంటూ గోడ మూలకి పోయి కూర్చున్నాడు. పిల్లలు అలాగే ఉండి తండ్రిని నిమురుతున్నారు.

ఆ రాత్రి డబ్బు కట్టల్ని చాపమీద వరసగా పేర్చాడు రామారావు. దాని మీద పడుకున్నాడు.

నిజానికి నేను గెలవలేదు. ఓడిపోయాను. చిత్తుగా ఓడిపోయాను. నా ఓటమికి దొరికిన కానుక ఇది. కానీ ఈ మహా రాక్షసి ముందు ఓడిపోవడమూ లేదు.. గెలవడమూ లేదు. కాలాన్ని కల్లోల కడలిని చేసిన ఈ డబ్బులో మునిగిపోవడం తప్ప ఎవరైనా ఏం చేయగలరు? అనుకున్నాడు.

అటు దొర్లాడు. ఇటు దొర్లాడు. ఇదొక ముళ్ళ కంప. నిద్ర పట్టదు. గుచ్చి చంపుతోంది. లేచి డబ్బుకట్టల్ని ఓ మూలకి విసిరేసాడు. ఆ చింకి చాప మీద పడుకుని అర్ధ శతాబ్దం తరువాత కాసింత వెలుగ్గా కనిపిస్తున్న భార్యా పిల్లల్ని చూస్తూ ఉండిపోయాడు. ◆

# సంఘంలో రచయిత పాత్ర

- కొడవటిగంటి కుటుంబరావు


28.10.1909 - 17.08.1980

కళలో వాస్తవికతను గురించి మనం ఇంతగా మాట్లాడుతాం గాని, కళను గురించి అవాస్తవికంగా ఆలోచించే అలవాటు మనకింకా పూర్తిగా పోలేదు. ముఖ్యంగా సాహిత్యం గురించి అనేక అభిప్రాయాలు ఈనాడు చలామణిలో ఉన్నాయి. మచ్చుకు కొన్ని:

సాహిత్యం పాఠకులను ఉల్లాసపరచాలి.

అది పాఠకులను ఉత్తేజపరచాలి.

అది సార్వజనీనంగానూ, సార్వకాలికంగానూ ఉండాలి

అది ధర్మార్థ కామమోక్షాలను సాధించే సాధనంగా ఉండాలి.

అది మానవులలో పరివర్తన తీసుకొచ్చి, వాళ్ళ మనస్సులను క్షాళన చేసి, వాళ్ళ బుద్ధులను వికసింపజేయాలి.

సాహిత్యం విప్లవ శంఖారావంగా ఉండాలి. విప్లవాన్ని సాధించాలి.

జీవితంలో ఉండు కష్టనష్టాలను కొంతసేపైనా మరిచిపోయేటట్టు చెయ్యగలదే సాహిత్యం.

పైన చెప్పినవాటికన్నిటికీ కొన్ని "కొరాలరీ"లు కూడా సహజంగా ఉంటాయి.

సంఘంలో తాను నిర్వహించే పాత్ర ఏదో ప్రతి రచయితా స్పష్టంగానో, అస్పష్టంగానో తేల్చుకుంటాడు. అతను నిర్వహించే పాత్ర ఏమిటో అతని రచనలే సూచిస్తాయి. అతని నిర్ణయంతో ఏకీభవించే వారికి అతని రచనలు ఉత్తమ సాహిత్యంగా కనబడతాయి.

అందుకే ఇన్ని రకాల సాహిత్యాలు. ఇన్ని రకాల సాహిత్య నిర్వచనాలు.

అయినప్పటికీ, ఈనాటి సమాజంలో రచయిత నిర్వహించదగిన పాత్ర ఏమిటనేది చర్చనీయంగానే కనబడుతుంది.

మానవ చరిత్రలో ఒకనాడు ఇలాంటి ప్రశ్న లేనేలేదు. నాగరికయుగం ప్రారంభం కాకపూర్వం మానవ సమాజాలు సమత్వం గలవిగా ఉండేవి. ఒక జాతిలో వాళ్ళందరూ సమానాధికారాలు కలిగి ఉండేవారు. వ్యక్తుల మధ్య సమాజ ధర్మం సమదృష్టి కలిగి ఉండేది. ఇలాంటి సమాజాలు సృష్టించిన సాహిత్యం ఉత్తమ సాహిత్యం మాత్రమే గాక, ఉత్తమ విజ్ఞానమూ , ఉత్తమ జ్ఞానమూగా కూడా ఉపకరించేది.

వేదాలు అలాంటి సాహిత్యం. వేదం లేకుండా వేదకాలపు ఆర్యులు ఏ పనీ చెయ్యలేకపోయేవారు. వారి అవసరాలు తీరాలంటే అడుగడుగునా వేదగానం అవసరమయ్యేది. ఆహారం కావాలి, పానీయం కావాలి. పశువులు పెంపొందాలి. అరిష్టాలను ఎదుర్కోవాలి. వాళ్ళు తమ ఋక్కులనూ, సామాలనూ ఊతగా తీసుకొనేవారు. సాహిత్యం ఇంత సమగ్రపాత్ర వహించిన నిదర్శనం నాగరిక యుగంలో ఎక్కడా కానరాదు. అందుకే ఋక్కులు రచించిన వారు మహర్షులు, ద్రష్టలు, సమాజానికి మహోపకారం చేసిన మహనీయులు.

కాని వేదకాలం గడిచింది. నాగరికత వచ్చింది. సమాజంలో సమత్వం పోయింది. అగ్రవర్ణులూ, హీనవర్ణులూ ఏర్పడ్డారు. అర్థకామాలకు మోక్షం జోడించబడింది. ధర్మం మార్పు చెందింది. అందరికీ ఒకే ధర్మం అన్నది పోయింది.

ప్రాచీన సాహిత్యం మత సాహిత్యంగా మెలితిప్పబడింది.

కొత్త రకం సాహిత్యం వచ్చింది. ఇప్పుడు సాహిత్యం నుండి జ్ఞానమూ, విజ్ఞానమూ వేరుపడ్డాయి. విజ్ఞానం అనేక శాఖలుగా – సామాజిక శ్రమ విభజనకు అనుగుణంగా – విస్తరించింది.

పురాణాలు కూడా సర్వమానవ శ్రేయస్సు కోసమే పుట్టాయన్నారు. ఇది నిజం కాదు. పంచమవేదం అనిపించుకున్న భారతం అందరి కోసమూ పుట్టినది కాదు. భారతంలోని ప్రముఖ వ్యక్తుల జీవితాలు యజ్ఞాలపైనా, క్రతువులపైనా ప్రధానంగా ఆధారపడినవి కావు. భారతకాలం నాటికింకా గణ జీవితాలు – వేదకాలపు ఆర్యులు గడిపిన జీవితాలు – జీవిస్తూ ఉండిన వారు మనుషులే కానట్టు చిత్రించబడ్డారు. ఆ గణజీవితం యొక్క ధర్మాలను ధర్మరాజు ఉల్లంఘించి తన స్వజనాన్ని చంపినందుకు చార్వాకుడు ఆక్షేపణ తెలిపితే, చార్వాకుడు కావటానికి బ్రాహ్మడే అయినా అతన్ని రాక్షసుడని పేరుపెట్టి, మిగతా బ్రాహ్మలు అతన్ని చంపారు. చార్వాకుడి హత్యను భారతం సమర్థించింది.

భారతం భారత కాలం నాటి సామాజికులందరికోసమూ పుట్టిందనటం పొసగదు. అందులో చెప్పబడిన సంఘ ధర్మాలు కులాలను బట్టి వివిధంగా ఉన్నాయి. సంఘంలో వర్గాలూ, వాటిలో హెచ్చుతక్కువలూ ఉన్నట్టు భారతం స్పష్టం చేస్తున్నది. కాకపోతే సమాజ స్వరూపంలో ఇంక మార్పులేమీ రావనీ, రాకుండా చేసేటట్టుగా ధర్మాన్ని కట్టుదిట్టం చెయ్యవచ్చుననీ ఒక భ్రమ భారతం రాసిన వారికి ఉండి వుండవచ్చు.

నిజానికి ఈ భ్రమ ప్రతి కాలంలోనూ అసంఖ్యాకులకు ఉంటూనే వస్తున్నది. అయినా సమాజం మారుతూనే ఉన్నది. మార్పును తెచ్చిపెట్టుతున్నది భౌతిక కారణాలేగాని, సాహిత్యం కాదు. వేదాలు వేద కాలాన్ని చిరస్థాయి చేయలేకపోయినట్టే, పురాణాలు పురాణయుగాన్ని చిరస్థాయి చెయ్యలేకపోయాయి.

నాలుగో కులం(వర్ణం)గా గుర్తించబడిన శూద్రులు మొదట్లో బానిసలు. వారికి సమాజంలో స్థానం లేదు. వాళ్ళకు వేద శాస్త్రాలను పఠించే అర్హత కూడా లేదు. కాని ఆ శూద్రులు పరిస్థితుల ప్రోద్బలంతో సమాజానికి నాయకత్వం సంపాదించి, సమాజ పురోభివృద్ధికీ, "అగ్రవర్ణుల" మనుగడకూ దిక్కు కావటం జరిగింది.

అప్పటికే వేదశాస్త్రాలు చెత్తకుప్పలోకి వెళ్ళిపోవటం చేత వాటిని చదివే అధికారం కోసం వాళ్ళు పోరాడే అవసరం తప్పిపోయింది. కాని గత సంస్కృతి యొక్క అవశిష్టాలు పూర్తిగా పోని కారణం చేత, ఏ శూద్రుడైనా ఆర్య సంప్రదాయం ప్రకారం శాస్త్రోక్తంగా పట్టాభిషేకం చెయ్యదలచుకుంటే ధర్మాన్ని నాలుగు పాదాల నడపవలసిన బ్రాహ్మలు, ఆ శూద్రుడి పూర్వులు క్షత్రియులని కట్టుకథలు సృష్టించిన నిదర్శనాలు కూడా చరిత్రలో ఉన్నాయి.

శూద్రులు ''హిందూ సమాజం'' లో స్థానం సంపాదించుకున్నాక వారి స్థానం ఆక్రమించటానికి "పంచములు" వచ్చారు. వారిని కుక్కలకన్న హీనంగా చూసి, హింసించి, వారిమీద అత్యాచారాలు చేసి మన ప్రాచీన సంస్కృతి నిలబెట్టుకుంటున్నాం. శాస్త్రాలు అస్పృశ్యతను గుర్తిస్తాయని పూరీ శంకరాచార్యుడు అన్నాట్ట. అవి ఏ శాస్త్రగ్రంథాలో. అందులో ఉన్న విషయాలన్నీ ఈనాడు అమలు జరుగుతున్నాయో లేదో ఎవరూ అడగలేదు. శంకరాచార్యుడయేది, ఆయన తాత అయేది, గడిచిపోయిన యుగాల సాహిత్యాన్ని ప్రమాణంగా చెప్పువాడు వంచన చేస్తున్నాడని రూఢిగా చెప్పవచ్చు. ఒక మనిషి ఇంకొక మనిషిని "అస్పృశ్యుడు" లేక "పంచముడు" లేక "హరిజనుడు" అంటే కారాగార ప్రాప్తి కలిగే రోజు వస్తుంది. ఆ రోజు రాకుండానే మన ఈనాటి సమాజం పురోగమిస్తుందంటే బుద్ధి గల వాడెవడూ నమ్మడు.

సంఘం మారింది. మారుతున్నది అంటే ఈనాడు ఎవరూ అభ్యంతరం చెప్పరు. ఒకనాడు వేదకాలంలో కులాలు లేవు. యజ్ఞాలు చేస్తే అందరూ యాజకులే. క్షత్రియులు వచ్చారు. విశ్వామిత్రుడు క్షత్రియుడై కూడా బ్రహ్మర్షి అని బ్రాహ్మలచేత అనిపించుకున్నాడు. ఉపనిషత్తుల కాలంలో బ్రాహ్మలు తమకు తెలియని జ్ఞానాన్ని క్షత్రియుల వద్ద నేర్చుకున్నారు. బుద్ధుడికాలంలో క్షత్రియులు అగ్రవర్ణులూ, బ్రాహ్మలు వారి తరువాత వాళ్ళూ అయినట్లు కనబడుతుంది. వైశ్యులు అగ్రవర్ణులుగా చలామణీ అయినట్టు బృహత్కథలో చాలా సాక్ష్యం ఉన్నది. అనేక మంది రాజులు తమ కొడుకులకు ధనిక వర్తకుల పిల్లలను బతిమాలి మరీ చేసుకున్నాడు.

శూద్రులు "హీరో"లుగా కథలు జానపద సాహిత్యంలోనే ఉన్నట్టు కనబడుతుంది. అయితే జానపద సాహిత్యం ఉత్తమ సాహిత్యంగా చలామణి కాదు. కాని అది భవిష్య సాహిత్యానికి ప్రతిబింబం కాదనటానికి లేదు.

ఈనాడు మనం పాత సాహిత్యం కింద పరిగణించేదానిలో

ప్రబంధాలున్నాయి. ఇవి రాజుల కాలంలో రాజుల సంస్కారాన్ని కీర్తించటానికీ, రాజుల అభిరుచులు సంతృప్తి పరిచి, వారినుంచి "పురంబులు, వాహనంబులున్, సొమ్ములు కొన్ని" పుచ్చుకోవటానికీ రాసినవి. ఇవి ఆయాకాలపు పామరజనులనూ, అలగాజనాన్నీ ఉద్ధరించటానికి రాసినవని కలలో కూడా అనుకోలేం.

అప్పుడప్పుడూ తిరుగుబాటు సాహిత్యం రాకపోలేదు. మత సాహిత్యాలన్నీ ఇలాటివే. శైవ, వైష్ణవ సాహిత్యాలు ఇలాటివే. ఇవి సామాజిక పరిస్థితులమీద తిరుగుబాటు చేశాయేగాని, సమాజాన్నంతటినీ ప్రభావితం చేసే సాహిత్యాలు కాలేకపోయాయి. ఇవి ప్రత్యేక వర్గాలకు పనికి వచ్చే సాహిత్యాలుగా నిలిచిపోయాయన్నదటుంచి, మత సాహిత్యాలు అయిన కారణం చేత ప్రజలను మభ్యపెట్టాయేగాని, వారి భౌతిక జీవితాలు పురోగమించటానికి దోహదం చెయ్యలేకపోయాయి. అసలు ఏ మతమూ, ఎప్పుడూ భౌతిక దృష్టిని పదును పెట్టలేదు. సామాజిక దోపిడీకి గురి అయి భ్రష్టులైనవారికి, "అసలు సుఖం పరలోకంలోనే" అనీ, "ధనికులకు స్వర్గం ద్వారాలు తెరుచుకోవు" అనీ చెప్పి, వాళ్ళకు ఒక విధమైన కృత్రిమ శాంతి ఇవ్వవచ్చునేగాని వారి జీవితం ముందడుగు వేసేటట్టు చేసేదెలా?

అయితే గతంలో వచ్చిన తిరుగుబాట్లు అన్నీ మత సంబంధమైనవి కావు. కొందరు మహనీయులు సమాజంలో అమలులో ఉన్న విలువలను తీవ్రంగా విమర్శిస్తూ సాహిత్యం సృష్టించారు. తెలుగులో వేమనా, అరవంలో తిరువళ్ళువార్, హిందిలో కబీర్, మహారాష్ట్రలో తుకారాం మొదలైనవారు జీవితాన్నీ, దాని క్షుద్రభావాలనూ తూర్పారబట్టారు.

వీళ్ళు సృష్టించిన సాహిత్యం ఒక వర్గం కోసం రాసినదని చెప్పలేం; స్థూలంగా జనసామాన్యం కోసం రాసినవని చెప్పవచ్చు. జీవితం గురించి ఎవరికీ దుర్భ్రమలు లేకుండానూ, మానవుడు తాను మానవుడైనందుకు గర్వపడేటట్టూ పిరికివాళ్ళకు ధైర్యం కలిగేటట్టూ, అసహాయులకు శక్తివచ్చేటట్టూ చెయ్యటానికి ఉద్దేశించిన ఈ రచనలు ఆనాటికి విప్లవ రచనలేనని నా నమ్మకం.

ఈనాటికి వద్దాం. నేను రచనలు చేయదలిచాను. దేన్ని గురించి రచన చెయ్యాలి. ఈనాటి జీవితంలో అనేక రకాల వాళ్ళు ఎలా బతుకుతున్నారో నాకు తెలీదు. వారి జీవితాలను వాస్తవంగా చిత్రించేశక్తి నాకు లేదు. నేను నాకు సన్నిహితంగా ఉన్న వర్గాన్ని గురించే రాయగలనన్నది స్పష్టం. అదైనా నాకు జీవితం తెలిసి, అర్థమైనమట్టుకే.

ఇందుకు నేను విచారించాల్సిన అవసరం లేదనుకుంటాను. ఎందుకంటే, ఈనాడు ఎంత గొప్ప పుస్తకం కూడా జన సమాజమంతటినీ చిత్రించలేదు, అది అసంభవం.

తరవాత మరోప్రశ్న. రచన చెయ్యటంలో నా ఉద్దేశం ఏమై ఉండాలి? దీనికి చాలా సమాధానాలు చెబుతారు. ఒకటి, పాఠకుడి మనసును క్షాళన చెయ్యటం. క్షాళన అయేది ఏదీ? భావాలే అయి ఉండాలి. ఏ భావాలు? ఏ భావాలు మంచివో. ఏవి చెడ్డవో చెప్పగలమా? కొన్ని వర్గాలవాళ్ళు కడుపునిండా తిండి తినాలనుకోవటం కూడా మహాపాపంలాగా భావించేవాళ్ళు సమాజంలో ఉన్నారు. "స్వరాజ్యం" అని అరిస్తే మనని తెల్లవాళ్ళు జైలులో తోశారు. రెండోపూట తిండికి చాలే జీతం ఇవ్వమన్న కార్మికులను మనం తుపాకులతో కాలుస్తున్నాం. అందుచేత ఏ రచయితా గుండెమీద చెయ్యవేసుకొని, "ఈ భావాలు క్షాళన కాదగినవి," అని చెప్పడం సాధ్యం కావు. అదీ కాక భావాలు అంత తేలిగ్గా క్షాళన అయేటట్టు కనబడవు. అందుచేతనే ప్రపంచంలో ఇన్ని మతాలువ్యాప్తి చెందికూడా పాశవిక శక్తులు అన్ని వర్గాలలోనూ ఏదో రూపంలో తాండవం చేస్తున్నాయి.

మత్తుమందు (మత) సాహిత్యమూ, కల్లునురుగు (వినోద) సాహిత్యమూ దక్కవు. అవి దక్కవన్నది రుజువు కావటానికి దశాబ్దాలూ, శతాబ్దాలూ వేచి చూడనక్కర్లేదు.

అటే ఆలోచిస్తే, జీవితం ఎంతగా మారినా, రచయితకూ సమాజానికీ గల సంబంధంలో మార్పు రాలేదేమో ననిపిస్తున్నది. వేదకాలపు ఋషులు సరియైన రచనలే చేశారు.

వాళ్ళు చేసినదేమిటి? తమతోటివారి సాంఘిక చైతన్యానికి దోహదం చేసే సాహిత్యం రచించారు. శౌనకులు పదిమంది చేరి సామంగానం చేసినంతమాత్రాన వారికి తిండీ, తాగుడూ రాలేదు. కాని ఆ గానం లేకుండా వాళ్ళు వాటిని సాధించలేకపోయారు. సమాజంలో అసహాయులుగా ఉన్న వారిలో చైతన్యమూ, బెదిరి ఉన్నవాళ్ళకు ధైర్యమూ, వ్యక్తిత్వం కోల్పోయిన వాళ్ళకు వ్యక్తిత్వమూ ఇవ్వటం కన్న రచయిత తన రచనల ద్వారా చేయగల ఉత్తమమైన పని ఏమన్నా ఉందా? లేదనుకొంటాను.

*(సాహిత్య వ్యాసాలు: కొడవటిగంటి కుటుంబరావు)* ◆

# జ్వలతి

- డా॥ ఎన్. గోపి

కన్నీళ్ళు అందరికీ వుంటాయి
ఏ కన్నీటి వెనుక ఏముందో
ఎవరూ తొంగి చూడరు.
అందరిని తాకే గాలే నిన్నూ తాకుతుంది
క్షణక్షణం మారే జీవన వాసనల్లో
తేడా ఎప్పటికీ అర్థం కాదు.

ఆకాశం అందరికీ వుంటుంది.
శూన్యం మాత్రం
కొందరి కళ్ళలోంచే రాలిపడుతుంది.

భౌతిక కారణాలు
పరిపూర్ణ తార్కిక శోభకు
తార్కాణాలు కావు
స్తబ్ధత మనసులోంచి కూడా పుట్టొచ్చు.
దేశదిమ్మరిగా ఉన్నప్పుడే నేను కవి నౌతాను
ఒకేచోట కూర్చుంటే గడ్డ కట్టుకపోతాను.

అందరికీ ఆశలుంటాయి
ఏ ఆశ ఎవరి నిరాశల్లోంచి



నడిచొస్తుందో అంతుపట్టదు.

పొద్దున లేచిన దగ్గర్నుంచీ
ప్రతి పనినీ కాగితంపైన రాసుకుంటాను
రాత్రి పడుకునేటప్పుడు చదివితే
ఒక్క ప్రాణ స్పందనా మిగులదు.
నిరర్థకమైన నీరవ ధ్యానంలో
శబ్దాలన్నీ అశబ్దాలవుతాయి.

ఆలోచనలు అందరికీ వుంటాయి
అవి చీకటి గుహలో
వెలుగుల మాయలో అర్థం కావు
గిరి గీసుకున్న చేతనావరణంలో
స్వార్థమెంతో
పరార్థమెంతో అర్థం కాదు.

ఉదయాలు అందరికీ వుంటాయి
వాటిలో కిరణాలెన్నో
ముందుకు సాగని చరణాలెన్నో నిర్ధారణ కావు. ◆

---

# విండో షాపింగ్

- డా. విజయ్ కోగంటి
8801823244

అలా పిల్లలతో బయటికెళ్ళొద్దామండీ?
పార్కు కా?
అక్కడంతా జులాయిలు
మందుకొడుతుంటారు
సినిమాకి ?
అంత ఖర్చు పెట్టి నా వల్ల కాదు
మరి సూపర్ హైపర్ బజార్?
సరే పద.
ఇద్దరికోసం పుట్టిన బండి నలుగురి కోసం
సాగింది



ఈ షర్ట్ మీకు బాగుంటుంది
ఇపుడంత అవసరమేముంది
పండక్కు కొందాం
డాడీ ఈ టోపీ బాగుంది
తప్పు తీకూడదు అక్కడ పెట్టెయ్

క్రికెట్ బ్యాట్ అయినా...
ముందు చదవండి తర్వాత క్రికెట్లు
కుక్కర్ సరిగా పనిచేయట్లేదు
ఈసారికెలాగో సర్దుకోరాదూ
డాడీ ఐస్ క్రీం బండి
ఇంటి దగ్గర పార్లర్లో బాగుంటుంది

ఒకటి కొంటే రెండు ఉచితం
దీంలో ఏదో మతలబుంది
నాన్న ఏమీ కొనడురా
ఉష్ మాట్లాడకండి

విండో షాపింగ్ తో రెండు గంటలూ గడిపి
ఇల్లు చేరింది ఓ మధ్యతరగతి కుటుంబం

ఎన్ని హంగులున్నా
ఏమీ కొనిపించలేక
మధ్యతరగతి మనిషి చేతిలో ఓడి
దూరంగా రంగు రంగుల దీపాల
కాంతుల్లో
వెలా వెలా పోతూ పెద్ద హైపర్ బజార్!
◆

# స్త్రీవాద తాత్విక ఆలోచనలలో నేర్చుకోవలసింది ఎంతో ఉందనిపించింది

**- ఓల్గా**



ఇంటర్వ్యూ: **గనారా**

**సాహిత్యం పట్ల ఆసక్తి ఎలా కలిగింది?**

నాకు ఊహ తెలిసేనాటికే నా చుట్టూ పుస్తకాలు, పత్రికలు, వార్తా పత్రికలూ ఆకర్షణీయంగా ఉండేవి. మా నాన్న వాటిని సీరియస్‌గా చదువుతుండేవాడు. మా అమ్మ తన పనులు ముగించుకుని పుస్తకపఠనంలో మునిగేది. నాకంటే నాలుగేళ్ళు పెద్దదైన మా అక్కయ్య వేళ్ళనంటిపెట్టుకుని ఎప్పుడూ ఏదో పుస్తకం ఉండేది.

పుస్తకాలు చాలా విలువైనవనే ఆలోచన చిన్నతనంలో కలగటం, ఆ పుస్తకాలలో ఎక్కువ భాగం సోవియట్ యూనియన్ నుంచి వెలువడిన అనువాద పుస్తకాలు - టాల్‌స్టాయ్, గోర్కి, గొగోల్, తుర్గనీవ్ వంటివారివై వుండటం, తెలుగు పుస్తకాలు కూడా శ్రీశ్రీ, చలం, కొ.కు. వంటి వారివై వుండటంతో నాకు చిన్నతనంలోనే మంచి సాహిత్యపు రుచి తెలిసింది. ఆ రోజులలో ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభలలో మార్క్‌ట్వైన్ నవలల అనువాదాలు, గొప్ప రచయితల రచనలు వచ్చేవి. ఆ పత్రికలు నాకు పోషకాహారమూ, చిరుతిండీ అన్నీ అయి నాకు బలమైన సాహిత్యాభిరుచి కలిగించాయి.

**మీ కుటుంబ నేపథ్యం గురించి చెప్పండి?**

మా నాన్న పోపూరి వెంకట సుబ్బారావు గారిది గుంటూరు జిల్లా యడ్లపాడు (చిలకలూరిపేట దగ్గర) మా అమ్మ స్వగ్రామం పక్క గ్రామమైన ఉన్నవ. ఇద్దరివీ రైతు కుటుంబాలు. మానాన్న 1920లో పుట్టాడు. 18 ఏళ్ళు వచ్చేసరికి స్వతంత్రోద్యమం, 20 ఏళ్ళొచ్చేసరికి కమ్యూనిస్టు ఉద్యమం ఆకర్షించాయి. వాటిలో పాల్గొన్నాడు. 1955 తర్వాత కొంత ఆసక్తి తగ్గింది. 1964లో పార్టీ చీలిక తర్వాత నిరాశ చెందానని చెప్పాడు. ఆ మధ్య కాలంలో కాంగ్రెస్‌లోని సోషలిస్టులతో కలిసి ఉండేవాడని గుర్తు. ఐతే మా ఊరు యడ్లపాడులో గ్రామస్తులను సమీకరించి వారి సహకారంతో స్కూలు నిర్మించి కరస్పాండెంట్‌గా బాధ్యతలు నిర్వహించటం, గ్రామ సర్పంచిగా కొన్ని అభివృద్ధి కార్యక్రమాలు చేయటం యివన్నీ ఆయనను ప్రజలతో దగ్గరగా ఉండేలా చేశాయి. 1956 నాటికి మా కుటుంబం గుంటూరులో స్థిరపడింది. నాకూ, మా అక్కకూ మంచి చదువు అందించాలని ఆయన కోరిక. అందువల్ల నాకు గ్రామీణ జీవితంతో పరిచయం అంతగా లేదు.

స్త్రీ పురుష సమానత్వ భావన, కుటుంబంలో ప్రజాస్వామిక ప్రవర్తన, విలువలు, వర్గ స్పృహ, ఫ్యూడల్ భావాల పట్ల వ్యతిరేకత యివన్నీ మాకు అలవడేలా చేసే కుటుంబ వాతావరణాన్ని మా నాన్న, అమ్మ కల్పించారు.

**స్త్రీ వాదం పట్ల ఆసక్తి కలగటానికి కారణాలు ఏమిటి?**

నేను నా పదిహేనవ యేట నుంచీ వామపక్ష ఉద్యమాలలో (విశాఖ ఉక్కు ఉద్యమం మొదటిది) విద్యార్థి ఉద్యమాలలో (ఎస్.ఎఫ్.ఐ) పాల్గొంటూ వచ్చాను. మార్క్సిజాన్ని, మావో ఆలోచనా విధానాన్ని డిగ్రీ చదివే రోజులలో చాగంటి భాస్కరరావు, మల్లికార్జునుడు, వెంటూరు ఉష, వై. కోటేశ్వరరావులు పాఠాలుగా చెప్తుంటే విని గ్రహించాను. తర్వాత స్వయంగా మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలు చదివాను. విప్లవ రచయితల సంఘాలలో పౌరహక్కుల సంఘాలలో పని చేశాను. అదంతా నా అభివృద్ధికి యెంతో దోహద పడింది. కానీ పురుషాధిపత్యం పితృస్వామ్య ధోరణులు నాకు అర్థం కావటం మొదలవ్వటంతో వాటి గురించి ప్రశ్నించసాగాను. ఆ సమయంలో (1975-1985) నేనే కాదు దేశంలో అనేక నగరాలలో పట్టణాలలో స్త్రీలు పురుషాధిపత్యాన్ని గుర్తించి, ప్రశ్నించి తమ సమస్యల చుట్టూ సమీకృతులవటం మొదలు పెట్టారు. ఆ వాతావరణం, నా వ్యక్తిగత, సామాజిక జీవితానుభవాలూ నన్ను స్త్రీవాద రాజకీయాలలోకి నడిచేలా చేశాయి. స్త్రీ వాద తాత్త్విక ఆలోచనలలో నేర్చుకోవలసింది యెంతో వుందనిపించింది.

ఆ క్రమంలో నేను 'అతడు-ఆమె-మనం' అనే సాహిత్య విమర్శ, 'కుటుంబ వ్యవస్థ-మార్క్సిజం-ఫెమినిజం' అనే పుస్తకం రాశాను. ఆ రచనలతో నాలో స్త్రీవాద తాత్వికభావాలు స్థిరపడ్డాయి.

**సాహిత్య, సామాజిక రంగాలలో ఇప్పుడు స్త్రీవాద భావజాలం ఎలా వుంది?**

స్త్రీ వాద ప్రభావం రెండు రంగాలలోనూ బలంగా వుంది. స్త్రీల గురించి "పొలిటికల్ కరెక్ట్‌నెస్"తో మాట్లాడాలనే స్పృహ పెరిగింది రచయితలలో. ప్రధాన పాలకపక్ష రాజకీయ నాయకులలో అంతగా పెరగలేదు. వాళ్ళు సాహిత్యం చదవరు, ఫిలాసఫీ చదవరు గనుక స్త్రీలు వాళ్ళకు ఓట్లుగానే కన్పిస్తారు. అందువల్ల పథకాలు, చట్టాలు చేసినా అవి అమలు కావు. భావజాలం మారదు గనుక "గాజులు తొడుక్కోలేదు" వంటి మాటలు, "రాత్రిపూట ఆడవారికి వీధుల్లో పనేంటి" అనే ప్రశ్నలు "ఒంటి నిండుగా ఆడవాళ్ళు బట్టలు ధరిస్తే వారి మీద హింస జరగదనే" ప్రకటనలు తరచుగా వారి నోటి నుంచి ప్రవచనాలుగా వస్తుంటాయి. వామపక్ష పార్టీలలో మార్పు వచ్చింది. స్త్రీవాదులు నిరంతరం వారితోనే చర్చలు చేశారు. ఐతే యింకా అనుమానాలు, సందేహాలు, కొంత పై పై ఒప్పుకోలు వున్నాయి. వామపక్ష పార్టీలలో స్త్రీల సంఘాలలో మరింత స్త్రీవాద రాజకీయ అధ్యయనం పెరగాలి. వర్గ దృక్పథం బోధపడటం, వర్గాలను గుర్తించటం తేలిక. జండర్ నిర్మాణాలను, పితృస్వామిక పద్మవ్యూహాలను అర్థం చేసుకోవటం చాలా కష్టం. అవి నిరంతరం వేగంగా రూపాల్ని మార్చుకుంటాయి. పొలిటికల్ ఎకానమిని అధ్యయనం చేయటంతో పాటు సెక్సువల్ లేదా జండర్ పొలిటికల్ ఎకానమిని అర్థం చేసుకునేందుకు ఎంతో కృషి, నిరంతర పరిశోధన అధ్యయనం జరగాలి.

ప్రధాన సమాజంలో స్త్రీ పురుష సమానత్వం గురించి, స్త్రీల హక్కుల గురించి స్పృహ పెరిగింది. స్త్రీలు వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ, సంఘాలుగానూ పోరాడుతున్నారు.

**దళిత బహుజన స్త్రీవాదం గురించి....**

అగ్రకుల స్త్రీ వాదం అంటే అగ్రకుల స్త్రీలు తమ జీవితాలలోని అణచివేత గురించే రాశారనీ, దళిత స్త్రీలను వారి అణిచివేతను పట్టించుకోలేదనీ వారి అభియోగం. అందులో వాస్తవం ఉంది. ఐతే ముందు తమ అణచివేత గుర్తించకుండా యితరుల అణచివేత గుర్తించటం అసాధ్యం.

అలాగే కులాన్ని వదిలించుకోటం, అధిగమించటం మామూలు విషయం కాదు. అది కొండచిలువలా మనల్ని చుట్టుకుంటుంది. నిరంతరం మనల్ని మనం కులంతో పోరాడుతూనే ఉండాలి. అంబేద్కర్ "ఎన్‌హిలేషన్ ఆఫ్ కాస్ట్"ని ఆదర్శంగా తీసుకుని స్త్రీవాదులు తమను తాము ఎన్‌హిలేషనిస్ట్ ఫెమినిస్టులుగా మార్చుకోటానికి నిరంతరం శ్రమించాలి. దళిత జీవితాన్ని అర్థం చేసుకుని గౌరవించి స్నేహం చేయాలి. స్నేహ ద్వారాలు కొంతకాలం మూసుకున్నా ఓపికగా వేచి వుండాలి. ఇది తేలిక కాదు కానీ చేయవలసిన పని. శతాబ్దాల అణచివేత చరిత్రకు మూల్యం చెల్లించాల్సిందే.

**సాహిత్య విమర్శ....**

నేనిప్పటికీ సాహిత్య విమర్శ రాస్తూనే ఉన్నాను. 'సాహిత్యం-రాజ్యాంగ నైతికత' అనే కొత్త భావనను ప్రవేశపెట్టి 'సంతులిత' అనే పుస్తకం రాశాను. సాహిత్య విమర్శ ఇంటర్ డిసిప్లినరీ పద్ధతిలో ట్రాన్స్‌జెండర్ వంటి అస్తిత్వ ఉద్యమాలను అర్థం చేసుకుని వాటితో సహకరించకపోతే, సామాజిక మార్పు అసంభవమని తెలిసివచ్చింది.

స్త్రీవాదం సమాజాన్ని అర్థం చేయించే గొప్ప విశ్లేషణా పరికరం. ప్రస్తుతం నా పనంతా ఆ పరికరాన్ని సరిగ్గా వాడటమే. ◆



# కాలకూటం

శింగమాల సుబ్రహ్మణ్యం
9490299399

మనుగడ! ఆటవిక న్యాయంలో ఇదొక సమస్యేగాదు. గతాన్ని ఆటవిక కాలంగా నిందిస్తా ఆధునిక యుగంలో బతకతా వుండామని గొప్పలెజ్జుకుంటాం. నిజానికి ఇప్పుడు గూడా మనం పాటించేవి ఆటవిక న్యాయాలే!

చిన్న జీవుల్ని పెద్ద జీవులు - బలహీనుల్ని బలవంతులు మింగేయడం సాధారణమే! సంక్షేమం, అభివృద్ధి పేరిట వనరుల్ని కబళించడం, బలహీనులపై ఆధిపత్యం చెలాయించడం ఆధునిక రాజ్యాల నీతి! "అభివృద్ధి" అనే మహాయజ్ఞంలో ఊళ్ళకు ఊళ్ళే సమిధలు. ఆ విధ్వంసంలోంచి ప్రతి ఊరు తమ తమ మనుగడను, సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుకోవాలనే యత్నం! ఆ క్రమంలో బాధితుల ప్రతిస్పందన. ఆ ప్రతిస్పందనను సామ, దాన, భేద, దండోపాయాలతో అణచేసే యత్నం! ఇదే ఆధునిక మహాసామ్రాజ్యాల అభివృద్ధి బాట. ఎల్లలెరుగని ఈ విధ్వంసానికి ప్రతి ఊరూ తల్లడిల్లుతోంది. మా ఊరుగూడా దానికతీతం గాదు!

వేల ఆలోచనలు. అంతకు మించిన భయాలు. కాలం గడిచే కొద్దీ అవే నిజాలౌతుండాయ్! మా ఊరి మజరా పల్లెలన్నీ కాలగర్భంలో కలిసిపోయాయ్. మరి మా ఊరో!... కాలుష్య కాసారంలో ఊపిరాడని చేపలా గిలగిలా కొట్టుకుంటోంది. ఊపిరి అందీ అందకుండా ఉండే మా ఊరికి ప్రాణవాయువు అందేదెలా?....

కలత నిద్ర! కాలం కదిలిపోతున్నా రాత్రి గడవని అనుభూతి! నులక మంచం మీద అటు ఇటు దొర్లడంతోనే సరిపోతావుంది. ఎప్పుడో ఏకోజాముకి నిద్రపట్టింది. ఫ్యాక్టరీల సైరన్-లు, లారీల రణగొణ ధ్వనుల్తో అప్పుడే ఊరికి మెలకవొచ్చేసింది. కోడి కూతలు, చెట్లమీది పిట్టల కిచకిచలతో ఊళ్ళు మేల్కొనే రోజులు పోయాయిగదా!

మబ్బుల్ని చీల్చేసిన సూరీడి లేత కిరణాలు సముద్రాన్ని దాటి ఊళ్ళోకి జొరబడుతుండాయ్. కూడా నల్లటి పొడిని తీసుకొచ్చి ఊరి మీద జల్లుతుండాయ్. పెద్దోళ్ళ క్యాకల్తో మంచాల మీది పిలకాయలు బద్దకంగా నీలగతా వుండారు. నా పరిస్థితి గూడా అట్టానేవుంది. ఓపక్క కసువు. మరోపక్క కళ్ళాపి చప్పుళ్ళు. దూరంగా రాంమందిరం మైకులో భక్తి పాటల సందడి. రాత్రంతా నిద్రతో కుస్తీ పట్టిన ముసలాళ్ళు టీ తాగడానికి శేషగిరన్న అంగడి కాడికొస్తావుండారు. పన్లకు పోయేవాళ్ళు ముందుగానే అక్కడికొచ్చి ఆయనేసిచ్చిన వేడి వేడి టీ ఊదుకుంటా ఒక్కోచుక్క గుటకలేస్తా వుండారు. నాక్కూడా టీ తాగాలనిపించి లేచి కూకున్నా.

అప్పుడే పోలీసు జీబొకటొచ్చి అక్కడాగింది. ఆ జీబులోంచి కానిస్టేబులు కిందకి దిగాడు. జేబిలోంచి కాగితం తీసి వాళ్ళని ఏదో అడిగాడు. వాళ్ళు అక్కడికి కొద్ది దూరంలో వున్న మా ఇంటివైపు చూపించారు. ఇంకా అటూ ఇటూ చేతులూపుతా ఏమేమో చెప్పారు. వెంటనే పోలీసులు మా ఇంటికొచ్చి నన్ను

పట్టుకుని జీబెక్కించారు. తర్వాత ఊరి మీద బడి మరో పది మందిని పట్టుకుని జీబులో పడేశారు. మమ్మల్ని ఎందుకు పట్టుకున్నారో మాకెవరికీ అర్థం గాలా! దుమ్ము రేపుకుంటా జీబు పోలీస్టేషన్కి చేరుకుంది.

ఈ సంగతి తెలిసి ఊళ్ళోవాళ్ళు చాలా మంది పోలీస్టేషన్కి వచ్చేశారు. బయటంతా చాలా గందరగోళంగా ఉంది. చిన్నా చితకా రాజకీయనాయకులతో పోలీసోళ్ళకి పోన్లు చేయించారు. అయినా పోలీసోళ్ళు మమ్మల్ని వదల్లా. కోర్టుకి తీసుకుబోతామని చెప్పడం మాకు వినబడతా వుంది. ఊళ్ళో కొందరు మాకోసం నాష్టా (అల్పాహారం) తెచ్చారు. పళ్ళు తోముకునే దానికి మమ్మల్ని కుళాయి కాడికి పంపారు. ఇద్దరు పోలీసోళ్ళు మాకు కాపాలాగా వుండారు. పళ్ళు తోంకున్న తరవాత నాష్టా తిన్నాం. పది గంట్లైంది. మమ్మల్ని జీబులో జిల్లా కోర్టుకి తీసుకబోయారు.

అందర్ని కోర్టు బోనులో నిలబెట్టారు. పోలీసోళ్ళ తరపు వకీలు లేచి ఇంగ్లీషులో ఏదో చెప్పాడు. మా తరపు వకీలెవరూ లేరు. మీరు గిరిజనులపై హత్యాయత్నం చేశారంట! నిజమేనా? అని న్యాయమూర్తి అడిగాడు. అప్పటిగ్గానీ మామీద కేసేంటో తెలీలా.

"మేమెవరి మీద హత్యాయత్నం చేయలా" – న్యాయమూర్తికి చెప్పాం.

ఎందుకంటే మేమెప్పుడూ మా ఊళ్ళో యానాదుల్తో గానీ, దళితుల్తో గానీ తగువు పెట్టుకోలా. అందరం కలిసిమెలిసే వుంటాం.

కానీ... ! నిన్న కన్వేయర్ బెల్టు నిర్మాణం దగ్గర జరిగిన గొడవ గుర్తుకొచ్చింది. పోర్టోళ్ళు కావాలనే ఆ గొడవను మామీద కుల వివక్ష కేసుగా నమోదు చేయించారని అర్థమైంది. మమ్మల్ని 15 రోజులు రిమాండుకు పంపారు. జిల్లా జైలే మాకిల్లయ్యింది. జైలు జీవితం మాకందరికీ కొత్త. అయినా ఏం చేస్తాం! మా జీవితం మా చేతుల్లో లేకుండా పోయి చాలా రోజులైంది గదా!.

◆◆◆

ఒకప్పుడు పాడిపంటల్తో కళకళ్ళాడిన ఊరు బొగ్గు పొడితో, కరెంటు ఫ్యాక్ట్రీలొదిలే పొగతో మసిగొట్టుకు బోతావుంది.

బొగ్గుపొడి...బొగ్గుపొడి....బొగ్గుపొడి. తాగే నీళ్ళల్లో, తినే అన్నంలో, పీల్చే గాలిలో, ఎక్కడ చూసినా అదే! పచ్చటి చెట్లు నల్లగా మారిపోయాయ్! పోర్టోళ్ళు పూడ్చగా మిగిలిపోయిన కాలవల్లోని నీళ్ళన్నీ నల్లరంగులోకి మారిపోయాయ్! బావుల సంగతి సరేసరి! నీళ్ళ బిందెలు, అన్నం దబర్లు దేనిపైనైనా మూత పెట్టకపోతే అంతే సంగతులు. నల్లగా పేరుకుపోతోంది. ముక్కు చీత్తే చీమిడి నల్లగా వస్తోంది. కళ్ళు మాత్రం ఎర్రబారుతున్నాయ్. ఊపిరి తిత్తులకు సంబంధించిన రోగాల్తో ఆసుపత్రులు, మందుల షాపులు కిటకిటలాడతా వుండాయి.

ఒకప్పుడు వాళ్ళిచ్చే డబ్బులకి ఆశపడిన మాకు తగిన శాస్తే జరగతావుంది. భూములు తీసుకొనేటప్పుడు ఎన్నెన్నో కల్లబొల్లి మాటల్జెప్పారు. ఉద్యోగాలిస్తామన్నారు. ఊరంతా చెట్లు నాటించి మంచి వాతారణం కల్పిస్తామన్నారు. ఆసుపత్రులు కట్టిస్తామన్నారు. ఎలాంటి రోగాలొచ్చినా మాదే బాధ్యతన్నారు. పిలకాయలు చదువుకునేందుకు మంచి ప్రమాణాల్తో ఇంగ్లీష్ మీడియం స్కూలు కడతామన్నారు. కాలేజి పిలకాయలకు ఫీజులు కడతామన్నారు. ఇవేమీ నిజంగాలా. భూములు లాగేసుకున్న తర్వాత మా మానాన మమ్మల్నొదిలేశారు. ఇక్కడ పెడతామన్న స్కూలు వేరే ఊళ్ళో పెట్టేదానికి ప్రయత్నం చేశారు. ఆ స్కూల్ని మొదట్లో చెప్పినట్టు ఇక్కడే పెట్టాలన్నారు మా ఊరోళ్ళు. దాంతో ఆ ఊరికి మా ఊరికి మధ్య గొడవలు మొదలయ్యాయ్.

రోగాలొచ్చే ఫ్యాక్ట్రీలెందుకు కడతామంటుండారో, ఉచితంగా ఆసుపత్రులు, స్కూళ్ళు ఎందుకు పెడతామంటుండారో ఎవరూ ఆలోచించలా. ఒకవేళ ఒకరిద్దరు ఆలోచించినా వాళ్ళ మాటలు సాగలా.

చుట్టూ కొన్ని వేల మెగావాట్ల కరెంటు ఫ్యాక్ట్రీలకు అనుమతులిచ్చేశారు. కొన్ని నిర్మాణం పూర్తై కరెంటు తయారుజేయడం మొదలుబెట్టాయి. కళ్ళముందు కరెంటు తయారౌతున్నా మాకు కరెంటు కోత మాత్రం తప్పడం లేదు. అన్ని పల్లెల్లాగే ఇక్కడ కూడా గంటల కొద్ది కరెంటు కోత! మరికొన్ని నిర్మాణ దశలో ఉన్నాయ్. బొగ్గుకు డిమాండ్ ఎక్కువ గావటంతో ఎక్కడెక్కడో విదేశాల్నుంచి కొన్ని లక్షల టన్నుల బొగ్గు దిగుమతి చేసుకోడం మొదలుబెట్టారు.

ఇంతకు ముందు ముడి ఇనప్పొడిని ఇక్కడ్నుంచే విదేశాలకు ఎగుమతి జేసేవోళ్ళు. అప్పుడు కూడా ఇంతే! చెట్టు చేమల్తో బాటు ఊళ్ళకు ఊళ్ళే ఎర్రబారిపోయాయ్. ఇనప్పొడి కళ్ళల్లో బడి అతుక్కుపోయి చాలా మంది కంటికి సంబంధించిన జబ్బుల్తో బాధపడ్డారు. ఇప్పటికీ బాధపడతానే వుండారు. అంతకంటే ఎక్కువ మంది ముడి ఇనుము తీసుకొచ్చే లారీల కింద పడి చచ్చిపోయారు. ఇప్పుడు ఇదిగో ఇలా బొగ్గుపొడి. మమ్మల్ని పీల్చి పిప్పి చేసేస్తోంది.

దిగుమతి చేసుకున్న బొగ్గును నిలవ చేసుకోడానికి వాళ్ళకిచ్చిన స్థలం చాల్లా. వాళ్ళ కన్ను ఉప్పుటేరు కానుకునుండే మడచెట్లపై బడింది. ప్రభుత్వ అనుమతి లేకపోయినా వాళ్ళు లెక్కజెయ్యలా. ఇప్పటిదాకా తుఫాన్ల నుండి, ఉప్పెనల్నుండి ఊళ్ళను కాపాడిన మడ చెట్లను కర్కశంగా నరికేశారు. అక్కడుండే సొన కాలవల్ని పూడ్చి మట్టి తోలి చదును చేశారు. దిగుమతి చేసుకున్న బొగ్గును అక్కడకి తోలడం మొదలుబెట్టారు. తూర్పుగాలి

కొట్టిందంటే, బొగ్గుపొడి మొత్తం చుట్టుపక్కల ఊళ్ళ మీదే! ఇదేమని అడిగే నాయకుడు లేకుండా పోయాడు. గట్టిగా నిలదీసి అడిగే వాళ్ళని వివిధ రకాలుగా ప్రలోభపెట్టి లోబర్చుకుంటుండారు.

ఇలాంటి పరిస్థితుల్లో కాలుష్య వ్యతిరేక సంఘం కార్యకర్తలు ఊళ్ళోకి అడుగుపెట్టారు. జరుగుతున్న విధ్వంసాన్ని చూసి చలించిపోయారు. ఊళ్ళో జనాల్నందర్ని పోగేసి సమావేశాలు పెట్టారు. జరుగుతున్న అనర్థాల్ని అందరికి అర్థమయ్యేటట్టు చెప్పడం మొదలుబెట్టారు. కరెంటు ఫ్యాక్టరీలు వదిలే పొగ వల్ల, బొగ్గు పొడి వల్ల భూమి, గాలి, నీరు ఎలా కలుషితమౌతున్నాయో చెప్పారు. ఆ ప్రభావం మనుషులపై ఎలా వుంటుందో వివరించారు. మొదట్లో కొందరు వ్యతిరేకించినా తర్వాత్తర్వాత అర్థం జేసుకున్నారు.

బొగ్గు పొళ్ళు నీళ్ళల్లో కలిస్తే గంధకికామ్లం లాంటివి తయారౌతాయంట. ఆ నీళ్ళు మనుషులుగానీ, జంతువులుగానీ వాడుకునేందుకు పనికిరావంట. గాల్లో కలిసిన పొడి పీల్చడం వల్ల ఊపిరితిత్తులకు సంబంధించిన రోగాలు, చెవుడు లాంటివి కూడా వస్తాయంట. ఒక టన్ను బొగ్గు కాలిస్తే నాలుగు టన్నుల కార్బన్-డై-ఆక్సైడ్ విడుదలవుతుందంట. దాంతోబాటు సల్ఫర్-డై-ఆక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్ లాంటి విషవాయువులు గాలిలో కలుస్తాయని చెప్పారు. అంతేకాక పాదరసం, సీసం, ఆర్సెనిక్, క్రోమియం లాంటి భార లోహాలు కూడా విడుదలవుతాయంట. వాటిని పీలిస్తే దగ్గు, ఆయాసం, ఉబ్బసంతోపాటు చర్మవ్యాధులు, గుండె జబ్బులు, కేన్సర్-లాంటి భయంకరమైన రోగాలు వచ్చే ప్రమాదం ఎక్కువవుతుందన్నారు. సీసం, పాదరసాలు చిన్న పిలకాయల మెదళ్ళపై ఎక్కువ ప్రభావం జూపిస్తాయంట. పరిస్థితులిలాగే వుంటే రాబోయే కాలంలో ప్రతి ఇంట్లో కనీసం ఒకరైనా మానసిక పరిపక్వత లేని పిలకాయలుంటారని చెప్పారు.

కరెంటు ఫ్యాక్టరీలు సముద్రంలోకి వదిలే వేడినీటి వల్ల కొన్ని కోట్ల టన్నుల చేపలు, రొయ్యలు, ఇతర జలచరాలు చచ్చిపోతాయని జెప్పారు. ఎండలు పెరిగిపోయి నిప్పుల కొలిమిలా మండుతాయని చెప్పారు. కరెంటు ఫ్యాక్టరీల మూలంగా అమెరికాలో సంవత్సరానికి 24,000 మంది మరణిస్తున్నారంట. అంతగా జన సమ్మర్ధంలేని అమెరికాలో ఈ ఫ్యాక్టరీల వల్ల సంవత్సరానికి 24,000 మంది మరణిస్తే, అధిక జనసమ్మర్ధం గల మన దగ్గర ఎంత మంది మరణిస్తారో ఊహకందడం లేదని చెప్పారు. ఇందుకు సంబంధించి అమెరికాలోని గ్రీన్ పీస్ సంస్థ వాళ్ళ అధ్యయన నివేదిక తెలుగు ప్రతిని మాముందుంచారు.

మా ఊరికి చుట్టుపక్కల పది పదిహేను కిలోమీటర్ల పరిధిలో 33,000 మెగావాట్ల కరెంటు ఉత్పత్తికి అనుమతులిచ్చారని తెలిపారు. అన్ని ఫ్యాక్టరీలు ఉత్పత్తి మొదలుబెడితే రోజుకు ఇరవైవేల లారీల బూడిద ఇక్కడ పోగవబోతోంది. వాటిలో కొన్నింటినైనా అడ్డుకోకపోతే ఈ ఊరే కాకుండా, ఈ చుట్టు పక్కల ఊళ్ళల్లో మనుషుల మనుగడకే ప్రమాదమేర్పడుతుందని వివరించారు.

ఇలాంటి సమయంలోనే బొగ్గు నిల్వచేసిన దగ్గర్నుండి కరెంటు ఫ్యాక్టరీల కాడికి నేరుగా బొగ్గును తీసుకుబోయేందుకు కన్వేయర్ బెల్టుల నిర్మాణం ప్రారంభించారు. ఊళ్ళో అందరం అక్కడికెళ్ళి ధర్నా చేసి పనులు జరక్కుండా అడ్డుకున్నాం. కానీ అక్కడున్న సెక్యూరిటీ వాళ్ళు మమ్మల్ని చెదరగొట్టేందుకు లాఠీలకు పన్జెప్పారు. వాళ్ళెక్కడో పరాయి రాష్ట్రం వాళ్ళు. వాళ్ళు గిరిజనులని మాకెట్టా తెలుస్తుంది. ధర్నా చేస్తున్న జనాల్ని లాఠీల్తో కొడుతున్నారన్న కోపంతో మాలో కొందరు వాళ్ళని ఎనక్కి తోసేశారు. దాంతో వాళ్ళల్లో ఒక పిల్లోడికి తలకాయమీద చిన్న గాయమైంది. అక్కడ్నించి వెళ్ళిపోయిన పోర్టోళ్ళు దెబ్బ తగిలిన సెక్యూరిటీ గార్డు చేత హత్యాయత్నం కేసు పెట్టించారు.

మా తరపున వకీల్ని కాలుష్య వ్యతిరేక సంఘం కార్యకర్తలే పెట్టారు. పది రోజుల తర్వాత బెయిలొచ్చింది. ఊళ్ళో కొందరు పోర్టోళ్ళ దగ్గరికి పోయి అడిగారు- ఇదేం అన్యాయమని!

"మా పన్లకడ్డొస్తే ఇలాగే ఉంటాది మరి! మేమిచ్చేది తీసుకుని నోర్మూసుకుని పడుంటే అందరికి మంచిది. లేకపోతే అంతే. కేసు మాత్రం ఎత్తేయడం కుదరదు. మాకడ్డు రానంత వరకూ మీమీద తదుపరి చర్యలేమీ ఉండవు" అంటూ బెదిరించారు.

♦♦♦

ఫలితం మామూలే! కేసులకు భయపడిన జనాలు కాలుష్య వ్యతిరేక సంఘం కార్యకర్తలు పెట్టే సమావేశాలకు రావడం మానుకున్నారు. ధర్నాలంటే మరీనూ!... లక్షలాది టన్నుల బొగ్గు దిగుమతౌతానేవుంది. గాలిలో కలిసిపోయిన బొగ్గు పొడి నల్లటి మేఘాలవలే కుమ్ముకుని ఊరిపై బడి తన ప్రతాపం చూపిస్తావుంది. నిర్మాణం పూర్తి చేసుకున్న కరెంటు ఫ్యాక్టరీలు కర్కశంగా పొగను కక్కతుండాయ్. జబ్బులు పడ్డ జనాలు ప్రభుత్వాసుపత్రుల చుట్టూ తిరగతా వుండారు. ఎదురు తిరిగి పోరాడితే కొంతవరకైనా వాటిని అడ్డుకోగలమని తెలిసినా కేసుల భయంతో ఎవరూ ముందుకు రావడంలా!

పచ్చటి పల్లెలపై నిర్దయగా కాలకూటాన్ని విరజిమ్ముతున్న ఈ భయంకర సర్పాలను నిరోధించడానికి ఏ కృష్ణుడు వచ్చి కాళీయమర్ధనం చేస్తాడో!?.....

♦



# సాహిత్య రంగంలో సమూహాలు, స్వమోహాలు

- తెలకపల్లి రవి

తెలుగు సాహిత్య గమనంలో సామాజిక కోణం కన్నా స్వంత ఘోష ఎక్కువయ్యే పరిస్థితులు వచ్చాయా? పెరిగిన వనరులు ప్రచురణ ప్రసార సదుపాయాలు ప్రశంసలు అందుకునే అవకాశాలు ఇవన్నీ కలసి రచయితలూ మరీ ముఖ్యంగా కవులను ఒక చిన్న బృందంగా మార్చేసి వారిలో వారే గుడుగుడు గుంచాలాడే వాతావరణం కల్పించాయా? కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ అని ఎప్పుడో చెలం చేసిన వర్ణన తలకిందులై ఇప్పుడు భావ కవితా పితామహుడే మందహాసం చేస్తున్నారా?

**ఈ అంశంపై చర్చకు ఆహ్వానం**

ఇవీ ఇలాటివే ఇంకా కొన్ని ప్రశ్నలు కొంతకాలంగా వెంటాడుతున్నాయి. కనీసం నన్ను. రోజు రోజుకు ఈ పరిస్థితి ఇంకా తీవ్రమవుతున్నదే గాని మార్పు వస్తున్నట్టు కనిపించడం లేదు గనక రచయితలూ పాఠకులూ పరిశీలకులతో పంచుకోవాలనుకుంటున్నాను. ఇది చర్చ కోసమే.

కవులూ రచయితలంటే ఎవరో పెద్దవాళ్లు కొద్దిమంది అసాధారణ ప్రతిభావంతులే వుంటారనే భావన పోయి ప్రజాస్వామీకరణ రావడం చాలా స్వాగతించదగిన విషయం. పత్రికలూ సోషల్ మీడియా పెద్ద సంఖ్యలో కొత్త రచయితలను ముందుకు తెచ్చాయి. ఈ సహస్రాబ్ది ప్రారంభంలో జనకవనం సాహిత్య శాల వంటివి పెట్టాలని ఆలోచించినప్పుడు కొందరు అపహాస్యం చేసేవారు. అంతమంది ఎక్కడ దొరుకుతారు ఎవరు వింటారు అని. అంతకు ముందు కూడా అలాటి కొన్ని ప్రయత్నాలు జరిగినా జన కవనం ప్రయోగాల తర్వాత కొత్త వారిలో సాహిత్య సృజన పఠనం సమిష్టిగా చేరడం పెరిగాయనడంలో సందేహం లేదు. సాహితీ స్రవంతికి స్వంతంగా పత్రిక వుండటమే గాక నిరాఘాటంగా వెలువడటం, విశాల వేదికగా పనిచేయడం కూడా ఒక వేదికగా రూపొందడానికి దోహదం చేశాయి. గుజరాత్ మారణహోమం దశలో మొదలైన ఈ కృషి ఇప్పుడు ఆ మోడీ దేశానికి ప్రధానిగా వచ్చి అసహనం పెరిగిపోతున్న తరుణంలోనూ కొనసాగడం విశేషమే.

అయితే ఈ ప్రయాణంలో ప్రస్థానంలో మొదట బయిలుదేరిన వారంతా వున్నారా అంటే చెప్పడం కష్టం. సహజంగా వ్యక్తిగత సమస్యలతో ధోరణులతో దూరమైన వారు కొందరు. స్వంత సృజనకు రావలసినంత ప్రచారం రావాలంటే విడిగాచేసుకోవాలనే తపనతో మారిపోయిన వారు మరికొందరు. అలా గాక సమాజం సాహిత్యం సంబంధాల గురించి వర్తమాన వాస్తవాల గురించి సరైన అవగాహన వున్నవారు జిల్లాల్లో కార్యకర్తలు నాయకులూ ఇప్పటికి అంకిత భావంతోనే కృషి చేస్తున్నారు. అయితే వారికీ కొన్ని సవాళ్లు ఎదురవుతున్నాయి.

మొదటిది ఏమంటే సాహిత్యం సామాజిక స్వభావం తగ్గి వైయక్తిక ప్రక్రియగా మారిపోతుండడం. మంచి కవితలో కథలో రాసిన వారు కూడా వెనువెంటనే గరిష్ట స్థాయిలో ప్రశంసలు ప్రస్తావనలు ఆశించడం.. అవి రాకపోతే నిరుత్సాహ పడటం.. ఆ విధమైన ప్రచారాలకు అవకాశమిచ్చే పద్ధతులను ఆశ్రయించడం పరిపాటి అయింది. ఇదంతా గంభీరమైన

పదజాలంతో సాహిత్య సేవ పేరుతో జరుగుతున్నా వాస్తవానికి చూసేది మాత్రం స్వంత ఘోషే. కుటుంబాలు స్నేహితులూ వ్యాపార నేస్తాలూ అందరూ వచ్చేసి సాహిత్య సభను కాస్త పిఆర్ యాక్టివిటీ కింద మార్చేస్తుంటారు. డబ్బు గల వారు కొందరు పెద్దలు మరేదైనా చేసే బదులు సాహిత్య కారులకు ఇస్తే ఉభయ తారకంగా ప్రచారం ప్రసిద్ధి కూడా లభిస్తాయి గనక కొంత సహాయం చేస్తుంటారు. కాబట్టి వారికీ పెద్ద పీట . విపరీతమైన పొగడ్తలు. ఒక పుస్తకానికి అరడజను మంది ముందు మాటలు. అవి రాయడం కోసం నెలల తరబడి నిరీక్షణలు. ఇదంతా అనేక సందర్భాల్లో సాహిత్య గుణాన్ని నెమ్మదిగా ఆవిరి చేసేస్తున్న పరిస్థితి.

ఇక కొంత పేరు వచ్చిన లేదా పేరు మోసిన కవులూ రచయితలూ ప్రతి చిన్న కదలికనూ ఫేస్‌బుక్‌లో పెట్టేయడం.. లైకుల కోసం పొగడ్తల కోసం ఎదురు చూడటం మరో తంతు. సమాచార విజ్ఞానం వల్ల మాట మంతి పెరగొచ్చు. కాని ఈ సంభాషణలూ సంభావనలు గమనిస్తే వ్యక్తిగతంగా గాక అది కూడా ఏదో సమాజ సేవ లేదా ప్రగాఢ భావుకత అన్న స్థాయిలో నడుస్తుంటాయి. పిల్లల పుట్టిన రోజులు కొత్త బట్టలూ కార్లు ఇళ్లు కొనుక్కోవడాలు టూర్లూ ఆఖరుకు వ్యక్తిగత మేకప్‌లు పోజులు అన్నీ చర్చనీయాంశాలే. అంటే ప్రశంస నీయాలే. పోనీ ఇదైనా ముక్తసరిగా వ్యక్తిగతంగా వుంటుందా అంటే సాహిత్య సామాజిక రంగు పులమడమే. మిథ్యా భావుకత మానవత చిలికించడం కద్దు. కవులు రచయితల ముద్ర వేసుకున్నాక వారు దగ్గినా తుమ్మినా సాహిత్యమేనన్నమాట. వారు ఒక్క మాట పెడితే చాలు ఇతరులంతా పోటాపోటీగా పొగిడి పారేయడమే.రాసిన వారికి కూడా తెలియని రసజ్ఞ కోణాలు అన్వేషించడమే.

ఇదంతా స్వంత గొడవ అనుకున్నా ఇప్పుడు సాహిత్యంలోకి వద్దాం. కవిత రాయడమే గాక రాద్దామనుకుంటున్నా అని పోస్టు పెట్టగానే మిగిలిన వారంతా వాలిపోయి మెచ్చేసుకోవడం. మామూలు జబ్బులతో ఆస్పత్రిలోచేరినా తమ కుటుంబంలో ఎవరికైనా ఆరోగ్య సమస్య వచ్చినా వెంటనే ఫేస్‌బుక్ తయారు. ఇవన్నీ మామూలుగా జరిగేవని ఎందుకు అనుకోరో తమ భావుకతను వ్యక్తిగత దైనందిన వ్యవహారాలకు కూడా ఎందుకు పులుముతారో అస్సలు అర్థం కాదు. ఒక్కముక్కలో చెప్పాలంటే గుర్తింపు తెలియాలనే తపన అంతే.

ఈ ధోరణి రాసే కవిత్వంలోనూ కనిపిస్తున్నది. వచ్చే కవితలలో సగం స్వంత కోణాలే. ప్రియులు స్నేహితుల శుభాశుభాలు, తలి దండ్రుల పిల్లల మనవలూ మునిమనవల ముచ్చట్లు మాత్రమే గాక ఇరుగూ పొరుగుల గురించీ తమకు ఇష్టమైన వారి గురించి గొప్పగా చెప్పడమే. పోనీ దాన్నయినా కవితగా కళ కలగలిపి కథగా మలిచి రాయడమా అంటే ఎంతమాత్రం కాదు. మా అనుభూతికి నేపథ్యం ఇది అని ఆఖరున నోట్ పెట్టేస్తారు. తాము నవయువతగా నడిమివయస్కులుగా ముసలివారుగా ఏ దశలో వున్నవారైనా సరే ఇదే తంతు. అస్తిత్వ వాదాలూ అనుభూతి వాదాల పేరు లేకుండానే వాటిని వ్యక్తిగత స్థాయికి దిగజార్చే ఈ ధోరణి చూసినప్పుడే కృష్ణశాస్త్రి శ్రీశ్రీపై జయించినట్టు అనిపిస్తుంది. ఒక ప్రసిద్ధ కవి ఇటీవలనే ఒక పత్రికలో తన మనవడి గురించి ఏదో గాంభీర్యం మేళవించి రాసినా మరో కవయిత్రి పసిగట్టి కవితాత్మక సమాధానమే ఇచ్చారు.

ఇది గాక అవార్డుల ఆర్భాటం కూడా ఈ మధ్య బాగా పెరుగుతున్నది.అవార్డులు ఇచ్చే కమిటీలో ఎవరెవరు వున్నారో ఎవరికి వస్తున్నాయో అర్థమవుతూనే వుంటుంది. (ఇది ఎవరినీ కించపర్చడానికి కాదు) కొంతమంది వాటిని తిరస్కరించారు కూడా. అయినా కేవలం తమ పేర్లు తాము పంపుకుంటే లభించే పురస్కారాలను కూడా గొప్పగా చెప్పుకోవడం. సీనియర్లుగా పేరున్న వారు వారిని ఆకాశానికెత్తి అవాస్తవాల్లోకి తోయడం. రాయడం పూర్తి కాకముందే ప్రశంసల కోసం రంగంలోకి దిగడం. ఇవన్నీ విసుగు తెప్పించేంతగా పెరుగుతున్నాయి. తమ గురించి లేదా తమ గురించి పొగిడేవారి గురించి చెప్పడం తప్ప సుప్రసిద్ధులు వారి సృజనలపై సమకాలీన ప్రపంచ సాహిత్యంపై చర్చ తగ్గిపోతున్నది. తెలుగు రాష్ట్రాల విభజన తర్వాత రెండు ప్రభుత్వాలు కవులు రచయితల కోసం బాగానే ఖర్చు చేస్తుండడంతో వంతపాడేవారు పెరిగారు. మిగిలిన మాఫియాల లాగే సాహిత్య మాఫియాలు కూడా ఏర్పడుతున్నాయి. ఉదాహరణకు ప్రాజెక్టుల నిర్వాసితుల గురించి రాసిన వారే ప్రభుత్వ పర్యటనల్లో పాల్గొని పొగిడే కవితలూ రాసేస్తున్నారు. మోడీ సర్కారు హయాంలో అసహనం స్వేచ్ఛపై దాడి వంటి వాటిని ఖండిస్తూనే మితవాదంవైపు మొగ్గడం లేదంటే దాటేయడం కూడా పెరిగింది. జన కవనాల వంటి వరవడి స్థానే సర్కారీ సమ్మేళనంలో చదివి సత్కారం పొంది రావడం

ఘనతగా మారింది. ఇలా వెళ్లిన వారు కొంత కాలానికైనా అటు మొగ్గితే ఆశ్చర్యపోనవసరం లేదు. అది చూస్తున్నాం కూడా. అయితే ఇది ఆకస్మికంగా వచ్చే మార్పేమీ కాదు. అధికారపు హంగులకూ పొగడ్తలకూ ప్రచారానికి లోబడిపోతున్నకొద్దీ ప్రజలూ ఉద్యమాలూ దృష్టిపథం నుంచి తప్పిపోతుంటాయి. తెలుగు దినపత్రికల ఆదివారం అనుబంధాలలో కథలు చూడండి- ఒకరేమో కుటుంబాల సెంటిమెంట్లు మరోకరేమో కులీన వర్గాల ప్రేమ ఘర్షణలూ హైటెక్ స్పందనలే వుంటాయి.

వాస్తవానికి ఇది పరస్పర సంబంధం కలిగిన పరిణామం. ప్రజల నిత్య జీవితాలను పరిశీలించి వారి బాధల గాధలపై విజయాలు విషాదాలపై ఆకట్టుకునేట్టుగా రాసి వారికి చేర్చకపోతే కవుల రచయితల ను వారు పట్టించుకోరు. వారు పట్టించుకోరు గనక వీరు ఒక సమూహంగా తయారవుతారు. అందులో అనేక కొలమానాల ప్రకారం కొన్ని సమూహాలు ఏర్పడతాయి. (ప్రగతిశీల ప్రజాస్వామిక సామాజిక సంస్థలూ సంఘాలూ ఎప్పటిలాగే వుంటాయి. వాటిలో చేసేవారు చేస్తుంటారు.) వారిలో వారు మెచ్చుకుంటూ వుంటే గడిచిపోతుందనుకుంటారు. ఇది చూసి ఇంకా మరికొందరు వాటివైపు చేరిపోవచ్చు. ఏది ఏమైనా అంతిమంగా పాఠకులతో సంబంధం లేని రచయితల సమూహాలే వచ్చిన సాహిత్యంపై స్పందిస్తూ అంటే ప్రశంసిస్తూ ప్రశంసలు అందుకుంటూ వలయంగా మారతారు. ఆ క్రమంలో తమకు తమే మినహాయింపులు ఇచ్చుకుంటూ బయటకు విస్తరించే బదులు తాబేళ్లలా లోలోపలకి ముడుచుకుపోతుంటారు. ఇప్పుడు అస్తిత్వవాదం ఒక సాకుగా చూపిస్తారు. మరో వైపున ప్రపంచీకరణ మానవ సంబంధాలను విచ్ఛిన్నం చేసిందనే దరువు వేస్తుంటారు. అస్తిత్వ వాదంలోని ఆవేదనకు గల సామాజిక స్వభావం అలాగే మానవ సంబంధాల పునరుద్ధరణకు జరగాల్సిన సమిష్టి ప్రయత్నం వారి ఆలోచనల్లో తప్పిపోతుంటాయి. ఇదే అదనుగా స్పాన్సర్డ్ వలలు వచ్చి పడుతుంటాయి. ఉదాహరణకు పవన్ కళ్యాణ్ ఎంతకీ గుంటూరు శేషేంద్ర శర్మను కోట్ చేస్తారే గాని శ్రీశ్రీని తలవరు. అమితాబ్ బచన్ మోడీత్వను పరోక్షంగా ఆమోదించడానికి వెనుకాడరు. ఆంధ్ర ప్రదేశ్‌లో నవ కవులు పోలవరం గీతావళి ఆలపించడానికి వెనుకాడరు. ఇదంతా ఒకే పరిణామంలో భాగంగా గుర్తుంచుకోవాలి.

అయితే రైతుల బాధల గురించి లేదా అవినీతి అన్యాయాల గురించి రాసేవారు పెద్ద సంఖ్యలోనే వున్న మాట నిజం.

తెలంగాణలో నిన్నటి ఉద్యమ కవులలో అత్యధికులు ఇప్పుడు సర్కారీధీశుల కుడి ఎడమల డాలు కత్తులై మెరవడానికి తహతహలాడతారు. భూస్వామ్య భావజాలాలను నెత్తిన పెట్టుకోవడానికి సిద్ధమైపోతారు.

అయితే ప్రజల సమస్యలపైనా రైతుల బాధల పైనా రాసేవారు పెద్ద సంఖ్యలో లేరా అంటే వున్నారు. వారెప్పుడూవుంటారు కూడా. వారిని ఈ సమూహాలు తమలో కలుపుకుంటాయా కవులుగా రచయితలుగా గుర్తిస్తాయా అన్నది ఆనుమానమే. ఎందుకంటే విషయ పరంగా తమ చుట్టూ దడి కట్టుకుంటున్న ఈ తరహా రచయితలు శిల్పం రచనాశైలి వంటి వాటి గురించి కూడా కృత్రిమమైన లేదా అసహజమైన సూత్రీకరణలు తీసుకొచ్చేస్తారు. ఎవరైనా ఏదైనా కవిత్వం రాయొచ్చనే దశనుంచి ఫలానా ఫలానా రకాలుగా వుండాలని అభినవ భాష్యకారులై అర్థం కాని ప్రసంగాలు చేస్తుంటారు. దానివల్ల రాసేవారిలోనూ అపరాధభావన అల్పత్వ భావన పెరిగి తామూ ఇలాగే రాయాలనుకోవడం మొదలుపెడతారు. పైగా సాహిత్యం చుట్టూ ఈ హంగులూ ఆర్భాటాలు ఎప్పుడు పెంచుతుంటారో ఆ వెంటనే ఖరీదైన సాహిత్య వేత్తలూ సంపన్న సృజన కారులూ పెద్దపీట వేసుకుంటారు. పలుకుబడి గలవారి మాటే చెల్లిపోతుంది. బక్క రచయితలు బిక్కుబిక్కుమంటూ వుండిపోవాల్సి వస్తుంది.

రచయితల సంఘాలూ సంస్థలూ మరీ ముఖ్యంగా కమ్యూనిస్టుల వల్లనే సాహిత్యం మూసధోరణిలోకి మారిందని ఒకప్పుడు విమర్శలుండేవి. అందులో కొంత నిజం వుండొచ్చు గాని సాహిత్యాన్ని విస్తృత పర్చడంలో అవి గొప్ప పాత్ర పోషించాయి. కాని ఇప్పుడు చెప్పుకున్న నేపథ్యంలో సాహిత్యం మళ్లీ పై తరగతుల వైపు లేదా వారికి అవసరమైన లక్షణాల వైపు మరలుతున్నది. సమూహాలు గా ఏర్పరచిన వారు స్వమోహాలు అధికమైన వారు స్వతస్సిద్ధ చైతన్యాన్ని తాకట్టుపెట్టేవారు ఇందుకు కారకులవుతున్నారు. అందరూ ఆత్మపరీక్ష చేసుకోవలసిన సమయమిది. లేదంటే యథాతథంగా పరస్పర ప్రశంసా ప్రహసనం, స్వీయఘోషలే కవిత్వాలుగా భ్రమపెట్టే తతంగం సాగించుకోవచ్చు. ఏది ఏదైనా ప్రచారాలు ప్రలోభాలూ కూడా తాత్కాలికమేనని మాత్రం మర్చిపోతే ప్రమాదం. ◆

# దళిత ముస్లిం అస్తిత్వ సంవేదనా కథలు

- కాత్యాయనీ విద్మహే



భారత రాజ్యాంగం ప్రకారం పౌరులుగా అందరూ సమానమే కానీ కులం వల్ల కొందరు, మతం వల్ల మరికొందరూ వివక్షకు, అవమానాలకు గురికావటం వర్తమాన విషాదవాస్తవం. దీనికి నగ్న సాక్షులు ఈనాటి సమాజంలో దళితులు, ముస్లిములు. ప్రతికూల మతాధికార భావజాల వ్యవస్థలను, నిర్మాణాలను ధిక్కరిస్తూ దళిత ముస్లిమ్ మానవ అస్తిత్వాలు కొత్త శక్తితో మేల్కొంటున్న సమయం ఇది. ఈ నేపథ్యంలో దళిత ముస్లిమ్ జీవిత సంఘర్షణలను చిత్రించిన కథల పరామర్శ ప్రస్తుతాంశం. ఈ వ్యాసరచనకు నమూనాగా స్వీకరించిన కథలు 2013 సంవత్సరంలో వచ్చినవి.

భిన్న సామాజిక రంగాలలో, భిన్న సందర్భాలలో కులం నిర్ణాయక శక్తి అయి మనుషులను విడదీస్తూ, శాసిస్తూ నిర్వహిస్తున్న పాత్ర పట్ల క్రోధం వస్తువుగా కథలు రాసిన వాళ్ళలో జూపాక సుభద్రను, పసునూరి రవీందర్‌ను ముందుగా పేర్కొనాలి.

జూపాక సుభద్ర రాసిన కథలు మూడు. మీరెట్ల వెజ్జులు (మే) కలమ్మ కలకలం (భూమిక, జూన్) మా అయ్య (అక్టోబర్) ఉద్యోగం చేసే చోట ఆహారపుటలవాట్ల పట్ల అసహన రూపంలో వ్యక్తమయ్యే కుల వివక్షను మొదటికథలో చిత్రించింది. వరంగల్ మారుమూల వూరి నుండి హైదరాబాదులో ఉద్యోగానికి వెళ్ళిన యువతికి మధ్యాహ్నం కలిసి భోజనం చెయ్యటానికి మంచి మిత్రులు దొరకక పోవటం ఇందులో సమస్య. ఆమె పనిచేసే ఆఫీసులో మహిళలు చాలామందే వున్నా కలిసి లంచ్‌తినే సన్నిహితులైన ఏ మహిళా గ్రూపు ఆమెను తమలో చేర్చుకోలేదు. ఎందుకని అన్నది ఆమె ప్రశ్న. తన పట్ల అంటరానితనమేదో వాళ్ళు అమలు చేస్తున్నారన్నది ఆమె అనుభవం. తాను మాంసాహారం తింటుందని వాళ్ళు వెలివేస్తున్నారని, తాను తెచ్చిన చిక్కుడు కాయ కూర కూడా తినటానికి వాళ్ళు సిద్ధంగా లేరని తెలిసి వచ్చినపుడు – ఆమె ఆత్మగౌరవ ప్రకటనకు చేసిన పనులు రెండు. ఒకటి పశువుల పాలను తాగుతూ వాటి నుండి వచ్చే పెరుగును, నెయ్యిని తినే వర్గాలు వెజిటేరియన్లు ఎట్లవుతరని ధిక్కరించి ప్రశ్నించటం. రెండవది నేను తెచ్చిన కూర మీ కెంత అంటరానిదో మీ కూరలు కూడా నాకంత

నిషేధించవలసినవే అని తన ప్లేట్లో వాళ్ళేసిన కూరలను చెత్తబుట్టలో పారెయ్యటం. ఒక రకమైన ఆహారపుటలవాట్లు గొప్పవిగానూ మరొక రకమన ఆహారపుటలవాట్లు హీనమైనవిగానూ చూచే అహంకార ప్రవృత్తికి చెంపపెట్టు వంటి కథ ఇది.

మీరెట్ల వెజ్జులు కథలో సామాజిక రంగాలలో కుల వివక్షా సంస్కృతిని విమర్శకు పెట్టిన సుభద్ర "కలమ్మ కలకలం" కథలో రాజకీయ రంగంలో వివక్షపై ధ్వజం ఎత్తింది. దళిత మహిళ గ్రామసర్పంచ్ అయితే ఆమె అధికారాలు చలాయించే గ్రామదొరలు, ఆమె పదవికి గౌరవమిచ్చి మాట్లాడలేని హీనస్థాయిలో వున్న ప్రభుత్వాధికార వ్యవస్థ - రెండూ దళిత మహిళల ఆత్మగౌరవాన్ని దెబ్బతీస్తునే వున్నాయి. కులం, ధనం రెండే మనిషికి విలువను తెచ్చిపెట్టే ప్రమేయాలైన వ్యవస్థలో దళిత మహిళ ధర్మాగ్రహం ఎలా వుంటుందో ఈ కథల్లో చూపింది సుభద్ర. దళిత కులానికి చెందటం, కూలి చేసుకొని బతకాల్సిన పరిస్థితి. రెండూ సర్పంచ్‌గా ఊరికి పెద్ద అయినా తన పెద్దరికానికి అవరోధం అవుతున్నాయని గుర్తించిన దళిత మహిళా సర్పంచ్ కలమ్మ అంబేద్కర్ యువజన సంఘాన్ని కలుపుకొని తనను అవమానించిన ఎస్ఐ పై యుద్ధం ప్రకటించటం సృష్టించిన కలకలమే ఈ కథ.

పసునూరి రవీందర్ రాసిన రెండు కథలు మీసాలోడు (ఆంధ్రజ్యోతి ఆదివారం) , గోవర్ణం (సారంగ నవంబర్ 13), స్నేహితుడి ఇంట్లో పెళ్ళికి గ్రామానికి వెళ్ళి పెళ్ళి భోజనాల ఏర్పాటులోనూ నిచ్చెనమెట్ల కులవ్యవస్థ పద్ధతిని అమలు చేస్తూ పెత్తనం చేసిన మీసాలోడి వ్యవహారం చూచి ఆ క్రమంలో భోజనానికి తన వంతు ఎప్పుడొస్తుందో తెలియక తినకుండానే వెనుదిరిగి వచ్చిన దళిత యువకుడి అనుభవం మీసాలోడు కథాంశం. ఊరందరి వ్యవహారాలలో ఊరిదొరల పెత్తనం, దళితుల పట్ల చిన్నచూపు, తిరస్కారం దళితుల ఆత్మగౌరవాన్ని దెబ్బతీసే విధంగా గ్రామీణ సామాజిక సంస్కృతిలో సజీవంగానే వుండటం పట్ల వేదన ఈ కథలో కనబడుతుంది. దళితుల పైననే కాదు ఈ పెత్తన వ్యవస్థ బహుజనులనూ అవమానించేదిగానే వుందని, దానిని ఎదిరించలేని నిస్సహాయత గురించి కూడా ఆలోచించాలని ఈ కథ సూచిస్తుంది.

మనువాదం ఆధునిక సాంకేతిక యుగంలోకి, వ్యాపార సంస్కృతిలోకి ప్రవేశించిన సామాజిక దుర్మార్గంపై విమర్శగా వచ్చిన కథ గోవర్ణం. స్వంత ఇంటి గురించి కలలు కంటూ వాయిదాల పద్ధతిలో స్థలం కొనుక్కోవాలని గోవర్ణభూమి వెంచర్స్ ఆఫీసుకు వెళ్ళిన దళిత యువకుడికి ఎదురైన అనుభవం - బ్రాహ్మణులకు తప్ప వేరే వారికి అక్కడ స్థలాలు అమ్మరని తెలియటం, కార్పొరేట్ సంస్కృతిలోకి కూడా మనువు కొత్తరూపంలో ప్రవేశించటంగా దానిని వ్యాఖ్యానిస్తాడు కథకుడు.

అగ్రవర్ణ ఆధిపత్యం నిమ్న కులాల ఎదుగుదలకు అవరోధం అవుతున్న పరిస్థితిని చిత్రించిన కథ బిరుసు సురేష్‌బాబు రాసిన రాతిగుండె (కుల నిర్మూలన, మార్చి-ఏప్రిల్) అంటరానితనం నేరం అని రాజ్యాంగ నైతికతను నేర్పుతున్న సమాజంలోనే అంటరాని తనాన్ని పాటించే పెద్దల వైఖరి పిల్లలను ఎంత ఘర్షణకు లోను చేసి గాయపరుస్తుందో చూపిన కథ దీపిక ఉపులూరి రాసిన దమయంతి.

కుల సమస్య వివాహానికి అడ్డుకావటం సమాజంలో వున్నదే. క్రైస్తవులలో కూడా కులవ్యవస్థ వివాహ విషయంలో ఒక అభ్యంతరకరమైన అంశంగా మొనతేలటాన్ని చిత్రించిన కథ షర్మిళ... ఓ జీవితకాల ఊర్మిళ (మేరి, నెలవంక, నెమలీక, జ్యేష్ఠ) కులాంతర వివాహాలలో పిల్లలకు తల్లి కులమో, తండ్రి కులమో కావాలా అన్న ప్రశ్నకు భర్త నుండి విడిపోయిన భార్యకోణం నుండి చర్చకు పెట్టిన కథ కె. సుభాషిణి రాసిన 'నాణెంకు మరోవైపు' (విహంగ, ఫిబ్రవరి)

దళితులలోకెల్ల మరింత బాధితులు సఫాయి పని వాళ్ళు. చెత్తను ఎత్తిపోసే మున్సిపాలిటీ సపాయి కార్మికుల ఆత్మ గౌరవాన్ని కాపాడటమంటే చెత్తను వేరు వేరు కవర్లలో పోయటమేనంటాడు గుమ్మడి రవీంద్రనాథ్ ఆత్మగౌరవం ఒక సంచిలో... (నవ్య, ఫిబ్రవరి) అనే కథలో.

ముస్లిముల జీవన సంఘర్షణలు వస్తువుగా వచ్చిన కథలు తక్కువే. మతం మానవ సంబంధాల నిర్ణాయక శక్తి అయినప్పుడు ద్వేషం జడలు విప్పుకొని మనుషులను పిచ్చివాళ్ళుగా, గుడ్డివాళ్ళుగా మార్చి విధ్వంసానికి కారణమవుతుంటుంది. వి. చంద్రశేఖరాచారి ముసుగు (నవ్య, జనవరి 16) కథకు వస్తువు అదే. హిందూ ముస్లిముల మధ్య నిత్యజీవితంలో స్నేహాలున్నాయి. ఒకరి క్షేమం పట్ల ఒకరికి

పట్టింపు వుంది. కానీ ముస్లిమ్‌లు హిందువులూ రెండు పక్షాలుగా చీలి దాడులు చేసి, చంపుకొనే సందర్భాలలోనే సమస్య. అవి ఎవరి ప్రయోజనాల కోసం ఎవరు ప్రేరేపిస్తే జరిగేవో కారణాల సూచన లేదు. కానీ హిందువులు తాను ముస్లింనని గుర్తించి చంపటానికి వస్తున్నప్పుడు పారిపోతూ రక్షణకై దొరికిన కాషాయవస్త్రాలు ధరించి వారి నుండి తప్పించుకొన్న మనిషిని ఆ కాషాయ వస్త్రాల మూలంగా హిందువుగా భావించి ముస్లిములే చంపటం అనే ఒక సంఘటనాత్మక కథనం ఇది.

పి. రాజ్యలక్ష్మి ఉట్లసంభాల వీధి (విహంగ, మార్చి) అనే కథలో ఎవరి మీద ఆధారపడకుండా, ఏ కొడుకు ఇంటికీ వెళ్ళకుండా తన జీవితం తాను స్వతంత్రంగా గడుపుతూ ఆ వీధిలోని ఇళ్ళన్నింటికి హిందూ ముస్లిం భేదం లేకుండా వెళ్ళగలిగిన వాళ్ళ మనిషిగా మెసల గలిగిన వ్యక్తిత్వం కలిగిన వృద్ధ ముస్లిం స్త్రీ అనుభవాన్ని చిత్రించింది.

మిగిలిన ఏడు కథలూ ముస్లిం రచయితలు రాసినవే. హిందువులు ముస్లిం అమ్మాయిని పెంచుకొనటం వస్తువుగా హనీఫ్ రాసిన కథ అల్విదా (ప్రజాసాహితి, జూన్). తల్లి మంచాన పడ్డప్పుడు కన్న కూతురు నిర్లక్ష్యం చేసినా పెంచిన బిడ్డ అన్నీ తానై చేయటాన్ని చిత్రించి మనుషుల మధ్య ప్రేమకు, బాధ్యతకు మతం అడ్డం కాదని చెప్పాడు రచయిత.

సయ్యద్ సాబిర్ హుసెన్ రాసిన నీకినాకి (ప్రజాసాహితి, ఆగస్టు) కథ సాహిత్యరంగంలో అన్యమతస్థులుగా చివరి అంచులకు నెట్టవేయబడుతున్న ముస్లిముల ఆందోళనను ప్రతిఫలించింది.

ముస్లిం జీవిత సంవేదనలను విస్తృతంగా కథలుగా రాస్తున్న వ్యక్తి స్కైబాబ. అతను రాసిన కథలు మూడూ వైవిధ్య భరితమైనవి. మిస్ వహీదా ఒక భగ్న ప్రేమకథ (ఆంధ్రజ్యోతి, ఆదివారం, మే 26) మిస్‌వహీదా మిస్ వహీదా కాదు, మిసెస్ వహీదానే. ఆమెది భగ్న ప్రేమ కాదు. భగ్నమైన జీవితం. ప్రేమలేని జైలు జీవితం. ప్రేమరాహిత్య పేలవ జీవితంలో ప్రేమలతను అల్లుకొనటానికి ఆమెకు దొరికిన అవకాశం కథకుడు ఎవరికో చేయబోయిన ఫోను తనకు రావటం. మాట కలిపిన స్నేహబలంతో ఆరునెలలు జీవితాన్ని లాగగల ఆశను, ఆసరాను పొందగలగటం.

వహీదా జీవితాన్ని, ఆ జీవితంలోని ఆశను, ఆశాభంగాలను ఆకాంక్షలను, వైఫల్యాలను పరదాలు తొలగించి చూపే వ్యక్తి నేను అని ఉత్తమ పురుషలో తన అనుభవాన్ని చెప్పిన నిసార్. అతను ఆరు నెలలకు పైగా ఆమెతో ఫోనులో నిత్య సంభాషణ చేశాడు. పెళ్ళి గురించిన ఆమె కలలను, దాంపత్య సంబంధాల గురించిన ఆమె ఆలోచనలను పంచుకొన్నాడు. అలాంటి ఆమె నుండి ఫోన్లు ఆగిపోతే ఎందుకు ఆగిపోయాయో తెలుసుకొనటానికి పోకుండా వుండలేనంత ప్రభావితం చేసింది వహీదా అతనిని. తీరా వెతుక్కొని వెళ్ళేసరికి వహీదా ఆత్మహత్య చేసుకొని మరణించిందని తెలియటంతో నిసార్‌తో పాటు పాఠకులకీ కూడా ఒళ్ళు కంపించిపోతుంది. కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతాయి.

పెళ్ళయి పిల్లల తల్లి అయిన వహీదా పెళ్ళికానట్లు, నిసార్‌పై ఆశ వున్నట్లు ఎందుకు మాట్లాడింది? అంటే ఆ పెళ్ళిలోని ఊపిరాడని తనం నుండి, ఒకింత గాలి కోసం, వెలుతురు కోసం తడుములాటలో భాగంగా మాట్లాడింది. నిత్య నిర్బంధ హింసామయ సాంసారిక జీవితాన్ని అనుభవిస్తూ అది తన అక్క అనుభవంగా చెప్తూ తానింకా తనను అర్థం చేసుకొని లాలించి ప్రేమించే సహచరుడి గురించి కలలు కనే ఊహాశక్తి బలంతో బతికింది. ఊహల్లో బతకటాన్ని కూడా అసాధ్యం చేసిన కఠోర జీవిత వాస్తవాలు ఆమెను ఆత్మహత్యవైపు నెట్టాయి. లైంగిక నియంత్రణ, కదలికల మీద నిషేధం, మనసుతో ప్రమేయం లేని దాంపత్య సంబంధాలు, నిరాకరించబడిన మానవ హక్కులు స్త్రీలందరికీ సమానమే అయినా, అలాంటి సందర్భాలలో ఇల్లే వాళ్ళ పాలిట జైలు అయినా ముస్లిం స్త్రీల విషయంలో అవి రెట్టింపు ప్రభావాన్ని వేస్తాయి. ఆలోచనలు, అభిప్రాయాలు, సృజన శక్తులు అన్నింటినీ మెదడులోనే మనసులోనే కప్పి పెట్టుకొనటంతోపాటు శరీరాన్ని బురఖా కింద కప్పి పెట్టుకొనవలసిన స్థితిలో వాళ్ళున్నారు. బురఖాతో ప్రపంచం నుండి వేరుపడి, ప్రపంచంతో సంబంధం లేని వాళ్ళుగా చేయబడిన ముస్లిం స్త్రీల భగ్న ఆకాంక్షలను, జీవితేచ్ఛను మిస్ వహీదా కథ ద్వారా శక్తిమంతంగా బయటపెట్టాడు స్కైబాబ.

స్కైబాబ రాసిన మరొక కథ లతీఫ్ మియా శాస్త్రం. (బతుకమ్మ డిసెంబర్15). ముస్లింలు ఆవు మాంసం తినటం నేరంగా చూడబడుతూ మెజారిటీ హిందూ సమాజం నుండి

వాళ్ళను పరాయీకరిస్తుంది. ఆవుమాంసం తినటంలోని ఆర్థిక కారణాలను విప్పిచెప్పటంతోపాటు ఈ కథలో స్కైబాబ దళిత బహుజన కులాలతో ముస్లిములకు వుండే స్నేహ సంబంధాల గురించిన గ్రామీణ జీవిత పార్శ్వాన్ని కూడా చూపించాడు. లతీఫ్‌మియా ఊరందరి కష్టసుఖాలు పంచుకొంటూ తలలో నాలుక అయినవాడు. అయితే కూతురి పెళ్ళి సందర్భంగా గొర్రెలనో, కోళ్ళనో కోసి వూరందరికీ విందు చేయగల ఆర్థిక స్థోమత లేనివాడు. తన ఇంట్లో విందుకోసం ఉవ్విళ్ళూరుతున్న ఊరివాళ్ళను స్వచ్ఛందంగా రాకుండా చేయటానికి అతను ఎన్నుకొన్న మార్గం చవకగా దొరికే ఆవు మాంసంతో పెళ్ళి విందు వెళ్ళదీయటం. అతని బహుజన కులాల స్నేహితులు, అతనిలాగే పేదరికం బరువు తెలిసిన స్నేహితులు అతని సమస్యను తమ సమస్యగా బాధ పడగలిగినవాళ్ళు అతనికి ఆసరాగా నిలబడటం ఈ కథలోని మానవీయ సౌందర్య ప్రకర్ష.

ముస్లిములు, దళితులు, బహుజనులు బ్రాహ్మణీయ మనుధర్మం వల్ల సమానంగానే పీడితులు, బాధితులు కనుక వాళ్ళ మధ్య ఐక్యతను సంభావించాడు స్కైబాబ. లతీఫ్‌మియా కథలో లతీఫ్‌మియాకు గ్రామీణ బహుజనులకు మధ్య చూపిన అన్యోన్యత అతని ఆదర్శం. అలాగని అతను వాస్తవాలను విస్మరించలేదు. ఆదర్శం ఆచరణ రూపం తీసుకొనే క్రమంలో పరిష్కరించుకోవలసిన సమస్యల గురించి కూడా అతనికి అవగాహన వుంది. ఆ అవగాహన నుండి వచ్చిందే 'అంటు' కథ (సారంగ, వెబ్ పత్రిక, డిసెంబర్ 26) ముస్లిముల అమ్మాయి దళిత అబ్బాయిని ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకొన్నప్పుడు వచ్చే సమస్యలు, సంఘర్షణ ఈ కథకు వస్తువు. అబ్బాయి ముస్లిములలోకి మారితే ఆమోదిస్తామనే అమ్మాయి వైపు వారి ప్రతిపాదనలను మతం మార్చుకొంటే దళిత రిజర్వేషన్ కోల్పోవటం, తీవ్రవాదులుగా హిందూ సమాజపు అనుమానానికి ఎరకావటం, జరుగుతుందనే అబ్బాయి తరఫువారి ఆందోళనలను ఒక అభ్యుదయ ముస్లిమ్ అధ్యాపకుడి కోణం నుండి చర్చలోకి తెచ్చాడు స్కైబాబ.

భారతీయ సమాజంలో ముస్లిములను పరాయీకరించి చూచే ఒక వికృతి మానవ సంబంధాలలో సృష్టిస్తున్న ఒత్తిడి, హింస వస్తువుగా వచ్చిన రెండు కథలు – వేంపల్లె షరీఫ్ రాసిన అమ్మబొమ్మ (ఆంధ్రజ్యోతి ఆదివారం, మార్చి 17) అఫ్సర్ రాసిన 'సాహిల్ వస్తాడు' (ఆంధ్రజ్యోతి, ఆదివారం, మే 26) తెలుగు వర్ణమాల పుస్తకంలో 'అ' అనే అక్షరాన్ని అమ్మబొమ్మ సహాయంతో నేర్పించే పద్ధతి విస్తరించిన కథ అమ్మ బొమ్మ. అక్షరానికి అమ్మ మాటకు దగ్గర సంబంధాన్ని భావన చేసే హృదయపు మెత్తదనం, అమ్మ అనే మాటకు, అమ్మ రూపానికి వుండే పిల్లలను ఆకట్టుకొనే శక్తి. చదువు కూడా అమ్మ లాంటిదే అన్న తర్కం – వీటి మీద అంచెలంచెలుగా కథను నిర్మించుకొంటూ పోయి అమ్మ బొమ్మ వున్న తెలుగు వర్ణమాల విషయంలో పక్కింటి అమ్మాయితో కొడుకు గొడవ పడిన సందర్భంలో హిందూ ముస్లిమ్ వైరుధ్య వాస్తవంలోకి ఒక తండ్రి కళ్ళు తెరుచుకొనటంతో ఈ కథ ముగుస్తుంది.

వర్ణమాల పుస్తకంలో 'అ' అనే అక్షరానికి గీసే అమ్మబొమ్మకు బొట్టు వుంది. ఆ బొట్టుతో నిమిత్తం లేకుండా అన్ని మతాల వాళ్ళు అక్షరమైన అమ్మలో తమ అమ్మలను, తమ బాల్యపు ముద్దు మురిపాలను చూసుకొన్నారు. ఆ జ్ఞాపకాలే హృదయంలో మోస్తున్నారు. ఆ కాలం పోయి హిందూ ముస్లిం తేడాలను పిల్లల మెదళ్ళకు కూడా ఎక్కించే కాని కాలం వచ్చింది. దాని ఫలితమే వర్ణమాల పుస్తకంలోని అమ్మ బొమ్మ విషయంలో ఆటలాడుకొనే వయసు చిన్న పిల్లల మధ్య వివాదం రావటం 'అ' అనే అక్షరానికి వర్ణమాల పుస్తకంలో వున్న అమ్మ బొమ్మలో అమ్మ తన అమ్మే కాని సాహిల్ వాళ్ళమ్మ కాదన్నది పొరుగింటి అమ్మాయి వాదం. ఆ బొమ్మలోని అమ్మకు బొట్టు వుంది. తమ అమ్మకు బొట్టు వుంది. అందువల్ల ఆమె తన అమ్మ మాత్రమే. సాహిల్ వాళ్ళమ్మకు బొట్టు వుండదు కనుక బొట్టు వున్న ఈ బొమ్మలోని అమ్మ వాడి తల్లి కాదు అన్నది ఆ పిల్ల తర్కం. ఈ కొత్త విష పరిణామాల పట్ల ఉత్తమ పురుషలో తన ఆలోచనలను, అనుభవాన్ని కథనం చేస్తున్న సాహిర్ తండ్రి ఆందోళనను మన అందరిలోకీ కూడా ప్రవహింపచేస్తుంది ఈ కథ.

వర్తమాన హిందూ సమాజ రాజకీయాలలో స్వదేశంలోనే శత్రుదేశపు మనుషులుగా, ఉగ్రవాదులుగా ముస్లిం యువత అనుమానితులుగా చూడబడుతున్న విషాద సందర్భాలను, హిందూ యువత, కోణం నుండి వ్యాఖ్యానించిన గొప్ప కథ 'సాహిల్ వస్తాడు'.

ముస్లిం తీవ్రవాద సంస్థలకు, పాకిస్థాన్‌కు దేశీయ ముస్లింలకు బాధ్యులుగా చూసే దృష్టి, అనుమానితుల జాబితాలో చేర్చే రాజకీయం ఒక అంతర్జాతీయ కుట్రలో భాగంగా విస్తరిస్తున్న నేపథ్యంలో 2013 ఫిబ్రవరి 21న హైదరాబాదులో జరిగిన బాంబు పేలుడు ఘటనానంతర పరిణామ చిత్రణగా అఫ్సర్ రాసిన కథ 'సాహిల్ వస్తాడు.

ఒకానొక ఆదివారం కనిపించకుండా పోయిన సాహిల్ గురించి వెతుకులాట ఈ కథంతా. వెతుకులాడింది ఎవరు? అతనికి ఇంటర్మీడియట్ చదువుతున్న రోజుల నుండి అత్యంత ఆత్మీయమిత్రులు రాము, ఫణి, ఉత్తమ పురుషలో కథ చెప్పే పాత్ర రాము. పెళ్ళిళ్లు, ఉద్యోగాలు, పది పన్నెండేళ్ళ పిల్లలు. అయినా ప్రతి ఆదివారం సాయంత్రం చాయ్ మహల్‌లో కలిసి కబుర్లు చెప్పుకొనే స్నేహం వాళ్ళది. కుటుంబస్నేహాలు విస్తరించి బలపడిన స్నేహం వాళ్ళది. కనిపించకుండా పోయిన సాహిల్ గురించిన వెతుకులాటలో ఎదురైన అనుభవాలతో నలిగి, వేదన పడిన రాము కోణం నుండి ఈ కథలో కనబడకుండా పోయిన సాహిల్ అర్థం అవుతాడు. రాజ్య స్వభావమూ అర్థం అవుతుంది.

సాహిల్ ఒక సున్నితమైన మానవుడు. మిత్రులను, హసీనాను, రాము కూతురు తితిలీని ఎవరిని ప్రేమించినా హృదయమంతా ఇచ్చి ప్రేమించిన వాడు స్నేహాన్ని అభిమానాన్ని ఆరాధనను, వాత్సల్యాన్ని సదా తాజాగా నిలుపుకొనేవాడు. ప్రేమతో బాధ్యతతో జీవించటానికి తన మతధర్మం నుండి విలువలను స్వీకరించినవాడు. అలాంటి సాహిల్ ఆ మిత్రులను, ఆ భార్య పిల్లలను వదిలి పోయేట్లు వెంట తరిమిన శక్తి ఏమిటి? ముస్లిముల పట్ల భారతీయ సమాజంలో పెరుగుతున్న అసహనం. పనిగట్టుకొని దానిని పెంచుతూ ప్రచారం చేస్తున్న రాజ్యం. సాహిల్ కనబడటం లేదని రాము, ఫణి, సాహిల్ భార్య హసీనాను తీసుకొని పోలీసు స్టేషనుకు వెళ్ళినపుడు ఎదురైన అనుభవం చెప్పిన సత్యం అది.

సాహిల్ పేరు వినగానే స్కూల్ ఇన్‌స్పెక్టర్ గొంతులో ప్రతిధ్వనించిన వెటకారం, ముస్లింతో హిందువులకు స్నేహమేమిటన్నట్లు చూచిన చూపు, ముస్లింకు అతనిచ్చిన నిర్వచనం చేసిన హెచ్చరికలు – ముస్లిములు అయినందుకు సాహిల్ వంటి యువకులు ఎంతమంది ఎన్ని అవమానాలు, అనుమానాలు, అనుభవించటానికి వీలుందో స్పష్టం చేస్తాయి.

"ఈ లోకం ఎలాంటిదో ఎంత చెప్పినా నీకు తెలియదు.
సీతాకోక రెక్కల మీది హరివిల్లుని తుడిచేస్తుంది
అవేవో కృత్రిమ రంగుల్ని చెక్కుతుంది
పడమటి సంధ్యకు నెత్తురు పూసి రక్తపాతం అంటుంది
అనుమానాలూ అవమానాలూ సందేహాలూ సంశయాలూ
దీని ఒంటినిండా
తుడిచెయ్ శుభ్రంగా "

– రామూ గుర్తు చేసుకొన్న సాహిల్ పాడిన ఈ గజల్ ఆ విధమైన హింసలో అతనెంత గిలగిలలాడాడో, అబద్ధాలతో కలుషితమవుతున్న లోకపు పరిశుద్ధత కోసం ఎంత తపించాడో స్పష్టమవుతుంది. ఈ నేపథ్యంలో అతను అనుమానితుల జాబితాలో మాయం చెయ్యబడ్డాడా లేక అనుమానాన్నే నిజం చెయ్యాలన్న కసిని పెంచుకొన్నాడా? అసలు తిరిగి వస్తాడా అన్న అనేకానేక ప్రశ్నలు కలుగుతాయి. ఈ క్రమంలో ధ్వంసమయ్యే జీవితాల, మానవత్వాల పునరుజ్జీవనం సాహిల్ ఆకాంక్ష.

లోపల వొక సీతాకోక చిలక వుంటుంది
అదే తపనతో, అదే ప్రాణంతో
అది ఇంకో మృతదేహంగా మిగలకుండా
కల్మషం లేని ఏ మల్లెపూవు చేతులు
కాపాడుతాయో
ఏ లోతుగొంతులోని స్వచ్ఛమయిన పదాలతో అది
మళ్ళీ మళ్ళీ ప్రాణం పోసుకుంటుందో
వొక్కొకసారి కాదు చాలా సార్లు
ఇంకా కొనిసార్లు అది నువ్వు కూడా " – సాహిల్

పాడే గజల్ లోని విషాద సౌందర్యం ఆ ఆకాంక్షే. మతాలకు అతీతంగా మానవాత్మ పునరుజ్జీవనానికి మనిషి చెయ్యాల్సిన యుద్ధం. దానికి తోటి మనిషి నుండి అందాల్సిన సహాయం ఇందులో ధ్వనిస్తాయి. సీతాకోకచిలక ఈ కథలో ప్రారంభం నుండి ముగింపు వరకు ముస్లిం అస్తిత్వానికి ప్రతీక. ఆ ప్రతీకకు మానవ రూపం సాహిల్ పెట్టుకొన్న ముద్దుపేరుతో పిలవబడే రాము కూతురు తీతిలీ. మమత తప్ప మతం తెలియని ఆ పాప ఇచ్చే భరోసా ఈ కథకు జవం. జీవం. ◆

## ధన శ్వాసలో మరణం...!

- ఝాన్సీ కె.వి.కుమారి
9010823014

గడిచిన కాలమంతా
నువ్వు నడిచి వచ్చిన
పంట పొలాలన్నీ
దేశానికి అన్నం ముద్దలయ్యాయి...
ఆరుగాలాల పంటలతో
సస్యశ్యామల ధరణి
రైతు గుండెలో
సంతృప్తి రాగాలు మీటింది...
కానీ... ఎక్కడో
మనిషి కన్ను కుట్టింది
కాలం కన్నెర్రజేసింది
పంట పొలాలన్నీ
ధన రత్న గర్భాలుగా
దర్శనమిచ్చాయి
రైతన్న మెడను
ఉరితాడై కౌగిలించాయి...

మట్టిని అన్నం మెతుకులుగా మలిచి
దేశం నోటికి అందించిన రైతు
పంచభూతాల కుట్రకు బలై
నింగికీ నేలకూ మధ్య
సిలువలో వేళ్లాడుతున్నాడు...
పంట పొలాల్లో
ఇక మొలకెత్తేది... మరణమే..!

ఇది మరణం మొలకెత్తే కాలం..!
పునరుద్ధానం లేని మరణం..!!
రైతులు, పంటలు, పొలాలు



ఇక శిథిల నాగరికతల
జాబితాలో మిగిలే జ్ఞాపకాలు..!

మనిషి ఇప్పుడు
ధనాన్ని శ్వాసిస్తున్నాడు
మనిషి దేహంలో
ఇప్పుడు ప్రవహించేది
రక్తం కాదు... ధనం..!

ధన శ్వాసలో రగిలి, మలిగి,
మరిగి..
మునిగిన మనిషి
అందులోనే కరిగిపోతాడా..?
కనుమరుగై పోతాడా..? ♦

---

## మట్టి గొంతుక

- కొండి మల్లారెడ్డి
9441905525



ఆలిని అమ్ముకోలేదు కాని
తాను కట్టిన తాళిబొట్టుని
తాకట్టు పెట్టిన
సత్య సంధుడు...

కవచకుండలాలు
వొలిచి ఇవ్వలేదు కాని
కనిపించని కత్తిగాట్ల
గాయాలను మోస్తున్న వాడు

తొడలోంచి
పిడికెడు మాంసాన్ని
కోసి ఇవ్వలేదుగాని
తనువులోని
అణువణువునూ
ధారపోసినవాడు

అన్నదమ్ములీన్నీ
అర్ధ రాజ్యాన్నీ
ఫణంగా పెట్టలేదు కాని

బతుకు మాయాజూదంలో
సర్వస్వం ఓడిపోతున్న వాడు

వెన్నెముకను
వజ్రాయుధానికి ఇవ్వలేదుకాని
వంగిపోయిన ఈ దేశపు
వెన్నుపూసను
నిటారుగా నిలబెడుతున్న వాడు

హరిశ్చంద్రుడు
కర్ణుడు శిభి
ధర్మరాజు దధీచిలా
పురాణ పురుషుడై
చరిత్ర కెక్కలేదు

అర్ధాయుష్కుడన్న
అపవాదుని మూటగట్టుకొని
అధర్మ యుద్ధంలో
అర్ధాంతరంగా నిష్క్రమిస్తున్న వాడు

ఇప్పుడు
పొలాలన్నీ
శిథిల శకలాల ఆనవాల్లే కదా!
ఊర్ల శివార్లన్నీ
అసహజంగా మొలుచుకొస్తున్న
ఫెన్సింగ్ శిలల సమూహాలే కదా..!! ♦



# నాకు దళిత నేపథ్యం నుంచి స్త్రీ గా రాయాలనిపించింది.

- చల్లపల్లి స్వరూపరాణి

■ మీ కుటుంబ నేపథ్యం చెప్పండి...

■ మా స్వస్థలం గుంటూరు జిల్లాలో తెనాలి పట్టణానికి దగ్గర గ్రామం, ప్యాపర్రు. మాది దళిత(మాల) సామాజిక వర్గంలో దిగువ మధ్య తరగతి వ్యవసాయ కుటుంబం. మా తల్లిదండ్రులు- మరియమ్మ, మంత్రయ్య. మేము ఆరుగురం సంతానం - ఐదుగురు అమ్మాయిలు, వొక అబ్బాయి. అన్న అందరికంటే పెద్ద, నేను ఆడపిల్లల్లో మధ్య. మా అమ్మ తన తల్లిదండ్రులకు వొక్కతే సంతానం కావడం వలన మేము మా అమ్మ పుట్టింట్లో అంటే అమ్మమ్మ, తాతయ్యలతో కల్సి వుండేవాళ్ళం. మా తాతయ్య, అమ్మమ్మలకు మగ సంతానం లేరని వాళ్ళు మా అన్నయ్యని బాగా గారాబం చేస్తే మా నాన్నకి ఆ ధోరణి నచ్చేది కాదు. ఆయన మాత్రం ఆడ పిల్లల్ని మొగపిల్లవాడితో సమానంగా చూడడమే కాదు. అన్ని పనులు చెయ్యడం, సొంతగా ఆలోచిస్తూ ఆత్మ గౌరవంగా వుండడం అలవాటు చేశాడు. మా అమ్మ యేడవ తరగతి వరకు చదువుకుంటే, నాన్నకి ఫార్మల్ యెడ్యుకేషన్ లేదు. అయినా కొంచెం చదవడం, రాయడం తెలుసు. ఆయనలో చదువుకి సంబంధం లేని గొప్ప సంస్కారం, రిఫైన్‌మెంట్ వుండేది.

■ మీ రచనా నేపథ్యం...

■ నేను డిగ్రీ యెకనామిక్స్ లో, ఎం.ఏ ఆర్కియాలజీ లో, ఎం.ఫిల్ హిస్టరీ లో, పీ.హెచ్ డీ రీజినల్ స్టడీస్ లో చెయ్యడం వలన అన్ని సామాజిక శాస్త్రాలను చదివే అవకాశం కలిగింది. కుల వ్యవస్థ, మతం మీద పరిశోధన చేసేటప్పుడు ఆంత్రోపాలజీని కూడా అధ్యయనం చేసే అవకాశం వచ్చింది.

మాది యెటువంటి సాహిత్య వాతావరణం లేని కుటుంబం. అయితే నాకు స్కూలు, కాలేజీలలో మొదట్లో నాన్ సీరియస్ సాహిత్యం చదవడం నుంచి క్రమంగా వుద్యమ సాహిత్యం చదవడం చైతన్యవంతమైన స్నేహితుల ద్వారా అలవడింది. దానికి హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ వాతావరణం బాగా వుపయోగ పడింది. అక్కడ నాలాగా గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చిన దళిత విద్యార్థులు అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ పేరుతో బాగా కల్సి సమస్యల మీద పనిచెయ్యడంతో బాటు వుద్యమ సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యడం, చర్చించడం వుండేది. ఆ క్రమం లోనే కవిత్వం రాయడం, అందులో మంచి చెడులు మాట్లాడుకోవడంతో బాటు మా విద్యార్థులు రాసిన కవితలతో 'గుండె డప్పు' అనే కవితా సంకలనం తీసుకొచ్చాము. దానిలో పట్టేటి రాజశేఖర్,

కోయి కోటేశ్వర రావు, నాగప్ప గారి సుందర్రాజు, కనకయ్య, కాకాని సుధాకర్, జి.వి.రత్నాకర్, నేను వున్నాం. సిటీలో జరిగే సాహిత్య సభలకు వెళ్ళడం, శివసాగర్( కె.జి. సత్యమూర్తి) గారితో పరిచయం, దళిత కవుల్లో బాగా సీరియస్ గా రాసే కలేకూరి ప్రసాద్, మద్దూరి నగేష్ బాబు, పైడి తెరేష్ బాబు, శిఖామణి, ఖాజా మొదలైన వారి పరిచయం నా రచనా వ్యాసంగానికి మెరుగులు దిద్దిందని చెప్పొచ్చు. వారంతా తరచుగా సెంట్రల్ యూనివర్సిటీ క్యాంపస్‌లో మా కార్యక్రమాలకు వచ్చేవారు. మా అందరికీ ప్రముఖ విమర్శకుడు, జి.లక్ష్మీనర్సయ్య గారు కేంద్ర బిందువులా వుండేవారు. వీరందరికీ తోడు యూనివర్సిటీలో మాకు సీనియర్ గా వున్న 'చూపు' పత్రిక ఎడిటర్, డా. కాత్యాయని నాకు మంచి మిత్రురాలు. ఆమె నన్ను బాగా ప్రోత్సహించడమే కాకుండా తన పత్రికను చాలా వరకు దళిత సమస్యల మీద వచ్చే రచనలకే వుపయోగించారు.

యిక నేను రాయడం కూడా అంతే! మొదట కాలేజీ మాగజైన్ల కోసం బాల్యం గురించి, ప్రకృతి గురించి అనుభూతి కవిత్వం లాంటిది రాసే అలవాటు నుంచి సామాజిక స్పృహతో రాయడం వొక పరిణామ క్రమంలోనే జరిగాయి.

తెలుగులో స్త్రీవాద, దళిత వాద కవిత్వం బాగా వస్తున్నప్పుడు ఆ రెండిటిని బాగా పరిశీలించాను. నాకు స్త్రీగా, దళితురాలిగా నా అస్తిత్వ స్పృహని యీ రెండు సాహిత్య ధోరణులు యివ్వడమే కాకుండా అటు స్త్రీవాదం లో గానీ దళితవాదం లో గానీ నేను కనబడకపోవడం గమనించాను. అప్పుడు నాకు దళిత నేపథ్యం నుంచి స్త్రీ గా రాయాలనిపించింది. యెక్కువ మంది దళిత రచయితల మాదిరిగానే నాకు కూడా జీవితమే రచనకు ముడి సరుకు. మొదట్లో దళిత స్త్రీపై మూడంచెల అణచివేత (tripple burden) విధానం వుంటుందనే సిద్ధాంతపరమైన అవగాహన లేకపోయినప్పటికీ నాకు తెలియకుండానే దళిత స్త్రీపై అమలయ్యే కులవివక్ష, వర్గపరమైన దోపిడీ, లింగ వివక్షలపై రాశాను.

## ■ మంకెనపువ్వు, అస్తిత్వగానం పుస్తకాల తర్వాత....

■ 'మంకెనపువ్వు'(2005) కవితా సంపుటి, 'అస్తిత్వగానం'(2012) వ్యాస సంపుటి. యీ రెండు పుస్తకాలకి మంచి రెస్పాన్స్ వచ్చింది. మంకెనపువ్వు లో కవితలు యితర భాషల్లోకి అనువాదమవ్వడమే కాకుండా దాన్ని యోగి వేమన, విక్రమ సింహపురి యూనివర్సిటీలలో ఎం.ఏ తెలుగులోనూ, పద్మావతి మహిళా యూనివర్సిటీ లో ఎం.ఏ యింగ్లీష్ లోనూ, యిందిరా గాంధీ నేషనల్ వోపెన్ యూనివర్సిటీ లో ఎం.ఏ హిందీ లోనూ సిలబస్ గా చేర్చడమే కాకుండా ఆ పుస్తకం మీద పరిశోధనకు గాను సుమారు పది దాకా ఎం.ఫిల్, పీ.హెచ్ డీలు వచ్చాయి. అలాగే 'అస్తిత్వగానం' వ్యాస సంపుటిని కూడా బాగా రిసీవ్ చేసుకున్నారు.

అయితే నేను 'మంకెనపువ్వు' తర్వాత కవిత్వం రాశాను కానీ సంఖ్యా పరంగా చెప్పుకోదగినన్ని రాయలేదు. 'నీరు' పేరుతో రాసిన కవిత చాలామంది మన్నన పొందడమే కాకుండా యీ కవితని కర్ణాటక రాష్ట్రం యింటర్మీడియట్ యింగ్లీష్ లోనూ, బెంగుళూరు యూనివర్సిటీ ఎం.ఏ యింగ్లీషులోనూ సిలబస్ గా చేర్చారు. దళిత స్త్రీ జీవితం పైన సుమారు పదిహేను దాకా కథలు కూడా రాశాను అవి వివిధ పత్రికల్లోనూ సంకలనాలలోనూ అచ్చయ్యాయి.

కవిత్వం నాకు యిష్టమైన ప్రక్రియ. 'మంకెనపువ్వు' తర్వాత కవిత్వం రాయడం లేదు అని మిత్రులు నా మీద సున్నితంగా విమర్శ కూడా చేశారు. నేను కవిత్వం రాయడం ప్రారంభించినప్పుడు సాహిత్యం లో దళిత స్త్రీలు దాదాపు లేరనే చెప్పాలి. తర్వాత చాలా మంది దళిత రచయిత్రులు సాహిత్యంలోకి వచ్చారు. వారి రాక స్త్రీవాద,దళిత సాహిత్యాలనే కాకుండా తెలుగు సాహిత్యం లోని ఖాళీలను పూరించిందనవచ్చు. దళిత స్త్రీ కోణం నుంచి కథలు, కవిత్వం రావడం మంచి పరిణామం. యిక నేను సృజనాత్మక సాహిత్యం రాయకపోయినా ఫర్వాలేదనిపించింది. ఆ టైం లో నేను యెక్కువగా పరిశోధనాత్మకంగా దళిత స్త్రీ కోణాన్నే కాకుండా మొత్తంగా ఫూలే అంబేద్కర్ సామాజిక విప్లవ సిద్ధాంతం పైన, దళితుల సాంస్కృతిక విప్లవం గా బౌద్ధం పైన సిద్ధాంతపరమైన వ్యాసాలు రాశాను. అవి నాకు రచయితగా మంచి గుర్తింపునిచ్చాయి.

అయితే సెంట్రల్ యూనివర్సిటీ దళిత విద్యార్థి రోహిత్ ఆత్మ హత్య సంఘటన నాకు కవిత్వం యిదివరకటి కంటే మరింత సీరియస్ గా బాధ్యతగా రాయాల్సిన అవసరాన్ని ముందుకు తెచ్చింది. వ్యాసాలతో పాటు కవిత్వం కూడా యిప్పుడు యెక్కువగానే రాస్తున్నాను. బహుశా సెంట్రల్ యూనివర్సిటీలో రోహిత్ పనిచేసిన అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ లో నేను ప్రారంభ సభ్యురాలిని కావడం వలన కూడా నేను రోహిత్ సమస్యపైన యెక్కువగా మూవ్ అయ్యింటాను.

■ ***వర్తమాన కవిత్వంపై మీ విశ్లేషణ ....***

■ మంచి కవిత్వం ఫేస్ బుక్ లో వస్తుంది. యిప్పుడు కవిత్వం తో బాటు కథలు, ఆత్మ కథలు, నవలలు రావడం మంచి పరిణామం. కవిత్వం లో వర్తమాన సామాజిక జీవితంలోని ఘర్షణ, విధ్వంసాలపై కవులు బాగా శక్తివంతంగా రాస్తున్నారు. అలాగే సరికొత్త వొస్తువులు కవిత్వంలోకి వచ్చాయి. మంచ్ స్పార్క్ వున్న నవతరం కవులు తెలుగు సాహిత్యానికి దొరికారు.

■ ***మీ పరిశోధనలు ఏవైనా పుస్తకంగా తెచ్చారా?***

■ మంకెనపువ్వు', 'అస్తిత్వగానం' పుస్తకాల తర్వాత నా అకడమిక్ రీసెర్చ్ కి సంబంధించి Caste, Religion and State in Medieval South India(2013), Tribe, Peasant and Elite(2014), Facets of Gender Discrimination and Violence (2015),అనే మూడు పుస్తకాలు ప్రచురించాను. యిప్పుడు 'బౌద్ధం- దళితులు' పైన Buddhism and Dalit Assertion అనే పుస్తకాన్ని తీసుకురావడానికి ప్రయత్నం చేస్తున్నాను. అలాగే 'అస్తిత్వగానం' తర్వాత బ్రాహ్మణేతర తత్వవేత్తలైన పూలే, అంబేడ్కర్, పెరియార్ వంటివారి పైన నేను వివిధ సందర్భాలలో రాసిన వ్యాసాలను కూడా పాఠశాల విద్యార్థులకు అర్థమయ్యేలాగా వొక పుస్తకం తేవాలని వుంది. యిది వరకు రాసిన వ్యాసాలను కొంత మార్పు చేసి పిల్లల కోసం పుస్తకం వేస్తే బాగుంటుందనే డిమాండ్ నా మిత్రులనుంచి వుంది. అది త్వరలో బయటికి వస్తుంది.

■ ***దళిత బహుజన సాహిత్యం నేడు తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేస్తున్న తీరును మీరెలా చూస్తారు?***

■ దళిత సాహిత్యం తెలుగు సాహిత్యాన్ని బాగా ప్రభావితం చెయ్యడమే కాదు సంపద్వంతం చేసిందని చెప్పాలి. యెవరికిష్టమున్నా లేకపోయినా దళిత సమస్య ప్రజా వుద్యమాల యెజెండా గా యెలా అయిందో అలాగే సాహిత్యంలో కూడా దళిత సాహిత్యం, అది ముందుకు తీసుకొచ్చిన ప్రశ్నలు తెలుగు సాహిత్యాన్ని షేక్ చేశాయి. వొకరకంగా యితరులు కూడా కుల సమస్య మీద రాయక తప్పని స్థితి యేర్పడింది.

■ ***అస్తిత్వవాదాల ప్రభావంతో దళిత చైతన్యం, మహిళా చైతన్యం పెరిగింది. మరోపక్క దేశంలో కుల,మత ఛాందస భావజాల ప్రభావం తీవ్రంగా కనిపిస్తూనే ఉంది. ఈ వైరుధ్యాన్ని మీరు ఎలా విశ్లేషిస్తారు?***

■ అవును! అస్తిత్వవాద ప్రభావంతో దళిత చైతన్యం, మహిళా చైతన్యం పెరిగాయి. కానీ వారి చేతిలో రాజ్యాధికారం లేదు. యిటీవల దేశంలో కుల, మత చాందసవాదం పెరగడానికి ప్రధాన కారణం వారి రాజకీయ అధికారమే! అయితే దళిత, మహిళా చైతన్యాలు ఆధిపత్య వర్గపు అప్రజాస్వామిక ధోరణికి అడ్డుకట్ట వెయ్యగలగాలి. దానికి యెంతో శక్తిని కూడగట్టాలి. యీ క్రమంలో బ్రాహ్మణేతర ప్రజాతంత్ర శక్తులన్నీ వొక చోటికి రావాలి.

■ ***ప్రపంచీకరణ విధానాలు మధ్యతరగతిని తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి? భూస్వామ్య భావజాలం పదిలంగా ఉంచుకునే అభివృద్ధిని ఆస్వాదిస్తున్నారు? అన్నీ వ్యాపారంతో ముడిపడి మానవసంబంధాలు సంక్షోభంలో చిక్కుకున్నాయి. ఈ పరిస్థితిని రచయితలు తమ రచనల్లో రికార్డు చేయగలుగుతున్నారా?***

■ ప్రపంచీకరణ విధానాల వలన కుల వృత్తులపై ఆధారపడే పరిస్థితి పోతుంది, ఆ రకంగా కులం సమసిపోతుందని కొందరు భావిస్తే కుల భూస్వామ్యం మాత్రం అభివృద్ధికి సంబంధించిన మంచి విషయాలను వుపయోగించుకుంటూనే దాని అసలు దోపిడీ స్వభావాన్ని మాత్రం వొదులుకోలేదు. అలాగే మానవ సంబంధాలలో యాంత్రికత, వ్యాపార దృష్టి పెరిగి పోయి సగటు మనిషి జీవితం సంక్షోభంలో కూరుకుపోతుంది. యీ పరిస్థితిని రచయితలు కవిత్వంలో కంటే కథల్లో, నవలల్లో బాగా చిత్రీకరిస్తున్నారు.

■ ***తెలుగు ప్రజల జీవితాన్ని వర్తమాన సాహిత్య ప్రక్రియలు సజీవంగా చిత్రించగలుగుతున్నాయా?***

■ తెలుగు ప్రజలంటే యెవరనే ప్రశ్న వుంది. వారిలో అన్ని కులాల, మతాల, వర్గాల వారున్నారు. వారందరి హోదా అస్తిత్వం, మొత్తంగా వారందరి జీవితానుభం వొకటి కాదు. యే వర్గపు జీవితాన్ని ఆ వర్గపు సాహిత్యకారులు వివిధ ప్రక్రియల్లో శక్తివంతంగా అక్షరీకరిస్తున్నారని చెప్పొచ్చు. ఆత్మ కథలు కొంత మేరకు సజీవంగా, వాస్తవిక దృష్టితో వుంటున్నాయి.

■ ***విశ్వవిద్యాలయాల్లో సాహిత్య పరిశోధనల పరిస్థితులు ఎలా ఉన్నాయి?***

■ నేను తెలుగు సాహిత్య శాఖలో లేను కాబట్టి సాహిత్య పరిశోధన స్థాయిని అంచనా వెయ్యలేను. నాకు తెలిసి విశ్వవిద్యాలయాల్లో తెలుగు డిపార్ట్ మెంటులు చాలావరకు

బ్రాహ్మణవాదంతోనే వుంటాయి. అక్కడ దళిత, వెనుకబడిన కులాల విద్యార్థులను మార్కుల విషయంలో యెంతో వేధింపులకు గురి చెయ్యడం సర్వ సాధారణం. వాళ్ళు తమకి ఆసక్తి వున్న అంశాలమీద పరిశోధన చెయ్యడానికి కూడా ప్రోత్సాహం దొరకదు.

■ ***మీరు సాహిత్య విమర్శకులు కూడా. ప్రస్తుతం తెలుగులో సాహిత్య విమర్శ ఎలా ఉంది?***

■ నేను సాహిత్య విమర్శకురాలిని కాదు. పాఠకురాలిని మాత్రమే! సాహిత్య విమర్శ సాంకేతికంగా నాకు పెద్దగా తెలీదు.

■ ***ఇటీవల ఫేస్‌బుక్‌లో మీరు కవితలు రెగ్యులర్‌గా పోస్ట్ చేస్తున్నారు? స్పందన ఎలా ఉంది? ఇంటర్నెట్‌లో ఇటీవల తెలుగులో రాసేవారి సంఖ్య బాగా పెరిగింది. తెలుగు భాష మరింత సుసంపన్నమవ్వడానికి ఇంటర్నెట్ కూడా బాగానే దోహదం చేసే అవకాశాలు కనబడుతున్నాయంటారా?***

■ అవును. మంచి స్పందన వొస్తుంది. అక్కడ కామెంట్స్ పెట్టేవారి కంటే యెక్కువమంది ఫాలో అవుతున్నట్టు తెలుస్తుంది. సోషల్ మీడియాలో మంచి సాహిత్యం వొస్తుంది. రాసే వాళ్ళు దీనిద్వారా పెరిగారు. స్పందన కూడా వెంటనే తెలుస్తుంది కాబట్టి అది రచయితకి మంచి ప్రోత్సాహకరంగా వుంటుంది. బయట పత్రికల్లో కొన్ని అంశాలపైన రచనల్ని వేసుకోవడం లేదు. వాళ్ళ ఆప్షన్స్ మారాయి. అందువలన ఫేస్ బుక్ కొత్త, పాత రచయితలకి మంచి ప్లాట్ ఫాం ఐపోయింది. ఆ స్పేస్‌ని ఎక్కువమంది వుపయోగించుకుంటున్నారు.

■ ***వర్తమాన దళిత సాహిత్యం తీరుతెన్నులు ఎలా ఉన్నాయి?***

■ దళిత సాహిత్యంలో మొదట కవిత్వమే యెక్కువగా వొచ్చేది. అది యిప్పుడు కథగా, ఆత్మ కథగా, నవలగా విస్తరించింది. వొస్తువు పరంగా కూడా బహుముఖాలుగా విస్తరిస్తుంది. దళిత జీవితానికి సంబంధించిన అన్ని అంశాలు సాహిత్య రూపం తీసుకుంటున్నాయి. ఫూలే, అంబేడ్కర్ భావజాల కేంద్రంగా దళిత రచయితలు, కవులు బహుజనుల సామాజిక, ఆర్థిక, రాజకీయ ఆకాంక్షలను సాహిత్యంలో వ్యక్తం చేస్తున్నారు. అలాగే దళిత సౌందర్య శాస్త్రం పట్ల కూడా వారిలో శ్రద్ధ పెరిగిందని చెప్పాలి.

■ ***నాగార్జున విశ్వవిద్యాలయంలో మీరు మహాయాన బుద్ధిష్ట్ స్టడీస్‌కి ప్రొఫెసర్‌గా ఉన్నారు. మీ కార్యక్రమాల గురించి వివరించండి. బుద్ధుడి ఆలోచనల వ్యాప్తికి ఎంతవరకు ఇవి తోడ్పడుతున్నాయి?***

■ నాగార్జునా యూనివర్సిటీలో మా డిపార్ట్ మెంట్ కి వో ప్రత్యేకత వుండడమే కాకుండా దక్షిణాదిలో బౌద్ధం పైన పీ.జీ మరియూ రీసెర్చ్ కోర్సులు నిర్వహిస్తున్న యేకైక డిపార్ట్ మెంట్ యిది. యిక్కడ బర్మా, థాయ్‌లాండ్, భూటాన్, వియత్నాం, లావోస్ దేశాల విద్యార్థులు చదువుతున్నారు. వారిలో యెక్కువమంది బౌద్ధ భిక్షువులు, భిక్షుణీలు కావడం విశేషం. మా శాఖ ఫిలాసఫీ, హిస్టరీల కాంబినేషన్. పీ.జీ సిలబస్ లో బౌద్ధ చరిత్ర, వాస్తు, శిల్పకళ, పాళీ, సంస్కృత భాషల్లో వొచ్చిన బౌద్ధ సాహిత్యం, బౌద్ధ తత్వశాస్త్రం, తర్కశాస్త్రం, నీతి శాస్త్రం మొదలైన అంశాలు వుంటాయి. వీటికితోడు ఆధునిక కాలంలో బౌద్ధ పునరుజ్జీవనోద్యమం, దానికి డా. అంబేడ్కర్ లాంటి వారి కృషి పైన కూడా 'నియో-బుద్ధిజం' పేరున పేపర్స్ వున్నాయి. మేము నిర్వహించే సెమినార్లు యెక్కువగా బుద్ధుని తత్వాన్ని వర్తమాన సమాజానికి అన్వయించుకోవడం పైన, బౌద్ధ తాత్వికత యొక్క ప్రాసంగికత పైన వుంటాయి. అవి పరోక్షంగా బుద్ధుని ఆలోచనలు మళ్ళీ ప్రజల్లో వ్యాప్తిచెందడానికి దోహదం చేస్తాయని భావిస్తున్నా.

■ ***ఔత్సాహిక రచయితలకు మీరిచ్చే సూచనలు....***

■ నిజానికి యిదివరకటి కంటే యిప్పుడు రచయితల బాధ్యత మరింత పెరిగిందని చెప్పాలి. సమాజంలో ఘర్షణ, సంక్లిష్టత, పెరిగి, భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ హరించుకు పోతుంది. భిన్నాభిప్రాయాన్ని భరించలేనితనం పెరుగుతూ, వ్యక్తులు స్వతంత్ర ఆలోచనలతో బతకడమే వో సవాల్‌గా మారిపోతుంది. యీ క్రమంలో రచయితల బాధ్యత మరింత పెరుగుతుంది. యిప్పుడు యువతరం లో మంచి స్పార్క్ వున్న రచయితలు, కవులు వొస్తున్నారు. వొకవైపు యువతలో సాహిత్యాభిలాష తగ్గుతున్నట్టు అనిపిస్తున్నప్పటికీ కొంతమంది మాత్రం మూస ధోరణికి భిన్నంగా, ప్రయత్నపూర్వకంగా మంచి రచయితలుగా తయారై సమాజం పట్ల బాధ్యతతో రచనలు చేస్తున్నారు. అటువంటివారిని సీనియర్ రచయితలు, సాహిత్య విమర్శకులు ప్రోత్సహించాలి.

**ఇంటర్వ్యూ: వొరప్రసాద్**

◆




# శిక్ష

షేక్ హుసేన్ సత్యాగ్ని
9866040810

**త**న సీట్లో కూర్చొని యెదురుగా గోడకు వేలాడుతున్న క్యాలెండర్‌ను తదేకంగా చూస్తున్నాడు రాజన్న. అతని పేరు రాజశేఖర్. ఆఫీసులో అందరూ 'షార్ట్ కట్'లో రాజన్న అంటారు. ఇంతకు మునుపు యెప్పుడూ ఇలా పరధ్యానంగా ఉండేవాడు కాదు. ఈ మధ్య ఏమైందో యేమో మరి, అదోలా ఏదో లోకంలో ఉంటున్నాడు. ఒక్కోసారి క్యాలెండర్ వైపు చూస్తూనే ఆలోచనలతో మునిగిపోతాడు. ఎంతసేపవుతుందో ఏమో తనకే తెలియదు.

ఈ విషయం ఆఫీసు స్టాఫ్ గమనించక పోలేదు. తన కుటుంబ పరిస్థితులు బాగలేవని కొందరు జాలిపడితే, 'ఎదుగూ బొదుగూ లేని ఉద్యోగం. ప్రమోషన్ నిలిచిపోయింది. ఎంతకాలమని ఎల్.డి.సి.గా నెట్టుకొస్తాడు, విసుగు వుట్టింటు'ందని మరికొందరు తోటివాళ్ళతో గుసగుసలాడుకుంటున్నారు.

ఎన్ని కష్టాలు ఇబ్బందులు ఉన్నా ఆఫీసులో అందరితో కలగాపులగంగా వుండే రాజన్న ఈ మధ్య ఎందుకిట్లున్నాడని సన్నిహిత మిత్రులు మనసు నొచ్చుకుంటున్నారు. తన బాధ ఫలానా అని చెప్పమని, గుచ్చిగుచ్చి అడిగారు. దేనికీ ఉలకడు, పలకడు, ముభావంగా ఉంటున్నాడు.

'రాజన్నా!' అన్న పిలుపుతో ఆలోచనల నుండి తేరుకుని తటాలున తలతిప్పాడు. కంగారుగా 'సార్! మీరా!' అంటూ తటపటాయిస్తూ లేచి నిల్చున్నాడు. తనతో పనివుంటే పిలిపించుకునే ఆఫీసు సూపర్నెంటు, నేరుగా తన దగ్గరికే రావడంతో 'ఏం కొంప మునిగుందో'నని గాభరాపడ్డాడు. 'ఏంది?' అని అతని ముఖంలోకి చూచాడు.

'ఏమయ్యా! రాజన్నా! రేపో మాపో వస్తున్న మన కొత్త కలెక్టరు, నీకు బాగా తెలుసని ఆఫీసులో గుసగుసలాడు కుంటున్నారు'...

'ఔను సర్!' అన్నాడు రాజన్న నసుగుతూ.

'ఎట్లా, నీకేమైనా బంధువా?... లేక...' ఆరా తీశాడు సూపర్నెంటు.

'కాదు సార్' అంటూ, చెప్పడానికి అయిష్టంగా అతనివైపు చూశాడు రాజన్న.

'మరెట్లా!' అని నిగ్గదీశాడు సూపర్నెంటు.

'వదిలేట్టు లేదు' అనుకుని, 'నా క్లాస్ మేట్ సర్' అన్నాడు, చేతులు పిసుక్కుంటూ రాజన్న.

'అరె, అట్లనా! ఎక్కడయ్యా, హైస్కూల్‌లోనా? కాలేజీలోనా?' గొంతు పెంచి మళ్ళీ అడిగాడు సూపర్నెంటు.

'రామకృష్ణ జూనియర్ కాలేజీలో సర్' ముక్తసరిగా సమాధానం చెప్పాడు రాజన్న.

'అట్లనా! మంచిది రాజన్న' సూపర్నెంట్ ముసిముసిగా నవ్వుకుంటూ, అతని వీపుతట్టి 'కూర్చో' అని వెళ్ళిపోయాడు. సూపర్నెంటు వెంటవచ్చిన అటెండరు, అతనికి వంగి నమస్కరించి 'నన్ను మరువకండి' అన్నట్లు చూచి సూపర్నెంటును అనుసరించాడు.

రాజన్న తన సీట్లో కూర్చొని యధాప్రకారం మళ్ళీ ఆలోచనలో మునిగిపోయాడు. క్రమేణా తన ఇంటర్మీడియట్ రోజులు గుర్తుకువచ్చాయి.

♦♦♦

తాను కడపలో పేరున్న మండీమర్చంటు ఏకైక ముద్దుల కొడుకు. డబ్బుకు కొదవ లేదు. రెండు చేతులా ఖర్చుపెట్టేవాడు – 'లావిష్'గా. డిగ్రీలు బతుకు దెరువు కోసం గాదు, హోదా కోసమన్నట్లు కళాశాలకు వాహ్యాళికి వచ్చినట్లు వచ్చేవాడు. చదువు సంధ్య పక్కన పెట్టి, కాలేజీలో సరదాగా అమ్మాయిలతో అబ్బాయిలతో కాలక్షేపం చేసిపోవడమే పని. ఇంటర్ చదివే వయసు ఎప్పుడో దాటిపోయింది తనకు. పదవ తరగతి పబ్లిక్ కాబట్టి రెండుసార్లు తప్పాడు. మూడవసారి కాపీకొట్టి అతికష్టం మీద గట్టెక్కాడు. కొంతకాలం చదువు మాని, తండ్రికి తోడుగా పసుపుమండిలో వ్యాపారం చూసుకున్నాడు.

క్లాసులో అందరికంటే తనే పెద్దవాడు. క్లాసంతా 'అన్నా' అని పిలిచేవారు. దగ్గరి స్నేహితులు ముద్దుగా 'బాస్' అనేవారు.

క్లాస్‌లో ఉన్న అమ్మాయిలందరి కంటే జానకి చాలా అందంగా ఉంటుంది. అందరూ ఆమెను 'కాలేజీ బ్యూటీ' అనేవారు. నెమ్మదస్తురాలు. తన చదువేమో, తానేమో. ఎవరితోనూ తంటాలూ తగాదాలూ పెట్టుకోదు. ఎప్పుడూ నవ్వు ముఖంతో, అందరితో కలివిడిగా ఉంటుంది. క్లాస్‌లో వారూ వీరూ అనే తేడా లేకుండా అందరికీ ఆమెంటే అభిమానం. తాను ఏ చిన్న అవకాశం దొరికినా ఆమెను గేలిచేసి బాధించేవాడు.

క్లాస్‌రూంలో అమ్మాయిలందరూ ముందువరుసలో కూర్చొనేవారు. తాను మాత్రం కావాలని జానకి వెనక కూర్చొని అవకాశం దొరికినప్పుడల్లా సూటిపోటి మాటలతో గేలి చేస్తూండేవాడు. ఇది క్లాస్‌లో చాలా మందికి నచ్చలేదు. తన గడుసుతనానికి భయపడి ఎవరూ నోరు మెదిపేవారు కాదు.

ఒకసారి ఆమె తెల్లబట్టల మీద పేనాలోని సిరా విదిలించాడు. ఈ విషయం తోటి అమ్మాయిలు జానకి దృష్టికి తెచ్చినా, ఆమె లోలోన కుములుకుని బాధపడిందేగానీ ఏమీ అనలేదు. లెక్చరర్‌కు కంప్లైంట్ చేస్తే, ఇంకేం చేస్తాడో అని భయపడి అందుకు సాహించలేదు.

జానకి ఇల్లు కాలేజీకి వచ్చే దారిలోనే ఉంది. ప్రతిరోజు తాను ఆ దారినే వచ్చేవాడు. కావాలనే ఇంటి పరిసరాల్లో తచ్చాడుతూ వుండి, జానకి బయలుదేరిన తర్వాత ఆమెను వెంబడించి సినిమా పాటలు పాడి కేరింతలు కొట్టడం తన దినచర్య.

ప్రతిదినమూ ఉదయం భోంచేసిన తర్వాత దొడ్డి గుమ్మం తెరిచి, ఎంగిలాకును రోడ్డు ప్రక్కనున్న డ్రైనేజీలోకి విసురుతుంది జానకి. ఫలానా సమయానికి విసురుతుందని తనకు తెలుసు.

ఒకరోజు దొడ్డి గుమ్మం వాకిలి కిర్రున తెరుచుకుంటుండగానే తటాలున తాను గుమ్మానికి యెదురుగా నిలబడ్డాడు. విసిరిన ఎంగిలాకు తన బట్టల మీద పడింది. జానకి నాలుక్కరుచుకుని 'సారీ' అని తలుపు మూసుకుని వెళ్ళిపోయింది.

ఆ రోజు తాను తెల్లబట్టలు వేసుకున్నాడు. సాంబారు రసం మరకలు బట్టలమీద అచ్చుగుద్దినట్లు పడ్డాయి. వాటిని చేత్తో అలికి ఇంకాస్త పెద్దవి చేసుకున్నాడు. అవే బట్టలతో క్లాసుకు వచ్చాడు – జానకిని ఆటపట్టించ వచ్చునని సంబరపడుతూ.

తన వాలకం చూసి తోటి అబ్బాయిలందరూ అతని చుట్టూ మూగారు. ఎక్కడో గొడవ పడివచ్చాడని కొందరు గుసగుసలాడుకున్నారు. అమ్మాయిలకు ఏమీ అర్థం కాక

తెల్లమొహాలేసుకున్నారు. జానకి తలదించుకుని తన సీట్లో దిగులుగా కూర్చుంది. తననెక్కడ అభాసుపాలు చేస్తాడోనని భయపడింది.

తన ఆప్తమిత్రులు 'ఏమైంది?' అని వాకబు చేశారు. తాను రోమియో ఫోజు పెట్టి 'ఏం జరగలేదు. ఎందుకు కంగారుపడుతున్నారు. నా గర్ల్ ఫ్రెండ్ జానకి తమాషాగా నామీదికి ఎంగిలాకు విసిరింది. అంతే' అని ముసిముసిగా అన్నాడు.

'ఆఖరికి సాధించావు బ్రదర్!' అంటూ కేరింతలు కొట్టి, కరచాలనం చేశారు కొందరు ఆప్తమిత్రులు.

'ఎక్కడో యేదో జరిగితే దాన్ని ఆసరా చేసుకుని తెగ కోతలు కోస్తున్నా'డని గుసగుసలాడుకున్నారు కొందరు అమ్మాయిలు.

'జానకేమో పులుగడిగిన ముత్యమనుకున్నాం. ఇంత దిగజారుతుందనుకోలే'దని అసహనం వ్యక్తం చేశారు మరి కొందరు.

ఇవన్నీ చెవిసోకిన అమ్మాయిలందరూ జానకి చుట్టూచేరి 'ఏం జరిగిందో చెప్పవే' అంటూ బుజ్జగిస్తున్నారు.

'ఇక చెప్పేదేముందే, జానకి యెలాంటిదో మనకు తెలీదా! అందరం కలిసి ప్రిన్సిపాల్‌కు కంప్లైంట్ చేద్దాం పదండి' ముందుకొచ్చారు కొందరు.

జానకి దించిన తల ఎత్తకుండా కుళ్ళికుళ్ళి ఏడుస్తూ కూర్చుంది. క్లాసంతా ఎవరికి తోచినట్లు వాళ్ళు గుసగుసలాడు కుంటున్నారు. తానేదో పెద్ద ఘనకార్యం చేసినట్లు చాతీ విరుచుకుని క్లాసంతా తిరిగాడు.

లెక్చరర్ రాకతో గప్‌చుప్‌గా ఎవరి సీట్లో వాళ్ళు కూర్చున్నారు.

జానకిని ఆటపట్టించడమంటే తనకేదో తెలియని ఆనందం. ఆమె బాధపడుతూ వుంటే మరీ మరీ చూడాలనిపిస్తుండేది. అందుకే యథాలాపంగా తన వెకిలి చేష్టలు రెట్టింపు చేసుకుంటూ వచ్చాడు.

◆◆◆

మరొక రోజు జానకి క్లాస్‌కు కాస్త లేటుగా వచ్చింది. అటెండెన్స్ ముగించి పాఠం మొదలు పెట్టబోతున్న లెక్చరర్ విసుగ్గా 'కమిన్' అని చెయి విసిరినాడు. ఆమె నేరుగా వచ్చి హడావిడిగా తన సీట్లో కూర్చుంది. వెంటనే 'అబ్బా' అంటూ లేచి నిలబడింది. క్లాసంతా ఒక్కసారి ఆమె వైపు చూచారు.

కంగారుగా లెక్చరర్ 'ఏమైందమ్మా!' అన్నాడు. ఆమె ఏడుపు ఆపుకుంటు, గద్గద స్వరంతో ఏదో చెప్పబోయింది. కానీ నోరు పెగల్లేదు. పక్కన కూర్చున్న అమ్మాయి తటాలున లేచి 'సార్! రక్తం సార్!' అని అరిచింది.

'రక్తమా!' అని లెక్చరర్ ఆందోళన పడుతూ, 'ఏమైందో చూడమ'ని మిగతా అమ్మాయిలను పురమాయించాడు. జానకి తన పిరుదుల మీద తడిమి చూచుకుని, తాను వేసుకున్న తెల్లలంగ, పరికిణీలు రక్తం మరకలతో తడిగా ఉండడం గమనించింది. అమ్మాయిలందరూ ఆమె చుట్టూ చేరారు.

లేచి నిల్చున్న మగపిల్లలవైపు చూసి, లెక్చరర్ 'మీరు కూర్చోండ్రా!' అని దబాయించాడు. 'ఎవరన్నా ఇద్దరు అమ్మాయిలు తోడు పోయి, ఆమెను ఇంటి దగ్గర విడిచిపెట్టి రండమ్మా!' అన్నాడు.

'లేదు సార్!' అంది జానకి, సిగ్గుతో మెల్లగా.

'నీకు తెలియదమ్మా! నువు పో!' అన్నాడు లెక్చరర్ బుజ్జగిస్తూ.

'అది కాదు సార్!' అంది జానకి నసుగుతూ.

లెక్చరర్‌కు ఏం చెప్పాలో తెలియక బిక్కమొహం వేసి నిల్చున్నాడు. ఒకమ్మాయి, బెంచీమీద జానకి కూర్చునే చోటును పరీక్షగా చూచి, 'సార్! ఇక్కడెవరో గుండుసూదులు కొట్టినారు' అంది గట్టిగా కేకపెడుతూ.

అందరూ దిగ్భ్రాంతిగా ఒకరినొకరు చూసుకున్నారు.

ఆ మాట వింటూనే లెక్చరర్ కంపాయమానంగా వణుకుతున్న చేత్తో 'ఎవడ్రా రాస్కెల్, బెంచీమీద గుండు సూదులు కొట్టింది?' అంటూ మగపిల్లలవైపు హుంకరించి చూచాడు. క్లాసంతా తిరుగుతూ, 'ఎవడో మర్యాదగా చెప్పండి, లేకుంటే తోలు తీస్తాన'ని గద్దించాడు. ఎవరూ నోరు మెదపలేదు. అందరూ తలవంచుకుని నిల్చున్నారు. తానే ఆ పని చేసింటానని అందరికీ తెలుసు. వేలెత్తి చూపే ధైర్యం ఎవరికీ లేదు. లెక్చరర్ పర్మిషన్‌తో జానకి యేడుస్తూ వెళ్ళిపోయింది.

మరుసటిరోజు జానకి, వాళ్ళ నాన్నను తీసుకొచ్చి ప్రిన్సిపాల్‌ను కలిసింది. అతను వినయంగా తన గోడు చెప్పుకున్నాడు. అతను 'తాసిల్దార్ ఆఫీసులో అటెండరునని, తనకు ముగ్గురు ఆడపిల్లలని, కష్టపడి బిడ్డల్ని

చదివించుకుంటున్నా'నని బాధపడ్డాడు. 'గత కొంత కాలంగా రాజశేఖర్ అనే అబ్బాయి మా కూతుర్ని వెంటాడి వేధిస్తున్నాడు, భయపడి అమ్మాయి కాలేజి మానేస్తానని మంకుపట్టుపట్టింది. మాకేం ఆస్తిపాస్తులు లేవు సార్. చదువుకుంటే ప్రయోజకురాలై తమ బ్రతుకు తాము బ్రతుకుతారని ఆశతో బిడ్డల్ని చదివిస్తున్నాను. జరిగిన సంఘటనలన్నీ మీకు తెలుసు. జానకికి ధైర్యం చెప్పి, అతన్ని మందలించండి' అంటూ బ్రతిమలాడాడు.

'నీకేం భయం లేదమ్మా! మా కాలేజి క్రమశిక్షణకు పెట్టిందిపేరు. వాడు ఎంతవాడైనా సరే, టీసీ ఇచ్చి పంపించేస్తా'నని ధైర్యం చెప్పాడు ప్రిన్సిపాలు.

అన్ని విషయాలూ ప్రిన్సిపాల్‌కు ముందే తెలుసు. తాను కాలేజి కమిటి ప్రెసిడెంటుకు దగ్గరి బంధువు. ఏ చర్య తీసుకున్నా పరిస్థితులు తారుమారవుతాయని, దొంగకు తేలుకుట్టినట్లు ప్రిన్సిపాల్ ఊరకుండిపోయాడు.

ఇంకోరోజు ఇలాంటిదే ఇంకో సంఘటన –

లెక్చరర్లకు స్టూడెంట్స్‌కు కాలేజి అడ్రసుకు సాధారణంగా ఉత్తరాలు రావు. ఒకటి అరా వస్తే, లెక్చరర్లకు పోస్ట్‌మేన్ నేరుగా ఇస్తాడు. స్టూడెంట్స్‌వి నోటీస్ బోర్డులో పెడతాడు.

ఆ రోజు క్లాస్‌లో పిల్లలకు, లెక్చరర్లందరికీ 'స్టాంపులు అతికించని' లెటర్లొచ్చాయి. వాటిని పోస్ట్‌మేనే పైసలు వసూలు చేసుకుని, ఎవరి లెటర్లు వారికి బట్వాడా చేస్తున్నాడు.

చిరునామా గలవాళ్ళు తీసుకుంటే ముప్పై పైసలు, లేకుంటే ఫ్రమ్ అడ్రస్‌కు తిరిగి వెళుతుంది. వారు రెట్టింపు పైకం చెల్లించాల్సి వస్తుంది. ఆ వచ్చిన లెటర్స్ అన్నిటి మీదా టు అడ్రసు, ఫ్రమ్ అడ్రసులన్నీ ఆ కాలేజీలో లెక్చరర్లవో, క్లాస్‌లో పిల్లలవో ఉన్నాయి. కాబట్టి తప్పనిసరి పరిస్థితుల్లో చిరునామాదారులే ఫైన్ చెల్లించి తీసుకున్నారు.

చదివిన వాళ్ళందరూ ఒక్కసారిగా అవాక్కయ్యారు. 'నమ్మాల్నా! వద్దా!' అని డోలాయమానంలో పడ్డారు. కొందరు లెక్చరర్లు దీన్లో నిజమెంత? అని కూపీ లాగే ప్రయత్నం చేస్తున్నారు.

అమ్మాయిలందరూ తనను శాపనార్థాలు పెడుతూ జానకి చుట్టూ చేరారు. జానకి ఏం పాలుపోక నిశ్చేష్టంగా కూర్చుంది. చెక్కిళ్ళపై కన్నీళ్ళు కాల్వలు కట్టాయి. ఆమె పరిస్థితి చూసి క్లాసులో అందరూ తనమీద కుతకుతలాడారు.

ఇది చాలదన్నట్లు, తన ఆప్తమిత్రుడొకడు వెనక బెంచీలో నుండి, రాజశేఖర్‌కు జానకికి ఫలాన తేదీన వర్ణాంతర వివాహమౌతున్నట్లు, అందరూ వచ్చి ఆశీర్వదించవలసినదిగా, 'కడప నవజీవన సమాజ్' పేరున ప్రచురించిన కరపత్రాన్ని బిగ్గరగా చదివాడు.

జానకి యెక్కియెక్కి ఏడుస్తూ క్లాస్‌రూం నుండి వెళ్ళిపోయింది. కొందరు అమ్మాయిలు ఆమెను ఓదారుస్తూ అనుసరించారు.

ఈ వార్త క్షణాలమీద దావానలంలా కాలేజంతా నెరుసుకుంది. విద్యార్థులందరూ గుంపులు గుంపులుగా తమ క్లాస్‌రూం దగ్గర కొచ్చారు. కొందరు లెక్చరర్లు వారిని మందలించి ఎవరి క్లాస్‌లకు వాళ్ళను పంపించారు.

ప్రిన్సిపాల్ రమ్మంటున్నాడని ఆఫీసు ప్యూన్ వచ్చి తనను పిలుచుకు పోయాడు. తన వెంట తన వందిమాగధ బృందమంతా అనుసరించింది. మిగతా వాళ్ళంతా బయట వుంటే, తానొక్కడే రొమ్ము విరుచుకుని, లోపలికి ప్రిన్సిపాల్ ముందుకు పోయాడు.

ఆయన నయానా భయానా గుచ్చి గుచ్చి అడిగినా, ఆ కరపత్రం విషయం ససేమిరా తనకు తెలియదన్నాడు. సరిపోని వాళ్ళెవరో చేసి వుంటారని నమ్మబలికాడు.

'ఇక మీదట ఇలా జరిగితే టీసీ ఇచ్చి పంపించి వేస్తా'నని మందలించి పంపించాడు.

విషయం తెలుసుకున్న జానకి తల్లిదండ్రులు భయపడ్డారు. ముందు ముందు ఇంతకంటే ఘోరాలు జరిగితే తాము ఎవరికి చెప్పుకోవాలి? ఎవరు ఆదుకుంటారు? కాదు కూడదని కూతురుకు నచ్చజెప్పి కాలేజీకి పంపిస్తే, అతను ఇంకా ఏం అఘాయిత్యానికి తెగబడ్తాడోనని ఆందోళనపడ్డారు.

జానకి కూడా ఆ కాలేజీలో చదవనని భీష్మించింది.

టీసీ తీసుకుని తిరుపతిలో వుండే జానకి బాబాయి యింటికి పంపించాలని నిశ్చయించుకున్నారు. చడీ చప్పుడు లేకుండా జానకి కాలేజీ వదిలి వెళ్ళిపోయింది.

♦♦♦

దాదాపు ఇరవై అయిదు సంవత్సరాల తరువాత ఇప్పుడు 'ఆ జానకి'నే కలెక్టరుగా కడపకు వస్తోంది. ఆ విషయం మనసులో మెదులుతూనే రాజన్నకు ముచ్చెమటలు పడుతున్నాయి.

ఇప్పుడతను మునుపటి రాజన్న కాదు. ఆ డాబూ, దర్పమూ తండ్రితోనే పోయాయి. వ్యాపారంలో భారీ నష్టాలు వచ్చి, ఉన్న ఆస్తి అంతా అప్పులకే సరిపోయింది.

చాలీచాలని జీతం, రోగిష్టి భార్య, నలుగురు బిడ్డలు... ఇవీ ఇప్పుడు అతని ఆస్తి.

జానకి వద్ద చిరుద్యోగిగా తాను పనిచేయాలి. అసలామె తనను పనిచేయనిస్తుందా! ట్రాన్స్‌ఫర్ చేస్తే ఫర్వాలేదు గానీ ఏదో ఒక సాకుపెట్టి ఉద్యోగం ఊడబీకితే భార్యాబిడ్డలతో రోడ్డున పడాల్సిందే!

కొత్త కలెక్టరు చార్జి తీసుకుని మూడ్రోజులయింది. స్టాఫ్ అందరితో పాటు పోయి చాటుమాటుగా వెనక నిలబడి పరిచయం అయిందనిపించుకున్నాడు రాజన్న. తన్ను గుర్తించ లేదని నిబ్బరపడ్డాడు.

జిల్లాలో కరువు మండలాల ఫైలు తానే తయారు చేస్తున్నాడు. ఏ క్షణాన్నైనా ఫైలు తెప్పించొచ్చు కలెక్టర్, రెడీగా పెట్టమన్నాడు సూపర్నెంటు. రెండ్రోజులు రాత్రింబగళ్ళు కష్టపడి ఫైలు రెడీ చేశాడు.

సీట్లో కూర్చున్నాడే గానీ స్థిమితం లేదతనికి. ఆఫీసులోకి ఎవరొచ్చినా, తన కోసమేనని ఉలిక్కిపడుతున్నాడు. ఏ నిమిషం ఏం జరుగుతుందోనని కంగారుగా ఉన్నాడు. ఆఫీసులో అందరి వైపూ భయంగా చూస్తున్నాడు. తన అవస్థను ఇతరులు గమనిస్తారేమోనని కప్పిపుచ్చుకోవడానికి నానా తంటాలు పడుతున్నాడు.

కలెక్టరు దఫేదారు వచ్చి, 'రాజన్న సార్!' అన్నాడు. అతని గుండెలు దడదడలాడాయి. 'ఏమి?' అన్నట్లు దఫేదారు వైపు చూచాడు. 'మిమ్మల్ని కలెక్టరు మేడమ్ రమ్మంటున్నారు సార్!' అన్నాడు దఫేదార్. రాజన్న వణుకుతున్న చేతుల్తో ఫైలు పట్టుకుని గప్పున లేచాడు. పదురుతూన్న కాళ్ళను బలవంతంగా కూడదీసుకుని ముందుకు కదిలాడు.

కలెక్టరుకు నమస్కరించి వణుకుతూ ఫైలు పట్టుకుని నిలబడ్డాడు. ఆఫీసు ఫైళ్ళు చూస్తున్న కలెక్టరు, కాసేపయ్యాక తలపైకెత్తి రాజన్నవైపు చూసింది. ఏదో గుర్తొచ్చినట్లు చటుక్కున కళ్ళు మూసుకుని క్షణం తర్వాత రాజన్నను రెప్పవాల్చకుండా తదేకంగా చూచింది.

'నువు రాజశేఖర్ గదా!' అంది అనుమానంగా.

'ఔనన్నట్లు తల పంకించాడు గుటకలు మింగుతూ.

అతని వైపే చూస్తూ 'ఏమైంది? ఎందుకీ ఉద్యోగం చేస్తున్నావ్?' ఆత్రుతను పైకి కనపడనీయకుండా అడిగింది కలెక్టర్.

'నా ఖర్మ మేడమ్' అన్నాడు దీనంగా. క్షణం సేపు నిశ్శబ్ధం ఆవహించింది.

తిరిగి కలెక్టరు ఫైళ్ళు చూసుకుంటూ 'నీ ఫైలు టేబులు మీద పెట్టి వెళ్ళు' అంది నింపాదిగా.

ఎప్పుడు కొండ విరిగి నెత్తినపడుతుందో! దినమొక యుగంగా గడుస్తోంది రాజన్నకు.

'మేడమ్ రాజన్న క్లాస్‌మేటంట' అని ఆఫీసంతా ప్రచారమయింది. కొంపదీసి తనకేదైనా అనర్థం జరిగితే ఆత్మహత్య తప్ప గత్యంతరం లేదనుకున్నాడు రాజన్న.

కొన్ని రోజుల తర్వాత, 'రాజన్నా! రాజన్నా!' అంటూ ఫైలు పట్టుకుని బయటినుండే కేకలుపెడుతూ వచ్చాడు సూపర్నెంటు. రాజన్న గుండెలు గుభేలుమన్నాయి. 'ఏం సార్?' అంటూ అనుమానంగా కుర్చీలోంచి లేచాడు.

'నీ ఆర్డరయ్యా, ఆర్డరు!'

'ఏం ఆర్డరు సార్?' ఏడుపు మొహం పెట్టాడు రాజన్న.

'నీకు ప్రమోషన్ ఆర్డరయ్యా!' సంతోషంగా చెప్పాడు సూపర్నెంటు.

'నాకా సార్!' నమ్మలేక, కళవరపడ్డాడు రాజన్న.

'ఔనయ్యా, నీకే. మొన్నీ మధ్య మేడమ్ నీ పరిస్థితులను గూర్చి అడిగారు. అంతా పూసగుచ్చినట్లు చెప్పాను. నీ ప్రమోషన్ ఫైలు చాలాకాలంగా పెండింగ్‌లో ఉందనీ, నీ భార్య ఆపరేషన్‌కు ఆర్థిక సహాయం కోసం ప్రభుత్వానికి అప్లికేషన్ పెట్టుకున్నావని కూడా అన్నాను. అన్ని విషయాలు సావధానంగా విని, బాధపడ్డారామె. ఇదో ఆర్డరు తీసుకో. మరో విషయం, కలెక్టరు స్పెషల్ ఫండులో నుంచి నీ భార్యకు వైద్య ఖర్చులకు డబ్బు మంజూరు చేశారయ్యా!'

ఆదరాబాదరా ఆర్డర్ కాపి చదివిన తర్వాత కానీ రాజన్న మనసు కుదుట పడలేదు. 'ఇంకా నిలుచున్నావేమయ్యా! రా పోదాం! మేడంకు అభివందనం తెలుపవూ?' అంటూ అతన్ని తీసుకుపోయాడు సూపర్నెంటు.

రెండు చేతులతో ఆర్డరు కాపి పట్టుకుని నమస్కరిస్తూ నిల్చున్నాడు రాజన్న. అతని కళ్ళల్లో కన్నీరు పెల్లుబుకుతూ వుంది. కలెక్టరు రెప్పవాల్చకుండా అతనివైపు జాలిగా చూస్తూ వుంది.

◆

# సలీం కథల్లో ముస్లిం జీవన చిత్రణ

డా. వి. గీతానాగరాణి



తనని తాను మైనారిటీగానో ముస్లింగానో భావించుకోలేని రచయిత సలీం. వాటి పరిధుల్నీ, పరిమితుల్నీ అధిగమించిన సృజనాత్మక వ్యక్తిత్వం అతనిది. అతని కథల ఇతివృత్తాల్లో సింహభాగం సార్వజనీనమైన అంశాలే చోటుచేసుకున్నాయి. అయినప్పటికీ ముస్లిం జీవితాల్లోని వైరుధ్యాలను, సాంప్రదాయాల పేరిట జరుగుతున్న స్త్రీల అణచివేతను, మతాచారాల ముసుగులో మగవాళ్ళ దాష్టీకాల్ని కథాంశాలుగా తీసుకుని డజనుకి పైగా కథలు రాశారు.



తెలుగు సాహిత్యంలో రచయితగా సలీంకి ప్రత్యేకస్థానం ఉంది. నవలా రచయితగా, కథా రచయితగా ఆయన సాహిత్యప్రయాణం విలక్షణమైనది. ఇప్పటివరకు పదిహేడు నవలలు రాశారు. రెండువందలకు పైగా కథలు రాశారు. తొమ్మిది కథాసంపుటాలు వెలువరించారు. తనని తాను మైనారిటీగానో ముస్లింగానో భావించుకోలేని రచయిత సలీం. వాటి పరిధుల్నీ, పరిమితుల్నీ అధిగమించిన సృజనాత్మక వ్యక్తిత్వం అతనిది. అతని కథల ఇతివృత్తాల్లో సింహభాగం సార్వజనీనమైన అంశాలే చోటుచేసుకున్నాయి. అయినప్పటికీ ముస్లిం జీవితాల్లోని వైరుధ్యాలను, సాంప్రదాయాల పేరిట జరుగుతున్న స్త్రీల అణచివేతను, మతాచారాల ముసుగులో మగవాళ్ళ దాష్టీకాల్ని కథాంశాలుగా తీసుకుని డజనుకి పైగా కథలు రాశారు. అవి తలాక్, ఆరో అల్లుడు, మెహర్, ఖులా, బురఖా, మంద, పుట్ట, రెండో భార్య, ఆకుపచ్చని కన్నీరు, నిశ్శబ్ద సంగీతం, దూరపు కొండలు, ఆలియాబేగం, నిఖా, కళ తప్పుతోంది, లోహ ముద్ర. వీటిల్లోంచి కొన్ని ముఖ్యమైన కథల గురించి చర్చించాల్సిన అవసరం ఉంది.

ముస్లింల సంస్కృతీ సాంప్రదాయాల్ని, అణచివేతకు లోనవుతున్న ఆడవాళ్ళ బతుకుల్లోని దైన్యాన్ని చిత్రించిన కథలివి. మతంలోని మంచిని మన్నిస్తూనే అనాచారాల్ని తిరస్కరించే ధోరణి ఈ కథల్లో ఉంది. మతపెద్దలు చెప్పిందే శిరోధార్యమని భావించడాన్ని, హదీజ్‌లో పొందుపరచిన విషయాల్ని తమకనుకూలంగా వ్యాఖ్యానించుకోడాన్ని నిరసించడం 'తలాక్' కథలో కన్పిస్తుంది. తమకు ఇష్టం లేని భార్యని వదిలించుకోడానికి మూడు సార్లు తలాక్ చెప్పి విడాకులు తీసుకునే మగవాళ్ళ అనౌచిత్యాన్ని విమర్శించే కథ ఇది. ముస్లిం యువకులు ఈ మధ్య కాలంలో టెలిగ్రాములద్వారా, టెలిఫోన్లద్వారా, మెసేజ్‌లద్వారా, ఈ మెయిళ్ళద్వారా తలాక్ చెప్పి భార్యల్ని వదిలించుకుంటున్న సాంప్రదాయం అమానుషమని నమ్ముతాడు ఇబ్రహీం. స్త్రీలకు అన్యాయం చేసే ఈ ధోరణి మారాలని, ఇస్లాంలో సంస్కరణలు తేవాల్సిన అవసరం ఉందని భావించి ట్రిపుల్ తలాక్‌ని దుయ్యబడ్తూ 'తలాక్' అనే నాటకం రాస్తాడు.

నాటక ప్రదర్శన రోజు వూళ్లోని ముస్లిం పెద్దలందర్నీ ఆహ్వానిస్తాడు. నాటకంలో హమీద్ అనే భర్త పాత్ర భార్య పాత్ర అయిన అక్తరున్నిసాకు మూడు సార్లు తలాక్ చెప్తుంది. ఈ రెండు పాత్రల్ని ఇబ్రహీం, అతని భార్య జమీలున్నిసా పోషిస్తారు. ఇంతమంది సాక్షుల ఎదుట ఇబ్రహీం తన భార్యకు మూడు

సార్లు తలాక్ చెప్పాడు కాబట్టి ఆ క్షణం నుండి వాళ్ళిద్దరూ భార్యాభర్తలు కారని మత పెద్దలు తీర్మానిస్తారు. తనకు తన భార్యంటే చాలా ఇష్టమని, తనకు విడిపోవాలన్న ఉద్దేశం ఏ కోశానా లేదని, తలాక్ చెప్పింది నాటకంలోని పాత్ర మరో పాత్రతో మాత్రమేనని ఇబ్రహీం ఎంత మొరపెట్టుకున్నా వాళ్ళు వినరు. తిరిగి తాము కలిసి జీవించే మార్గం సూచించమని అడిగినప్పుడు 'దీనికి పరిష్కారం ఒక్కటే. జమీలున్నిసా మరొకర్ని నిఖా చేసుకుని, అతనితో కాపురం చేశాక, అతను విడాకులిస్తే, అప్పుడు భర్త వదిలేసిన ఆమెను నువ్వు మరలా నిఖా చేసుకోవచ్చు' అంటారు.

తలాక్ చెప్పి విడాకులిచ్చే సమయంలో స్త్రీ మనోభావాల గురించి, ఇష్టాఇష్టాల గురించి మతం పట్టించుకోదు. జమీలున్నిసా మరలా తన భర్తను చేరుకోవాలంటే తన ఇష్టంతో సంబంధం లేకుండా మరో వ్యక్తిని నిఖా చేసుకోవాలనడం ఎంత అన్యాయం? ఒకవేళ ఆ వ్యక్తి విడాకులివ్వకపోతే తన పరిస్థితి ఏమిటి? తలాక్ అనే పదం మూడు సార్లు పలికినంత మాత్రాన విడాకులిచ్చినట్టా? ఏ పరిస్థితుల్లో ఆ పదాలు వెలువడ్డాయో ఎవ్వరికీ అక్కరలేదా? మనసుతో ప్రమేయమే లేదా? పొరపాటు జరిగితే వెనక్కి తీసుకునే వెసులుబాటు లేకపోతే ఎలా? ఆచారాలు, సాంప్రదాయాలు మనుషుల మనోభావాలకు ప్రాధాన్యం ఇవ్వాలి. అలా లేనప్పుడు మనుషుల్లో సంస్కరణాభిలాష మొలకెత్తుతుంది. లేదా మతాన్ని, మత పెద్దల్ని ధిక్కరించి వ్యక్తులు స్వయంగా నిర్ణయాలు తీసుకుంటారు. ఈ కథలో జమీలున్నిసా అదే చేస్తుంది. ధిక్కారం ప్రకటిస్తూ తన భర్తను చేరుకోడానికి వెళ్తుంది. సలీం ఈ కథను 2002లో రాశారు. ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వం ట్రిపుల్ తలాక్ చెప్పి విడాకులు తీసుకునే పద్ధతికి స్వస్తి పలికే దిశగా చట్టాన్ని తెచ్చే ప్రయత్నం చేస్తుంది.

మతాచారాల్ని, కట్టుబాట్లని తు.చ తప్పక పాటిస్తున్నామనుకునేవారు కూడా తమ స్వప్రయోజనాల కోసం వాటిని ఉల్లంఘించడానికి వెనుకాడరు. సంప్రదాయాన్ని ఉల్లంఘించడం కూడా కొన్ని ప్రాంతాల్లో సంప్రదాయంగా మారడాన్ని 'మెహర్' కథలో కళ్ళకు కట్టిస్తారు రచయిత. కరీమున్ తండ్రికి చిన్న వెల్డింగ్ షాపుంది. కరీమున్తో కలిపి ఎనిమిది మంది సంతానం. కిరాణా కొట్టు మస్తాన్ కొడుక్కిచ్చి కరీమున్కి నిఖా చేద్దామని సంకల్పిస్తాడు. 'మస్తాన్ సంప్రదాయాలకు విలువిచ్చే మనిషి. క్రమం తప్పకుండా ఐదు పూటలా నమాజ్ చేస్తాడు. రెండు సార్లు హజ్ యాత్ర చేసి వచ్చాడు. కొడుకుని కూడా పక్కా నమాజీ చేశాడు. ఇంట్లో ప్రతిదీ ఖురాన్‌లోని వాక్యాలకు అనుగుణంగా జరగాలి. ముస్లిం కట్టుబాట్లు, నియమ నిబంధనలు ఖచ్చితంగా పాటించే కుటుంబం'. కానీ ఇరవై వేలు కట్నం ఇస్తే తప్ప నిఖా జరగదని పట్టుబడ్డాడు. కరీమున్ తండ్రి తన ఇంటిని తనఖా పెట్టి ఇరవై వేలు అతనికి సమర్పించుకుంటాడు. నిఖానామాలో దీని గురించి ప్రస్తావించకుండా మెహర్ గురించి పొందుపర్చడాన్ని తప్పు పడ్తుంది కరీమున్.

మస్తాన్ మెహర్ని రెండు వేలుగా నిర్ణయిస్తే దాన్ని పట్టుబట్టి ఐదు వేలకు ఒప్పించానని తండ్రి చెబితే అతని అమాయకత్వానికి కరీమున్ బాధగా నవ్వుతుంది. మెహర్ ఉద్దేశం ఏమిటని అడిగితే ఆమె తండ్రి ఇలా చెప్తాడు. 'మన మతంలో ఆడదానికి గొప్ప రక్షణ మెహర్. ఖచ్చితంగా ఆ అర్థంలో కాకున్నా ఓ రకంగా మగవాడు తన భార్యకు ఇచ్చే కట్నం అనుకోవచ్చు. పెళ్ళయిన స్త్రీ విధివశాన ఒంటరిదయితే మెహర్ రూపేణా ఆమెకు అందే డబ్బు కష్టకాలంలో అక్కరకు వస్తుంది. మెహర్ పైన పూర్తి హక్కులు స్త్రీకే ఉంటాయి. ఇంతటి గొప్ప ఆచారం ఏ మతంలోనూ లేదు.' దానికి కరీమున్ 'మెహర్ నాకు నా భర్త ఇచ్చే కట్నమయితే మరి మనం కట్నం కింద ఇచ్చిన ఇరవై వేలని ఏమంటారు? మతాచారాల్ని నిక్కచ్చిగా పాటిస్తాననే మా మామగారు ఏ మతాచారం ప్రకారం మన దగ్గర ఇరవై వేలు తీసుకున్నారు? నిఖానామాలో దీని గురించి ఎందుకు ప్రస్తావించలేదో వెళ్ళి మా మామగార్ని అడిగి రండి' అంటుంది. తనలా అడగలేనని, ఆడపిల్లల్ని కన్న తండ్రిగా తను అసహాయుడినని అతను అనుకోవడంతో కథ ముగుస్తుంది.

సదాచారసంపన్నులమని చెప్పుకునే మస్తాన్ లాంటివారు డబ్బుకోసం అవసరమైతే ఆచారాలకు విరుద్ధంగా వ్యవహరిస్తారు. కోస్తాంధ్ర, రాయలసీమ ముస్లిం కుటుంబాలలో ఈ కట్నమనే దురాచారం ప్రబలంగా కన్పిస్తుంది. దీనిక్కారణం బహుశా మెజారిటీ హిందువుల ప్రాబల్యం ఉన్న ప్రాంతాల్లో నివసించే ముస్లింలు వాళ్ళని అనుకరించే ప్రయత్నం చేయడమే కావచ్చు.

అరబ్ షేకుల వలలో పడి మోసపోతున్న ముస్లిం అమ్మాయిల జీవితాల్లోని పెను విషాదాన్ని చిత్రించిన కథ 'ఆరో అల్లుడు'. మోసాలు జరుగుతాయనీ, ఇక్కణ్ణించి నిఖా చేసుకును

తీసుకెళ్ళిన అమ్మాయిల్ని అక్కడ పనిమనుషులుగా, తమ కోర్కెలు తీర్చే యంత్రాలుగా వాడుకుంటారనీ, తమ కోర్కెలు తీరాక వేరేవాళ్ళకు అమ్మేస్తారని తెలిసినా ఆడపిల్లల్ని ముసలి అరబ్ షేకులకిచ్చి ఎందుకు నిఖా జరిపిస్తున్నారనేది ప్రశ్న. 'దారిద్ర్యం.. ఆకలి.. శక్తికి మించిన సంతానం.. డబ్బు ఖర్చుపెట్టి ఆడపిల్లల నిఖా చేయలేని దీనస్థితి.. షేక్‌లు ఇస్తామనే డబ్బుకి ఆశపడి నిఖాలు చేస్తున్నారు. ఓ రకంగా చెప్పాలంటే వేరే దారిలేక ఆడపిల్లల్ని అమ్ముకుంటున్నారు' అనేది కథలో కన్పించే జవాబు.

ఖాన్ చాచాకు ఐదుగురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలు. అతని కూతురు యాస్మిన్‌కి దుబాయ్ షేకు సంబంధం తెస్తాడు బ్రోకర్. మెహర్ కింద పాతిక వేలు, పెళ్ళి ఖర్చుల కోసం మరో పాతిక వేలు ఇస్తాడనగానే వయసులో తనకంటే పెద్దవాడన్న విషయాన్ని కూడా విస్మరించి ముక్కుపచ్చలారని యాస్మిన్ తో నిఖా జరిపిస్తాడు. దుబాయ్ వెళ్ళి నెలలు గడిచినా యాస్మిన్ దగ్గరనుంచి ఉత్తరం రాదు. చివరకు పదినెలల తర్వాత వచ్చిన ఉత్తరంలో ఒకే ఒక వాక్యం ఉంటుంది. 'అబ్బాజాన్.. మీకు ఆరో అల్లుడు ముబారక్' అని. ఇదొక గుండెల్ని చీల్చే వ్యంగ్య బాణం. ఈ పది నెలల కాలంలో ఆరుగురు మగవాళ్ళ చేతుల్లోకి మారిందని అర్థం. యాస్మిన్ ని ప్రేమించిన అమీర్ ఈ ఉత్తరం చదివి మ్రాన్పడిపోతాడు. వెల్డింగ్ షాపులో పనిచేసే అతనికి యాస్మిన్‌ని ఇచ్చి పెళ్ళి చేయడానికి ఖాన్ చాచాకు ఇష్టం ఉండదు. తండ్రికన్నా ఐదారేళ్ళు పెద్ద వయసున్న దుబాయ్ షేక్ ని పెళ్ళి చేసుకోక తప్పలేదు యాస్మిన్‌కి. ఆమె జీవితంలో ఒలికిన విషాదానికి ఖాన్ చాచాలాంటి వ్యక్తులు మాత్రమే కారణం కాదు. మతం, సంప్రదాయాలు, అధిక సంతానం, నిరక్షరాస్యత, అర్థంలేని ఆచారాలు... ఇవన్నీ కలిసి ముస్లిం ఆడపిల్లల బతుకుల్ని విషాదమయం చేస్తున్నాయి.

పేదరికం, అత్యాశ, దుబాయ్ సంబంధం అన్న ఫాల్స్ ప్రిస్టేజి సైతం ఈ దురవస్థకి కారణం. ఈ కథని సలీం 2000 సంవత్సరంలో రాశారు. ఇటువంటి సంఘటనే 2015లో వెలుగు చూసింది. పద్దెనిమిదేళ్ళ రెహానా బేగం కతార్ నుంచి వాళ్ళమ్మ మొయిన్ బేగంకు 'అమ్మీ.. ముబారక్ హో.. ఆప్ కో సత్రహ్ దామాద్ మిలా హై' అంటూ మెసేజ్ పంపింది. ఆమెను హైద్రాబాద్‌లో నిఖా చేసుకుని కతార్ తీసుకెళ్ళిన 70 యేళ్ళ అరబ్ షేక్ తన మోజు తీరాక ఆమెను వేరేవాళ్ళకు అమ్మకానికి పెట్టాడు.

ముస్లిం మగవాళ్ళు విడాకులివ్వడం కోసం మూడు సార్లు తలాక్ చెప్పే పద్ధతి ఉన్నట్టే ముస్లిం స్త్రీ ఖులా చెప్పి తన భర్తకు విడాకులివ్వవచ్చు. సలీం రాసిన 'ఖులా' కథలో ఫాతిమాకి నాలుగో సంతానం ఆరేళ్ళ నాజియా . భర్త ఫకీర్ పేరుకు తగ్గట్టు ఫకీరే. దానికి తోడు పచ్చి తాగుబోతు. మొదటి సంతానంగా కూతుర్ని కన్నందుకు పచ్చి బాలింతరాలని కూడా చూడకుండా ఫాతిమాని కాళ్ళతో తన్ని ఇంట్లోంచి గెంటేసిన కిరాతకుడు. వూళ్లోని పెద్దవాళ్ళు సర్దిచెప్పడంతో ఇంట్లోకి రానిస్తాడు. ఇద్దరు మగపిల్లల తర్వాత నాజియా పుడ్తుంది. నాజియా ఆడపిల్ల కాబట్టి దాన్ని గొంతు పిసికి చంపేస్తే తనకు భారం తగ్గుతుందని యోచిస్తుంటాడు. ఓ రోజు ఆడుకోడానికి బైటికెళ్ళిన నాజియాని ఇంటర్నెట్లో బూతు సైట్లు చూసే అలవాటున్న పధ్నాలుగేళ్ళ కుర్రవాడు రేప్ చేసి, కాలువలో ముంచి చంపేస్తాడు. వాడు ఆ వూరి సర్పంచ్‌కి బంధువు. మోతుబరి కొడుకు.

సర్పంచ్ ఫకీర్ని పిలిచి బేరం పెడ్తాడు. పోలీసులకు చెప్పటం వల్ల అతనికి ఒనగూడే ప్రయోజనం ఏమీ లేదని, నష్టపరిహారం కింద మూడు వేలు ఇప్పిస్తానని ప్రలోభ పెడ్తాడు. కూతురు చచ్చిపోయినందుకు ఖర్చు తగ్గడంతో పాటు మూడు వేలు వస్తున్నందుకు ఫకీర్ సంతోషపడ్తాడు. ఫాతిమా ఒప్పుకోదు. వాడికి ఉరిశిక్ష పడాల్సిందేనంటుంది. 'నోర్మూసుకుని పడుండు. లేకపోతే గొంతు పిసికి చంపేస్తాను' అంటాడు ఫకీర్. పోలీసులు ఎంక్వయిరీకి వస్తే డెంగ్యూ జ్వరమొచ్చి పిల్ల చచ్చిపోయిందని చెప్తాడు. ఫాతిమాని బైటికి రాకుండా అడ్డుకుంటాడు. 'నోరెత్తావా తలాక్ ఇచ్చేస్తాను. పో లోపలికి' అని బెదిరిస్తాడు.

'నువ్వేంట్రా తలాక్ ఇచ్చేది. నేనే నీకు ఖులా చెప్తున్నా. నువ్వు నా కాళ్ళు పట్టుకున్నా నీలాంటి నీచుడితో కాపురం చేయడానికి తయారుగా లేను' అంటూ పోలీసుల్తో నిజాలు చెప్పడానికి సమాయత్తమౌతుంది ఫాతిమా. ఒకానొక సమయంలో తన పిల్లల కోసం ఫకీర్ దాష్టికాల్ని సహిస్తూ 'ఛీ ఆడజన్మ.. కుక్కకన్నా హీనమైన బతుకు.. అదైనా నయం.. కోపమొస్తే మొరగడానికైనా స్వేచ్ఛ ఉంది. ఆడదానికి, అందునా ముస్లిం ఆడదానికి ఆపాటి స్వేచ్ఛ కూడాలేదు' అనుకున్న ఫాతిమా తన ఆరేళ్ళ కూతురి ప్రాణానికి ఇంత నష్టపరిహారమైతే గిట్టుబాటవుతుందంటూ బేరాలు చేస్తుంటే తట్టుకోలేక

ఆడపులిలా గర్జించి, భర్తపైన తిరగబడ్తుంది. ఖులా చెప్పి బంధనాల్ని తెంపుకుని స్వేచ్ఛా ప్రపంచంలోకి అడుగు పెడ్తుంది.

ఇస్లామిక్ ఉగ్రవాదం గురించి రాసిన కథ 'పుట్ట'. ఈ కథ చివర్లో 'ఆమె పుట్టగా మారి.. ఆమెలో కదుల్తూ బుస కొడుతూ ప్రశ్నలు...' అంటూ ముగించినా రచయిత ఉద్దేశం ఇస్లామిక్ ఉగ్రవాదులు పుట్టల్లోంచి పాముల్లా పుట్టుకొస్తున్నారని. ఆమెకు ఇంటర్ చదువుతున్న కొడుకున్నాడు. భర్త అమీర్ పొట్ట చేత బట్టుకుని దుబాయ్‌కి వెళ్ళి కాయకష్టం చేస్తుంటాడు. వాళ్ళింటికి దగ్గర్లో ఓ గదిలో అద్దెకు దిగుతాడు అబ్దుల్ ఖాదర్. సెల్ ఫోన్లు రిపేరు చేసే షాప్‌లో పని చేస్తుంటాడు. తన కొడుకుకన్నా రెండు మూడేళ్ళు పెద్దయిన ఖాదర్ని స్వంత తమ్ముడిలా ఆదరిస్తుందామె. అమీర్ దుబాయ్ నుంచి శెలవ మీద వస్తాడు. అబిడ్స్‌లో ఉగ్రవాదులు బాంబులు పెడ్తారు. చాలామంది చనిపోతారు. వాళ్ళలో అమీర్ కూడా ఉంటాడు.

మూడు రోజుల తర్వాత పోలీసులు అబ్దుల్ ఖాదర్ని అరెస్ట్ చేస్తారు. 'ఇంత అమాయకమైన మొహంతో, ఇంత సిగ్గరితనంతో ఉండే ఖాదర్ అంతటి ఘోరమైన తప్పు చేయగలడా? బాంబులు పెట్టి అమాయకుల ప్రాణాలు తీయగలడా? అతను ఉగ్రవాది అంటే నమ్మలేను. పోలీసులకు అలవాటేగా... ఎక్కడ ఏ దురంతం జరిగినా అమాయక ముస్లిం యువకుల్ని ఇరికించి బాధించడం...' అనుకుంటుంది. కానీ నుస్రత్ ఖాలా కొడుకు మునీర్ చెప్పిన విషయాలు గుర్తొస్తాయి. 'ఉగ్రవాదులు మనకు అనుమానం రాకుండా మన మధ్యలోనే ఉంటారని చెప్పాడుగా.. ఖాదర్ అలాంటివాడేమో.. అదే నిజమైతే ఖాదర్ని చొక్కా పట్టుకుని అడగాలని ఉంది.. నీకు నా అమీర్ ఏం అపకారం చేశాడని.. నువు చంపింది సాటి హిందూ ముస్లిం సోదరుల్నే అని.. అది జిహాద్ కాదు దేశ ద్రోహమని.. యింత రక్తం యిన్ని కన్నీళ్ళు పారించి ఏం సాధించావని..' అని అనుకుంటుంది.

ఈ కథని రచయిత ఓపెన్ ఎండెడ్ గా ముగించారు. అబ్దుల్ ఖాదర్ నిజంగా ఉగ్రవాదా లేక అమాయకుడ్ని పోలీసులు ఇరికించారా అనేది చెప్పకుండా పాఠకుల వూహకే వదిలేశారు. ఓ ఇంటర్వ్యూలో ఈ కథ గురించి చెప్తూ రచయిత ఇలా అన్నారు. 'ఇస్లాం ఉగ్రవాదమనేది నిజం. ఈ కథని ప్రచురించడానికి ఏ పత్రికా ఒప్పుకోలేదు. ఒకరిద్దరు సంపాదకులు ఫోన్ చేసి ఈ కథను ప్రచురిస్తే ముస్లింలనుంచి వాళ్ళకు సమస్యలొచ్చే ప్రమాదముందని చెప్పారు. నిజాల్ని నిర్భయంగా తెలియచేయాల్సిన పత్రికలు ఇలా జంకి వెనకడుగు వేస్తే సాహిత్యంలో కల్పనలు తప్ప ఇటువంటి ఘోరమైన నిజాల నగ్న స్వరూపమేదో ప్రజలకు ఎలా తెలుస్తుంది' అంటూ ప్రశ్నించారు. రచయిత కథని ఓపెన్ ఎండెడ్ గా ముగించడానికి కారణం కూడా ఈ జంకే కావచ్చేమో.

ముస్లింలలో షియా వర్గానికి చెందిన మగవాళ్ళకి ఓ వెసులుబాటుంది. దూరప్రాంతాలకు వెళ్ళి ఎక్కువ కాలం అక్కడ గడపాల్సి వస్తే అక్కడి ముస్లిం అమ్మాయిని ముతా పెళ్ళి చేసుకోవచ్చు. ఇస్లాం ప్రకారం పెళ్ళనేది ఇద్దరు వ్యక్తుల మధ్య కాంట్రాక్ట్ లాంటిది. ముతా పెళ్ళిలో ఒక నిర్దిష్టకాల పరిమితికి లోబడి ఈ కాంట్రాక్ట్ అమల్లో ఉంటుంది. అంటే ఫలానా రోజు నుంచి ఫలానా రోజువరకు మాత్రమే వాళ్ళిద్దరూ భార్యాభర్తలు. ఆ గడువు ముగియగానే విడాకులు ఇచ్చేసినట్టే లెక్క. దీన్ని కథాంశంగా తీసుకుని రాసిన కథ 'ఆకుపచ్చని కన్నీరు'.

సాజిద్‌కి పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. రెండేళ్ళ డెప్యుటేషన్ మీద కొట్టాయం వెళ్ళినపుడు ఇంటి ఓనర్ కూతురు ఖాతూన్ మీద కన్నుపడ్తుంది. ఆమె తండ్రికి డబ్బాశ చూపి, మసీదులో పరిచయమైన మౌల్వీ సాయంతో నిఖా చేసుకుంటాడు. రెండేళ్ళ కాలపరిమితి పూర్తి కాగానే తలాక్ చెప్పి విడాకుల్విడానికి ఉద్యుక్తుడవుతాడు. అతనికి పెళ్ళయి ఇద్దరు పిల్లలున్నారన్న విషయం తెల్సుకుని ఖాతూన్ హతాశురాలవుతుంది. తండ్రి ఈ విషయం దాచిపెట్టి నిఖా చేసినందుకు ఎవర్ని నిందించాలో అర్థం కాదు. చివరికి తనని రెండో భార్యగా అయినా స్వీకరించమని వేడుకుంటుంది. ఈ రెండేళ్ళు శారీరిక సుఖం అవసరం కాబట్టి ముతా పెళ్ళి చేసుకున్నాను తప్ప ఇద్దరు భార్యల్ని పోషించే ఉద్దేశం నాకు లేదంటాడతను. 'ఇదంతా మీ నాన్న నీకు చెప్పకుండా దాస్తే అందులో నా తప్పేముంది' అంటాడు.

'సరే. మీ తప్పేమీ లేదు. మీకిది రెండో వివాహమని చెప్పకుండా దాచిన అబ్బాదీ తప్పు కాదు. పాపం ఆడపిల్ల పెళ్ళి చేయలేని అశక్తుడు. అంతకన్నా చాతకాని అసమర్థుడు. తప్పంతా నాదే. పేద ముస్లిం కడుపున ఆడపిల్లగా పుట్టడం' అంటూ ఖాతూన్ ఏడుస్తుంది.

'ముస్లిం స్త్రీ బజార్లో దొరికే వస్తువా? అవసరమైనన్ని రోజులు వాడుకుని తర్వాత విసిరేసి పోవడానికి.. ఆమెకూ మనసుంటుంది. ఆమెకూ ఆశలూ కోరికలు ఇష్టాఇష్టాలు ఉంటాయి. గుండెనిండా గాఢమైన అనుబంధాలూ

అప్యాయతలు ఉంటాయి.... నాకెందుకీ శిక్ష? నేను మీ భార్యనా ఉంపుడుగత్తెనా? భార్యనే అయితే ఎందుకు వదిలేయాలనుకుంటున్నారు? పెళ్ళంటే రెండు శరీరాల కలయిక మాత్రమేనా? రెండు మనసులు, రెండు హృదయాలు కలిస్తేనే కదా ఆ అనుబంధం' అని నిలదీస్తుంది.

'అది న్యాయమో కాదో వెళ్ళి మత పెద్దల్ని అడుగు. నన్ను కాదు... నేను మన మతానుసారమే ప్రవర్తిస్తున్నాను' అంటాడతను.

గత కొన్నేళ్ళుగా దేశంలో హిందూత్వ భావజాలం, మతతత్వం పెచ్చుమీరిపోయాయి. ముస్లింలు పరాయీకరణకు లోనవుతున్నారు. మత విద్వేషాలు, వైషమ్యాలు రాజ్యమేలుతున్నాయి. స్వల్ప కారణాలతో మైనారిటీ మతస్థుల మీద దాడులు పెరిగాయి. ఒకప్పుడు సఖ్యతగా ఉన్నవాళ్ళే ఇప్పుడు దూరం జరుగుతున్న పరిస్థితిని చిత్రించిన కథ 'కళ తప్పుతోంది'. నాటక కళకు పూర్వ వైభవం తీసుకురావాలనే ఉద్దేశంతో పాతికేళ్ళ క్రితం సత్య కళా నికేతన్ అనే సంస్థను స్థాపించి నాటకాలు వేస్తుంటారు సత్యమూర్తి, రఫీ. ఇద్దరికీ చిన్నప్పటినుండీ స్నేహం. 'సాయిబుల కుర్రాడితో నీకు స్నేహం ఏంట్రా అప్రాచ్యుడా? ఆ నీచు కూరలు తినేవాడితో కలిసి తిరిగావంటే కాళ్ళు విరగ్గొడ్తా' అంటూ సత్యమూర్తి వాళ్ళ నాన్న తీవ్రంగా మందలించినా 'వాడి తిండి వాడిష్టం నాన్నా. అది మా స్నేహానికి అడ్డురాదు' అంటూ సమాధానమిస్తాడు.

వాళ్ళు ఏ నాటకం వేసినా అందులో ముఖ్య పాత్ర పోషించేది రఫీనే. పౌరాణిక పాత్రలైన రాముడు, కృష్ణుడు వేషాల్లో రఫీ చక్కగా ఒదిగిపోయే వాడు. కాలేజీ రోజుల్లో శ్రీరామ వనవాసం అనే నాటకం చాలాసార్లు వేశారు. అందులో రఫీ రాముడిగా సత్యమూర్తి లక్ష్మణుడిగా వేషాలు వేశారు. అదే నాటకాన్ని ఇప్పుడు వేద్దామంటాడు రఫీ. 'నేను లక్ష్మణుడి వేషం వేస్తాను సరే. రాముడి వేషం వేసేదెవరు?' అంటాడు సత్యమూర్తి. అతని ఆంతర్యం ఏమిటో అర్థం కాక 'ఆ రోజుల్లో రాముడి వేషం వేసింది నేనేగా. ఇప్పుడూ నేనే వేస్తాను' అంటాడు రఫీ.

'ఆ రోజులు వేరు. ఇప్పుడు పరిస్థితులు చాలా మారాయి రఫీ. నువ్వు రాముడిగా వేషం కడితే మా వాళ్ళు ఒప్పుకోరు. గొడవలు జరుగుతాయి' అంటాడు సత్యమూర్తి. సూటిగా చెప్పమని అడిగితే 'ఒక ముస్లిం రాముడి వేషం వేయడాన్ని మా హిందువులు ఒప్పుకోరు' అంటాడు. 'వేషం వేయడానికి కావాల్సింది మంచి ఆహార్యం, చక్కని నటన, వాక్పటిమ.. ఇవేగా.. నటించేవాడి మతంతో ఏం పని? ఇంతకూ ఒప్పుకోనిది హిందువులా లేక నువ్వా?' అని నిలదీస్తాడు రఫీ.

'సమాజంలో ఎంత మార్పొచ్చిందో గమనించటం లేదా? ఏ మతానికా మతం దుర్భేధ్యమైన కంచు కోటలా మారుతున్న కాలమిది. జవసత్వాలు కూడగట్టుకుని తనవాళ్ళని సమీకరించుకుని తన ప్రత్యేకమైన ఉనికిని చాటుకునే ప్రయత్నం ప్రతి మతమూ చేస్తోందిపుడు. రాముని వేషం కట్టడానికి మన హిందువుల్లో నీకు నటులే దొరకలేదా అని నన్ను నిలదీస్తే నేనేం సమాధానం చెప్పమంటావు?' అంటాడు సత్యమూర్తి.

'ఇన్నాళ్ళూ కళాకారులకు కులం మతం ప్రాంతం అంటూ ఉండవనీ వాళ్ళు సమస్త లోకహితం కోసం కళల్ని సాధన చేసేవాళ్ళనీ నమ్మేవాడిని. నిజమే. రోజులు మారిపోయాయి. కళలకు కులం బూజు అంటుకుంటోంది. ప్రాంతీయ చీడ పట్టుకుంటోంది. మతం చెదపురుగులా మారి అడ్డుపడటంలో ఆశ్చర్యం ఏముంది?' అంటూ బాధపడ్డాడు మరో నటుడు. 'కళలకు తుప్పు పట్టింది' అని బాధపడ్తున్న రఫీతో ముక్తాయింపుగా 'తుప్పు పట్టింది కళలకు కాదు.. కొంతమంది కళాకారులకు..' అంటూ కథని ముగిస్తాడు.

ముస్లింలని దేశద్రోహులుగా చూడటం ఆనవాయితీగా మారిపోయింది. ఎక్కడ ఏ బాంబులు పేలినా ఎక్కడ ఏ విద్రోహక చర్య జరిగినా మొదటి అనుమానితులు ముస్లింలే. ప్రతి క్షణం ముస్లింలు తమ దేశభక్తిని నిరూపించుకోవాల్సిన అగత్యం ఏర్పడింది. మన దేశంలోని ముస్లింలు పాకిస్తాన్‌కి కొమ్ముకాసే ధోఖేబాజ్‌లన్న శాశ్వత ముద్ర వాళ్ళ నుదుటిమీద వేయబడిందన్న విషయాన్ని తన 'లోహముద్ర' కథలో తెలియచేస్తారు సలీం.

అబ్దుల్ సత్తార్‌కి అరవై యేళ్ళు. కొడుకులు దుబాయ్, కువైట్ దేశాలకు పని వెతుక్కుంటూ వలస వెళ్ళారు. ఇంటి కిటికీ రెక్కల మీద నివాసం ఏర్పరచుకున్న పావురాళ్ళకు గింజలు వేయడం, ఐదు పూటలా నమాజ్ చదవడం, మనవళ్ళతో మనవరాళ్ళతో ఆడుకోవడంతో రోజులు హాయిగా గడిచిపోతుంటాయి. ఓ రోజు ఓ పావురం కాలికి ఏదో కాగితం

# రోడ్డు స్వగతం



పగలంతా ఒళ్ళు హూనమయ్యేలా
ఒకటే రద్దీ తొడతొక్కిడి
ఏ అర్ధరాత్రో కాసింత కునుకు
పడదామంటే
ఎడతెరిపిలేని మంచువాన
తారును కంకర రాళ్ళను గడ్డకట్టించే
జీరో డిగ్రీ చలి.

రాత్రిని చలి నిద్రపుచ్చుతుందో
చలిని రాత్రి బతిమాలుతుందో
సందిగ్ధావస్థ.

పేవ్ మెంట్లపై
గుడి మెట్లపై
సజీవమైన మంచు శిల్పాలు
దేహపత్రాన్ని కొరుక్కు తింటున్న
చలి కీటకం

నన్ను కాసేపు ఏకాంతంగా ఉంచండి.
నెలవంక వెలుగులో నిలువెల్లా
అభ్యంగనమాచరించాలని ఉంది.

నిద్రకళ్ళను నింగికి తగిలించి
ఊరి పొలిమేరలదాక పోయి
గన్నేరు పూల పరిమళాన్ని
గుండెనిండా
ఆఘ్రాణించాలని ఉంది.

సంధ్య సూర్యుడు పోతూ పోతూ
కిరణాల సూదులతో దేహాన్నంతా
చీకటి పచ్చబొట్టుతో
నింపి వెళ్ళాడు.

మీకు చేతులెత్తి మొక్కుతాను
తప్పతాగిన కైపులో నా దేహాన్నంతా
రక్తంతో నింపకండి.

రేపు వాళ్ల రక్తపుష్పాలు నన్ను
పలురకాలుగా నిందిస్తూ
దుమ్మెత్తి పోస్తుంటే నేనేమి
జవాబివ్వలేను.
అపరాధిగా తలవంచుకొని
నిలబడటం తప్ప ???

- గరికపాటి మణీందర్
99483 26270

◆

కట్టి ఉండటం గమనిస్తాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్. అదేదో కోడ్‌లో రాసిన రహస్య సమాచారమని సత్తార్‌ని అరెస్ట్ చేసి అందులో ఏం రాసి ఉందో, ఎవరికి పంపుతున్నావో చెప్పమని రకరకాలుగా హింస పెడ్తారు. చివరికి మిలటరీవాళ్ళకు అప్పగిస్తారు. ఆ తర్వాత సత్తార్ ఏమైనాడో ఎవ్వరికీ తెలియదు. ఆ కాగితాన్ని అతని మనవడు పసితనపు అమాయకత్వంతో పావురం కాలికి కట్టి ఉంటాడు. కానీ పోలీసులు తనని కూడా పట్టుకెళ్ళిపోతారేమోనన్న భయంతో నిజం చెప్పడు. సత్తార్ భార్య అతని కోసం ఎదురుచూసి చూసి పిచ్చిదైపోతుంది.

'కాసింబీ తనలో తను గొణుక్కుంటోంది. ఎవ్వరితో మాట్లాడదు. ఎవ్వర్నీ గుర్తుపట్టటం లేదు. ఆమెకు మతిస్థిమితం తప్పింది. పావురాల్ని ఎక్కడ చూసినా "సైతాన్ సైతాన్" అంటూ వాటి వెంటపడి పరుగెత్తుతుంది. రాళ్ళతో వాటిని తరిమి తరిమి కొడ్తుంది. పోలీసులు రోడ్డుమీద కన్పిస్తేచాలు "సైతాన్ సైతాన్" అంటూ భయంతో వణికిపోతూ వాళ్ళ నుంచి దూరంగా పారిపోతుంది. ఆ యింటి కిటికీల మీద ఇప్పుడు ఒక్క పావురం కూడా వాలటం లేదు. పావురాల కువకువల్తో ఒకప్పుడు సందడిగా ఉండిన ఆ యిల్లు ప్రస్తుతం గోరీల దిబ్బలా కన్పిస్తోంది.' అంటూ ముగిస్తాడు రచయిత.

సలీం రాసిన ముస్లిం కథల్లో మతాన్ని అడ్డుపెట్టుకుని ముస్లిం మగవాళ్ళు స్త్రీలమీద జరుపుతున్న అకృత్యాల మీద, అణచివేత మీద తీవ్రమైన నిరసన కన్పిస్తుంది. ముస్లింల పేదరికం, అవిద్య మీద సానుభూతి వ్యక్తమవుతుంది. ఈ కథల్లో ముఖ్యంగా స్త్రీల తరపున నిలబడి పోరాడే రచయిత దృక్పథం ద్యోతక మౌతుంది. ముస్లిం సమాజంలో రావాల్సిన సంస్కరణల గురించి ధైర్యంగా తన కథలద్వారా చెప్పడంలో, వాళ్ళ జీవితాల్లోని దైన్యాన్ని, వాళ్ళు ఎదుర్కొంటున్న పరాయీకరణను మనసుకు హత్తుకునేలా చిత్రించడంలో, ముస్లింల జీవితాల్లోని పలుపార్శ్వాల్ని విశ్లేషించడంలో సలీం సఫలీకృతులయ్యారని పై కథల్ని చదివితే అర్థమవుతుంది. ◆


28.02.1922 - 24.11.1988

# రాచమల్లు రామచంద్రారెడ్డి జీవన రేఖలు

- తక్కోలు మాచిరెడ్డి

కడప జిల్లా సింహాద్రిపురం మండలం పైడిపాళెం అనే గ్రామంలో 1922 ఫిబ్రవరి 28న జన్మించినాడు రాచమల్లు రామచంద్రా రెడ్డి. తండ్రి బయపురెడ్డి, తల్లి ఆది లక్షుమ్మ. రారా అన్న భైరవ కొండారెడ్డి. ప్రాచీన సాహిత్యం మీద గట్టి పట్టువున్న కవి, కాంగ్రెస్‌లో వుంటూ సత్యాగ్రహం చేసిన వాడు. రారా తమ్ముళ్లు ముగ్గురు - సాంబశివారెడ్డి, రామకృష్ణారెడ్డి, శేఖర్‌రెడ్డి. అందరూ బుద్ధిజీవులే. ఇంట్లో మేధో వాతావరణం ఉండేది. రారాకు వీరుగాక ఇద్దరు సోదరీమణులు కూడా ఉండేవారు. రాచమల్లు రామచంద్రారెడ్డి కడప జిల్లా పులివెందులలోని డిస్ట్రిక్ట్ బోర్డు హైస్కూల్లో చదువుకున్నాడు. (1931-37), ఇంటర్ అనంతపురంలో ఆనాటి దత్త మండలం జిల్లా కాలేజీ (అదే ఇప్పుడు ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల అయింది)లో చదివాడు (1037-39). ఆయన సంవేదనశీలి అన్న విషయం ఇంటర్ చదువుతున్నప్పుడు జరిగిన ఒక సంఘటన తెలియజేస్తుంది. రారా గ్రామానికే చెందిన పి.సి. రెడ్డి చెప్పినట్లు రారాకు చదువు మీద ఆసక్తి లేదట. ఆయన ఎక్కువ భాగం పేకాట ఆడుతూ గడిపేవాడట. ఇది తెలిసి వాళ్ల నాన్న రామచంద్రారెడ్డి రూము మార్పించాడు. ఆయనను పి.సి. రెడ్డి రూములో ఉంచాడు. పి.సి. రెడ్డి సంరక్షణలో ఉంటే చదువుకుంటాడు, బాగుపడతాడు అనే ఉద్దేశంతో ఈ పని చేశాడు. కాని తాను మరొకరి సంరక్షణలో ఉండటమేమిటని రారా 'నేనే రైలు కింద పడి చస్తా'నని అన్నాడట పి.సి. రెడ్డితో సీరియస్‌గా.

ఇంటర్ తరువాత రారా చెన్నైలోని గిండీ ఇంజనీరింగ్ కళాశాలలో చేరాడు. కానీ అక్కడ 1941లో జరిగిన ఒక సంఘటన రారా జీవితంలో ఒక పెద్ద మలుపు తెచ్చింది. చంద్ర పుల్లారెడ్డితో పాటు రారా కూడా కాలేజీ నుంచి బహిష్కరింపబడ్డాడు. కారణం? గాంధీజీ జైలులో చేపట్టిన నిరాహార దీక్షకు మద్దతుగా ఇంజరీరింగ్ విద్యార్థులు సమ్మె చేశారు. సమ్మెలో పాల్గొన్న వారిని కాలేజీ నుంచి తొలగించి, క్షమాపణ చెప్పుకున్న వారిని తిరిగి చేర్చుకున్నారు. చదువు కొనసాగనిచ్చారు. కాని రారా, చంద్రపుల్లారెడ్డి క్షమాపణ చెప్ప నిరాకరించినారు. ఫలితంగా కాలేజీ నుంచి తొలగింప బడ్డారు. తెలుగు సాహిత్యానికి ఇందువల్ల మేలే జరిగింది. ఆ తరువాత ఊరకుండటమెందుకని రారా, కొండాపురంలో మకాం పెట్టి ఉల్లిపాయల వ్యాపారం చేశాడు. నష్టాలు 'సంపాదించాడు.' 1955లో కమ్యూనిస్టు నాయకుడు గజ్జెల మల్లారెడ్డి గారికి పులివెందుల నియోజకవర్గంలో ఎలక్షన్ ఏజెంటుగా వుండినాడు. అప్పటికి రారాలో మార్క్సువాదం పట్ల స్థూలంగా మొగ్గు ఉండింది. రారా కడపలో స్థిరపడక ముందే కొన్ని

కథలు రాశాడు. 1957,58,59 సంవత్సరాలలో రాసిన ఈ కథలు 'అలసిన గుండెలు' శీర్షికతో 1960లో అచ్చయినాయి. ఈ సంపుటికి ముందుమాట రాశాడు కొడవటిగంటి కుటుంబరావు రారా కథల్ని మెచ్చుకుంటూ. కడపకు వచ్చిన తరువాత రారా రామకృష్ణ గ్రంథాలయం వైపు దృష్టి సారించాడు. విస్తృతంగా, లోతుగా అధ్యయనం చేశాడు. ముఖ్యంగా యూరోపియన్ సాహిత్యం పట్ల సాహిత్యాభిరుచిని అభినివేశాన్ని పెంచుకున్నాడు. 1959లో వ్యక్తి స్వాతంత్ర్యం సమాజ శ్రేయస్సు అనే పెద్ద వ్యాసం రాసి రాచమల్లు రామచంద్రా రెడ్డి రారా అయినాడు. అందులో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని గురించి ఒక నూతన దృష్టి ఇవ్వగలిగాడు. ఈ వ్యాసం 'సందేశం' అనే మార్క్సిస్టు పత్రికలో అచ్చయింది. వీణా విజయరామరాజుగారి సారధ్యాన నడచిన 'ఉపాధ్యాయ' అనే పత్రికలో రారావి కొన్ని కథలు, వ్యాసాలు, సమీక్షలు అచ్చయినాయి. స్థానిక పక్ష పత్రిక, 'సవ్యసాచి' సంపాదకత్వ బాధ్యత మూడేళ్లపాటు (1959-63) సమర్థవంతంగా నిర్వహించాడు రారా. 'సవ్యసాచి' పత్రికలో నూతన రచయితల రచనలను ప్రచురించి ప్రోత్సహించాడు. అలా అని పత్రిక స్థాయిని దెబ్బతీసే రచనల్ని ప్రచురించే వాడు కాదు.

1962 నుంచి కడప జిల్లాలో రారా ప్రభజంనం వీవ సాగింది. కేతు విశ్వనాథరెడ్డి, నల్ల పాటి రామప్ప నాయుడు కడప ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకులుగా చేరారు. ఆ సంవత్సరమే చవ్వా చంద్రశేఖర్ రెడ్డి అడ్వకేటుగా, కార్మిక సంఘం నాయకుడుగా రంగంలో ఉండినారు. బంగోరె (బండి గోపాల్ రెడ్డి) సెంట్రల్ బ్యాంకులో పని చేసేవాడు. వామపక్ష భావాలున్న నర్రెడ్డి శివరామిరెడ్డి, జె. వెంకట్రామిరెడ్డి, కె. సుబ్బన్న, నంద్యాల నాగిరెడ్డి, ఐ.సుబ్బారెడ్డి అప్పుడప్పుడూ వచ్చి వెళ్లేవారు. అపుడు రారా కడప పట్టణం, బెల్లం మండి వీధిలో ఒక మేడపైన ఉండేవాడు. అక్కడ చేరే సాహితీ సహచరులకు రారా స్వయంగా కాఫీ తయారు చేసి ఇచ్చేవాడు. చక్కెర తక్కువ స్ట్రాంగ్ కాఫీ, అప్యాయంగా దీన్నే ఎడిటర్స్ కాఫీ అనే వాళ్లు మిత్రులు, సండే క్లబ్ అనబడే ఈ మిత్ర మండలి సమావేశాలలో ఓ అరగంట కావ్య పఠనం, ఆ తరువాత సాహతీ చర్చలు జరిగేవి. కొత్తగా చేతికొచ్చిన పుస్తకాల మీదా, సమకాలీన పరిస్థితి మీదా, సకృత్తుగా రాజకీయాల మీదా చర్చలు సాగేవి. సాహిత్యం మీద వాదోపవాదాలు, కోప తాపాలు, రారా జోక్యాలు వుండేవి. జీన్‌పాల్ సార్త్ర్, ఖలీల్ జిబ్రాన్ మొదలుకొని అందరి మీదా చర్చలు జరిగేవి. సవ్యసాచిలో కేతు విశ్వనాథరెడ్డి కథలు ప్రచురించి ప్రోత్సహించాడు రారా. విశ్వనాథరెడ్డికి ప్రేరణ రారా. అతని మొదటి నాటకం 'వలలో చేపలు' 1963లో సవ్యసాచిలో ప్రచురించాడు. 1963 సెప్టెంబర్‌లో కేతు కథలు రెండు 'ఆనాడు వాళ్లు' చీకటి తప్పు' నవ్యవసాచిలో అచ్చయినాయి. కానీ 'గజ్జికుక్క' అనే ఆయన కథ రారాకు నచ్చక పోవడంతో ప్రచురించలేదు. రారాపై వున్న గురితో మరో ఏడేళ్ల పాటు కథలు రాయలేదు కేతు విశ్వనాథరెడ్డి.

రారాకు పుట్టపర్తి నారాయణాచార్యులు అంటే ఎంతో గౌరవం. కాని ఆయన మీద కూడా ఘాటైన వ్యాసం రాశాడు. అలాగే సహచరుడూ, సన్నిహితుడూ అయిన వై.సి.వి. రెడ్డి కవిత్వం మీద కూడా విమర్శనాత్మక వ్యాసం రాశాడు. వ్యక్తిగతంగా మిత్రులైనంత మాత్రాన వారి సాహిత్య స్థాయికి సంబంధించిన రారా తీర్పు ఆత్మాశ్రయంగా వుండేది కాదు. ఇందుకు నిదర్శనం కడప జిల్లా కవులను గూర్చిన రారా మూల్యాంకనం. రాయలసీమ సర్కారు జిల్లాలకు మధ్య పలు రంగాలలో కనపడే వ్యత్యాసం తెలుగు సాహిత్య చరిత్రలో కూడా ప్రతిఫలించింది అంటాడు రారా. "ఆధునిక నాగరికతకు ప్రాణప్రదమైన వ్యావహారిక భాష కొరకు గిడుగు, గురజాడల వంటి యుగ పురుషులు మహోద్దండ పండిత ప్రకాండులతో ప్రచండ యుద్ధం కొనగించే కాలంలో మన ప్రాంతంలోని కవి పండిత మండలికి వ్యావహారిక భాష ప్రసక్తే తెలియదు. మన జిల్లాలోని సుప్రసిద్ధ పండిత కవి వావిలకొలను సుబ్బారావు పంతులు ఛాందస గ్రాంథిక భాషా వాదులను బలపరచిన వాడే, గురుజాడ అప్పారావు తెలుగు సాహితీ సుందరికి ముత్యాల సరాలు కూర్చుతూ వుండిన కాలంలో మన వావిలకొలను రతీదేవి కుచ కుంభ కటి చక్రాలను చక్ర బంధాలలో, నాగ బంధాలలో బంధించి శ్రీకుమారాభ్యుదయ ప్రబంధం రచిస్తూ వుండినాడు. భావకవిత్వం మీద తిరుగుబాటు వచ్చి 1934లో మహాకవి శ్రీశ్రీ పీడిత ప్రజా కోటి ప్రతినిధిగా కంఠమెత్తి మరో ప్రపంచానికి బాటలు తీస్తూ పాటలు వ్రాసే కాలంనాటికి మన రాజశేఖర శతావధాని గారి రాణా ప్రతాప సింహ చరిత్ర రచన పూర్తి అయింది". అని రారా వివరించాడు. 1963-64 ప్రాంతాల్లో కొన్నాళ్లు రారా కేంద్రంగా జరిగే చర్చలు వారి సహచరులైన చంద్రశేఖర రెడ్డి ఇంట్లో (నాగరాజుపేటలో) జరిగేవి. కొన్ని రోజులు రామప్ప

నాయుడు, చెన్నారెడ్డి, ఆర్వీయార్లు కలిసివున్న ఇంట్లో ఈ చర్చలు కొనసాగినాయి. ఎన్‌కౌంటర్, లైఫ్, మెయిన్‌స్ట్రీమ్, లింక్, ఇంప్రింట్ పత్రికల్లో వచ్చిన వ్యాసాలు మీద చర్చించే వాళ్లు. పాస్తర్‌నాక్, సోల్జినిత్సన్, వోజ్నెసెన్స్కీ, పికాసో, కుష్వంత్ సింగ్ మొదలైన ఎందరో రచయితలు, కళాకారుల రచనలు, కళాకృతులు ఈ రారా - కేంద్రిత ఇష్టా గోష్ఠిలో చర్చనీయాంశాలు. అలాగే అక్టోబరు విప్లవం. చైనా స్థితిగతులు, క్యూబా సంక్షోభం, తూర్పు యూరప్ దేశాల సమస్యలు వీటన్నింటి మీదా సుదీర్ఘ చర్చలు సాగేవి.

1944లో రారా విజయవాడ నుంచి వెలువడే 'విశాలాంధ్ర' దిన పత్రికలో ఉపసంపాదకుడుగా చేరాడు. కానీ అక్కడ చాలా రోజులు కొనసాగలేక పోయాడు. దిగంబర కవితపై 'విశాలాంధ్ర'లో ఆయన రాసిన ఒక సుదీర్ఘమైన విమర్శ అచ్చయింది. కాని 'విశాలాంధ్ర' సంపాదకులు కాట్రగడ్డ రాజగోపాలరావు గారికీ ఉపసంపాదకుడు పరుచూరి కోటేశ్వరరావు గారికీ ఆ విమర్శ నచ్చలేదు. రారా కడప వెళ్ళినప్పుడు దానిపై ప్రతివిమర్శ అదీ ఆ పత్రికలోనే ఉప సంపాదకునిగా పని చేస్తున్న పరుచూరి కోటేశ్వరరావుగారు రాసిన ప్రతివిమర్శ అచ్చు వేశారు. బయటి వాళ్లు ఎవరైనా ప్రతివిమర్శ రాసి వుంటే, దాన్ని ప్రచురిస్తే బాగుండేదని, కానీ అదే పత్రికలో పని చేస్తున్న తోటి ఉప సంపాదకునితో రాయించి అచ్చు వేయడం అక్రమమని రారా భావించినాడు : నొచ్చుకున్నాడు. కోప్పడ్డాడు. ఉపసంపాదకపదవికి రాజీనామా చేశాడు. పెద్దలు మద్దుకూరి చంద్రశేఖరరావు గారూ, నీలం రాజశేఖరరెడ్డి గారూ నచ్చ జెప్ప బోయినా రారా వినలేదు. రాజీ పడే మనస్తత్వం కాదు రారాది. అంతే కాదు ఆయనకు గుమస్తా మాదిరి ఆఫీసు పని చేయడం బొత్తిగా ఇష్టం లేదు. (రారా లేఖలు - 18.6.64) 'విశాలాంధ్ర'లో వుండగానే రారా శ్రీశ్రీ లిమరిక్కులపై అస్త్రం సంధించాడు. లిమరిక్కులు ఆగిపోయాయి. కానీ 'విశాలాంధ్ర'లో ఎక్కువ కాలం ఇమడలేక పోయాడు ఆయన.

1965 ప్రాంతంలో రారా 'సామ్యవాద' ప్రణాళికా పత్రం తెలుగులోకి అనువదించినాడు. తరువాత అప్పు చేసి దాన్ని అచ్చువేయించాడు. మార్క్స్, ఏంగెల్స్ లంటే అంత అభిమానం రారాకు. 1965-66లో యూరోకేంద్రిత సామ్యవాద నినాదం ఒక్కటి వచ్చింది దీన్ని రారా సమర్థించేవాడు. హంగేరిపై అంతకు ముందు జరిగిన రష్యా ఆక్రమణను రారా ఖండించినాడు. 1965 నుంచి కడప ఎర్రముక్కపల్లెలోని గ్రీన్‌ల్యాండ్స్ సాహిత్య అవగాహనకూ, వివేచనకూ, సంవేదనకూ నిలయమైంది. గ్రీన్‌ల్యాండ్స్ అంటే ఏదో కాదు. అధ్యాపకులు చెన్నారెడ్డి, ఆర్వీయార్ (ఆర్.వెంకటేశ్వరరావు) కాపురమున్న ఇల్లు. ఆ దగ్గర్లోనే రారా ఇల్లు. కేతు విశ్వనాథరెడ్డి , వై.సి.వి రెడ్డి, సాంబశివారెడ్డి కూడా దగ్గర్లోనే వుండేవారు. గ్రీన్‌ల్యాండ్స్ ముంగిల్లో జరిగే చర్చల్లో పాల్గొనేందుకు వీరితో పాటు కొత్తపల్లి రవిబాబు (ప్రస్తుతం 'ప్రజాసాహితి' సంపాదకులు), సూరయ్య, రామక్రిష్ణ తదితర సాహితీమిత్రులు వచ్చే వారు. రారా కేంద్రంగా వున్న ఈ సాహితీ బృందంలోకి అప్పుడప్పుడు వచ్చి కలిసేవారు. ఉపాధ్యాయ ఉద్యమంలోని రాజా సాహెబ్, లైబ్రరీలో పనిచేసే వీణారమాపతిరాజు.

ఎన్‌కౌంటర్, లైఫ్ పత్రికలు ఇష్టంగా చదివేవాడు రారా. విశ్వనాథ రెడ్డి ఆధునాతన పుస్తకాలు తెచ్చి రారాకు ఇచ్చేవాడు. సామ్యవాదం అంటే, ఆధునికీకృత సామ్యవాదం అని వ్యాఖ్యానించేవాడు రారా. మార్క్సువాదం పిడివాదం కాదనీ సృజనాత్మకతంగా దాన్ని అభివృద్ధి పరచి, పరిస్థితులకు అనుగుణంగా సమ్యక్ దృష్టితో అన్వయించాల్సిన అవసరం ఎంతైనా ఉందనీ రారా భావించాడు. అందుకే ఆయనను సృజనాత్మక సామ్యవాది అని అనవచ్చుననుకుంటాను.

1968 ఏప్రిల్‌లో 'సంవేదన' త్రైమాసిక పత్రిక తొలిసంచిక వెలువడింది. రారా సంపాదకత్వాన. తెలుగు పత్రికారంగంలో అదో నూతన ఒరవడి. 'సంవేదన' యుగ సాహితీ ప్రచురణ. ప్రచురుణ కర్త వై.సి.వి. రెడ్డి, ముద్రాపకుడు అజంతా ప్రెస్ అధిపతి కొండయ్య. ఒక చిన్న పట్టణమైన కడపకు పేరు తెచ్చిన పత్రిక ఇది. ఒక సాహితీ పత్రిక వెలువరించాలని యుగ సాహితీ ఆరంభ దశలోనే అనుకున్నారు. రెండు పేర్లు అవాహన, ఉచ్చాటన ప్రతిపాదింపబడినాయి. కానీ కొంత చర్చ జరిగిన తరువాత సంవేదన అనే పేరు ఖరారు చేయబడింది. సంవేదన ఆవిష్కరణ సభ 28.03.1968న కడపలో జరిగింది. దీనికి శ్రీశ్రీ, కుటుంబరావు కూడా హాజరైనారు.

సంవేదన సాహితీ త్రైమాసిక పత్రిక మొదటి సంచిక 1968 ఏప్రిల్‌లో వెలువడింది. మొత్తం 7 సంచికలే వెలువడినాయి. అయినా అది చరిత్ర సృష్టించింది. ఆనాటి సాహితీ వాతావరణం రారా మాటల్లో ''సాహిత్యం వర్తకమైనప్పుడు జీవిత వాస్తవాన్ని చిత్రించదు. కృత్రిమ

అనుభూతులనే సృష్టిస్తుంది. వాటికి మార్కెట్ లేకపోతే, దాన్ని కూడా కృత్రిమంగా సృష్టిస్తుంది. విస్మరణవాద సాహిత్యమే నిజమైన సాహిత్య మైనట్లు భ్రమ కల్పించి, దానికి విస్తృతమైన మార్కెట్ సృష్టించారు. సాహిత్య వర్తకులైన పత్రికా సంపాదకులు' (సంవేదన ఏప్రిల్ 1968 పుట 6,7) అటువంటి సాహితీ పర్యావరణంలో ఒక ఉన్నత స్థాయి సాహితీ త్రైమాసిక వెలువరించడం అభినందనీయమైన సాహసం.

'సంవేదన' తొలి సంచికలోనే 'వాడిన మల్లెలు' అనే శీర్షికతో ఒకే ఇతివృత్తం తీసుకొని నలుగురు రచయితల చేత రాయించిన కథానికలు అచ్చుయినాయి. వీటిపై కుటుంబరావు గాఢ సమీక్ష రాస్తూ తెలుగులో ఇది అరుదైన ప్రయోగం అన్నారు. కానీ వస్తువు మహిళల్ని కించ పరిచేదిగా వుంది. అందుకే వాటిలో ఆశించిన గాంభీర్యం లేదేమో అనిపిస్తుంది. సంవేదన రెండవ సంచికలో రారావి మూడు సమీక్షా వ్యాసాలున్నాయి. ఆర్.యస్. సుదర్శనం గారి రచన 'సాహిత్యంలో దృక్పథాలు'పై 'మేరమీరిన మేధ' అనే శీర్షికతో సమీక్షిస్తూ రారా, మన మేధోస్థాయిని గురించి రాశాడు. ప్రతీకవాదం, స్వభావవాదం అంటి ఆధునిక ధోరణలు యూరప్‌లో ఎప్పుడో వచ్చినాయనీ, అవి చాలా ఆలస్యంగా తెలుగులో వచ్చి వెంటనే అదృశ్యమైనాయనీ అస్తిత్వవాదం, అధివాస్తవికతావాదం గురించి మన వాళ్లు ఆలోచించడం మొదలుపెట్టేటప్పటికే యూరప్‌లో అవి క్షీణముఖం పట్టినాయనీ రారా తన అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. ఆర్.యస్. సుదర్శనం గారి పాండిత్యాన్ని, మేధస్సును మేర మీరిన మేధగా భావిస్తాడు. ఈ పుస్తకంలో అల్లసాని పెద్దన, గురజాడ, విశ్వనాథ సత్యనారాయణ, గోపీచంద్, చలం- వీరిని గురించి ఐదు వ్యాసాలు, సాహిత్యంలో కాలం అనే శీర్షికతో ఒక వ్యాసం ఉన్నాయి. సిద్ధాంత స్థాయిలో ఆలోచించే వాడే మేధావి అని నిక్కచ్చిగా చెబుతూ, మేధావుల్లోని నాలుగు లోపాల్ని ప్రస్తావిస్తాడు రారా. వాస్తవ ప్రపంచంలోని ఘటనలను ముందు సాకల్యంగా పరిశీలించి, ఆ తరువాతనే సిద్ధాంత స్థాయిలో ఆలోచించడం న్యాయం. కానీ మేధావులు సాధారణంగా సిద్ధాంతాల స్థాయిలో ఆలోచించడం న్యాయం. కానీ సిద్ధాంతాల మీది మోజుతో వాస్తవాలను నిర్లక్ష్యం చేస్తారు. మరో లోపం ఏమిటంటే ఇప్పుడొస్తున్న విజ్ఞానాన్నంతటినీ ఆవపోశన పట్టడం మేధావులకు సాధ్యం కాకపోవడం, మూడవ లోపం సకల శాస్త్రాలూ, విజ్ఞానమూ అధ్యయనం చేసినప్పటికి వాటిపై ఒక సమ్యక్ దృష్టి ఏర్పడక పోవడం. ఈ లోపాలన్నీ ఏదో ఒక విధంగా పరిష్కరించుకున్నా, సిద్ధాంత స్థాయిలో ఒక కొత్త వాదమో, కొత్త అభిప్రాయమో తోచినప్పుడు నిష్పాక్షిక శాస్త్రీయ దృష్టితో పరిశీలించే నిర్మమత్వం తక్కువై దాన్ని సమర్థించు కోడానికి కుతర్కాలు సృష్టించుకుంటాడు మేధావి అన్నవాడు. దీన్ని నాలుగో లోపంగా భావిస్తాడు రారా. అదనంగా భారతీయ మేధావుల్లోని మరో లోపం ఏమిటంటే శాస్త్రజ్ఞులు యే కొత్త విషయం కనుక్కొన్నా అది మన పురాణాల్లో వుంది అనే జాతీయ దురహంకారం. ఈ లోపాలన్నీ ఆర్.ఎస్ సుదర్శనంలో కన్పిస్తాయని చెబుతూ రారా కొన్ని వ్యాసాల్ని స్పృశిస్తాడు. పెద్దనపై సుదర్శనంగారు రాసిన వ్యాసంలో మనుచరిత్రలోని వరూధినిని ముగ్ధగా కాకుండా, ఆమె కన్యా కాదు ముగ్ధాకాదు అని తీర్మానించాడు. మరో అభిప్రాయం వ్యక్తం చేస్తూ సుదర్శనంగారు 'మను చరిత్ర' శృంగార ప్రబంధం కాదనీ, అది గంభీరమైన ఆధ్యాత్మిక కావ్యమనీ వరూధినిని తంత్ర శాస్త్ర ప్రవీణ అనీ చెప్పడం విడ్డూరంగా వుందని ఎద్దేవా చేస్తాడు రారా. అలాగే కాలంపై సుదర్శనంగారు రాసిన తన వ్యాసంలో 20వ శతాబ్ది నవలలో ముఖ్యంగా చైతన్య స్రవంతి శైలిలో వ్రాయబడిన నవలల్లో - కార్యకారణ సంబంధానికి గౌరవంలేదు. ఇది హేతువాదం మీదా, కాలం యొక్క కర్కశ నిర్బంధం మీదా తిరుగుబాటు అని అంటారు. దీన్ని రారా ప్రశ్నిస్తాడు. కార్య కారణ సంబంధానికేదీ అతీతం కాదని చెబుతాడు. కానీ ఒక అర్థంలో అధివాస్తవికతా వాదం హేతుబద్ధం కాదు. సుదర్శనం గారు సాపేక్ష సిద్ధాంతాన్ని సరిగా అర్థం చేసుకోలేదనీ ఆ సిద్ధాంతం వెలుతురు వేగంగా పోల్చదగిన వేగంతో పయనించే వస్తువులకు మాత్రమే వర్తిస్తుందే గానీ, భూలోక వాసులైన మానవుల జీవితానుభవాలకది వర్తించదనీ స్పష్టంచేస్తాడు రారా.

సుదర్శనం గారు గిరీశంను గురించి 'అతనిలో మానవత్వం చావలేదనీ, గిరీశం దుష్టుడంటే యెలా దుష్టుడో తెలీదు!... గిరీశంలోని దుష్టత్వం అతని స్వేచ్ఛా ప్రవృత్తి మాత్రమేనా అనిపిస్తుంది. గిరీశంలో కోపం, లోభం, మదం, మాత్సర్యం దుర్గుణాలేవీ కనిపించవే!... ఒకల్ల కొంప తీయాలన్న తత్వం, పగ, పట్టుదల గిరీశానికి లేవు"! అని గిరీశానికి కితాబు ఇస్తాడు. కానీ రారా తన అభిప్రాయం వ్యక్తం చేస్తూ ఇలా అంటాడు. 'కంసుడు, కాలనేమి, శకుని లాంటి దుష్టుడు కాక పోవచ్చు గిరీశం. కాని సిగ్గూ లజ్జా,

మానం, అభిమానం లేని వంచకుడు, యే పాపభీతి లేని వంచకుడు, అణుమాత్రం కూడా అంతరాత్మ లేని వంచకుడు... గిరీశంకు వెంకటేశంతోనూ, ఫొటో గ్రాఫర్‌తోనూ, మధురవాణితోనూ, పూటకుళ్లమ్మతోనూ గల సంబంధాలను బట్టి అతను ఎంత నీచుడో తెలుస్తుంది. షేక్స్‌ఫియర్ నాటకాల్లోని విలన్‌లలా, గిరీశం దుష్టుడు కాదుగానీ, గురజాడ దృష్టిలో అతను నీచుడైన వంచకుడు. యెంత నీచుడంటే పూటకూళ్లమ్మ చీపురు తీసుకొని వెంట బడినా యేమీ అభిమాన పడనంత నీచుడు'. కానీ ఆర్.ఎస్. సుదర్శనం దృష్టిలో గిరీశం ఒక హాస్య పాత్ర. గిరీశంను గురించి చాలా మందికి చాలా అభిప్రాయాలున్నాయి. ఈ దృష్టి వైవిధ్యం గురజాడ పాత్రోన్మీలన పాటవానికి నిదర్శనం. అటువంటప్పుడు తనతో విభేదించే హక్కులేనట్లు రారా విమర్శించడం అసమంజసం అనిపిస్తుంది. సంవేదన ఈ సంచికలో సృజన చలం సమాలోచన సంచికపై రారా సమీక్ష వుంది. రారా మాట్లో చెప్పాలంటే 'చలమే లేకపోతే విశ్వనాథ సత్యనారాయణగారి కుళ్ళు ఫ్యూడల్ చాతుర్వర్ణ్య భావాల దుర్గంధంతో తెలుగు సాహిత్యం ఇంకా కంపుకొడుతూ వుండేది. చలమే లేకపోతే జీవిత వాస్తవానికి దూరమైన గాంధీయిజం లాంటి యే కుహనా మానవతావాదమో తెలుగు సాహిత్యంలో రాజ్యం చేస్తూ వుండేది. చలమే లేక పోతే సాహిత్యంలో సెక్స్ ప్రసక్తి తేవడమే అవినీతిగా అసభ్యంగా ఇంకా పరిగణింపబడుతూ వుండేది. చలమే లేకపోతే సాంప్రదాయిక నీతులకు విరుద్ధంగా కథలు రాసిన కుటుంబ రావూ, గోపీచందూ, బుచ్చి బాబూ మొదలైన వాళ్లు సంఘ నీతి పరిరక్షణ భటులైన సాహిత్య స్వాముల వాళ్ల నుండి యెన్ని బాధలు పడవలసి వచ్చేదో. ఆ బాధలన్ని చలం ముందే పడినాడు గనుక ఆ బాధలు పడకుండానే వాళ్ళ కథలకు తెలుగు దేశంలో అనుకూల వాతావరణ ఏర్పడింది. చలమే లేకపోతే తెలుగు సాహిత్యంలో స్త్రీ పురుషుల ప్రేమ బహుశా ఇంకా అడివి బాపిరాజు ప్రేమ కథల స్థాయిలో వుండేది... చలమే లేక పోతే మన సాహిత్యంలో వాస్తవిక వాదం ఇంత బలంగా వుండేది కాదు'. (సంవేదన జులై 1968 పుట 51) ఈ చలం సమాలోచన సంచికలో చలం కథల మీద శ్రీపతిగారూ, చలం నవలలపై నవీన్‌గారూ చేసిన పరిశీలనలున్నాయి. పురూరవ మీద సంపత్కుమారగారి వ్యాసం, చలం కవిత్వంపై వేగుంట మోహన ప్రసాద్‌గారి వ్యాసం ఉన్నాయి. వ్యాస కర్తలందరినీ కొత్త తరం విమర్శకులుగా సంభావించాడు రారా. కానీ చలం సాహిత్యాన్నంతటినీ సమగ్ర పరిశీలనకు తీసుకున్న వ్యాసం లేకపోవడం సృజన లోని ప్రధాన లోపంగా భావిస్తాడు రారా. ఇతివృత్తానికి సంబంధించిన శ్రీపతి, నవీన్ గార్ల వ్యాసాలు బాగానే వున్నాయి. గానీ చలంలో ఇద్దరికీ ప్రతీకవాదం కన్పించడం వాళ్ళ విమర్శనా శక్తినే శంకించేటట్లు చేస్తున్నదని అంటాడు రారా. (సంవేదన జూలై, 1968 నెట 56).

చలం సాహిత్యాన్ని పరిశీలించే వాళ్లు ఒక విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి అంటాడు రారా. అదేమిటంటే, చలం సాహిత్య రంగంలో ప్రవేశించింది ఒక సాహిత్య కారుడుగా కాదు. ఒక ప్రచారకుడుగా మాత్రమే. చలం ధ్యాసంతా ఇతివృత్తం మీదే, కళానియమాలు అసలు పాటించడు. కథలకు ఒక లక్ష్యమూ, లక్ష్య సాధనకు తగిన పాత్రలూ, ఆ పాత్రలకు అనువైన సన్నివేశాలూ. ఆ సన్నివేశాల కొక క్రమ పరిణామమూ మొదలైన శిల్ప నియమాలను చలం యెప్పుడూ పాటించలేదు. చలం నవలల్లో ఒక గొప్ప రచనగా పేరు పొందిన 'మైదానం' నిజానికి నవలా కాదు. కథానికా కాదు, దానికి నవలకుండాల్సిన సమగ్రతా లేదు, కథానికకుండాల్సిన ఏకాగ్రత లేదని విమర్శిస్తాడు రారా. నవీన్ గారు చెప్పిందాన్ని ఉటంకిస్తాడు. చలంగారి నవలల్లో కథ, ఇతివృత్తం, పాత్ర చిత్రణ, నాటకీయత, యథార్థ జీవిత చిత్రణ మొదలైన వాటి కోసం వెదికితే లాభం లేదు... చలంగారి నవలల్లో శిల్పం గాని పాత్ర చిత్రణ గాని అంత ముఖ్యం కావు. నిజానికి చలంగారు రాసిన యే నవలని కూడా గొప్ప నవల అనలేము, అని అంటాడు నవీన్. దీనిపై రారా వ్యాఖ్యానిస్తూ ఇంత వరకూ మంచిదే ఆపైన ఆయన అన్నమాటలు గమనించాలని నవీన్‌ని ఉటంకిస్తాడు. 'అసలు చలం గారే గొప్ప నవలాకారుడు కాదల్చుకోలేదు', దీని మీద రారా స్పందిస్తూ ఇలా అంటాడు. 'అసలు విషయం ఏమిటంటే – శ్రీపతి గారు నవీన్ గారు గుర్తించాల్సింది – తన కోరిన విధంగా ఏ రచయితా రాయడు, తాను ఎలా రాయగలడో ఈ విధంగానే రాస్తాడు."

చలంలోని మూలగామి (రాడికల్) ఆలోచనలను గురించి ప్రస్తావిస్తూ రారా 1940లో 'స్త్రీ'కి చలం రాసిన ముందుమాటలను ఉటంకిస్తాడు. చలం రాశాడు – 'ఆ కాలంలో నేను బ్రతకడం ఇష్టం లేని ప్రజల మీద దండెత్తి సెల్ఫ్ అసెర్ట్ చేసుకోవడమే ప్రధానంగా ఉండేది. ప్రజలకదెంత

కోపం తెప్పిస్తే నాకు అంత సంతోషం. నన్నెదిరించిన వాళ్లని అదర గొట్టడానికి ఎంత తీవ్రమైన మాటలూ శక్తి హీనంగా తోచేవి. అందువల్లె ఆనాటి నా పుస్తకాలనిండా అతిశయోక్తులూ, ఒన్ సైడెడ్ స్టేట్‌మెంట్స్, ద్వేషంతో కూడిన తిట్లూ అనవసర శృంగారమూ వుండేవి.' (సంవేదన అదే సంచిక పుట 58) దీని పట్ల రారాకు పట్టింపు వుంది. సృజన చలం సంచికను సమీక్షిస్తూ చలం రాసిన యశోదా గీతాలపై రాసిన వేనరెడ్డి గారి వ్యాసం పని గట్టుకొని చలంను పొగడటానికి రాసినట్టే వుందని అంటాడు రారా. జయదేవుని గీతగోవిందం, లీలాశుకుని కృష్ణకర్ణామృతం వంటి ఉత్తమ కావ్యాల వరుసలో చేరేది ఈ కావ్యమని వేన రెడ్డిగారి అభిప్రాయం. జయ దేవుడు, లీలాశుకుడూ భక్తి కవులు కారని, శృంగార కవులు మాత్రమేనని అంటాడు రారా. కానీ మధుర భక్తి అని మధ్యయుగంలో ఒక ధోరణి వుండేదని మనం మరువ కూడదు. శృంగారాన్ని ఆ యుగంలో భక్తిగా ఉదాత్తీకరించారు. కానీ ఆధునిక యుగంలో అది సాధ్యం కాదు. అసలు చలం 'యశోదా గీతాలు' రాయాలనుకోవడమే ఒక విడ్డూరంగా భావిస్తాడు రారా. చలం లాంటి ఆధునిక సంకీర్ణ చైతన్యం గలవాడు మాతృప్రేమ మీద కవితలు రాయాలనుకోవడమే ఒక విడ్డూరం. చలం లాగా కేవలం మనస్సుద్వారా దాన్ని అనుభూతం చేసుకోవడం సులభసాధ్యం కాదు. అందుకే భక్తి గర్భితంగా మాతృ ప్రేమను చిత్రించబోయిన మాతృ గేయాలు కృతకంగా తయారయినాయని అభిప్రాయ పడతాడు రారా. చలం 'పురూరవ' మీద సంపత్కుమార గారి ప్రత్యేక వ్యాసం జయంతి నుంచి తీసి సృజనలో పున: ప్రచురించారు. దాన్ని గురించి రాస్తూ రారా 'పురూరవ'కు చలం రచనల్లో ప్రత్యేకత వుందనీ, చలం సిద్ధాంత ప్రతి పాదక రచన ఇది అనీ అంటాడు. ఇది పాఠకుల మేధస్సుకు మాత్రమే ఆహ్లాదం కలిగిస్తుంది కానీ హృదయాన్ని తాకదు అని నిక్కచ్చిగా చెబుతూ రారా, ఇందులోని ఊర్వశి పాత్రను హృదయం లేని చతుర మేధోజీవి అనీ, ముష్కరతర్కయంత్రం అనీ వర్ణిస్తాడు. ఈ సందర్భంగా రారా సిద్ధాంతీకరిస్తూ 'పురూరవ'లోని లోపం అందులో సిద్ధాంత ప్రతిపాదన ఉండటం కాదనీ, ఆ సిద్ధాంతానికి సాహిత్య రూపం ఇవ్వలేక పోవడంలో వుందని విశదీకరిస్తాడు. ఈ సందర్భంగా రారా ఆలూరి బైరాగి రాసిన 'నూతిలో గొంతుకలు' అనే తాత్విక కావ్యాన్ని గురించి చర్చిస్తాడు. 'నూతిలో గొంతుకలు, లోని సిద్ధాంతాలు తాత్వికత 'మానవ హృదంతరాళంలోని గాఢమైన ఆరాటం నుండి తీవ్రమైన ఆవేదన నుండి ఉద్భవిస్తాయి. జిజ్ఞాసువు హృదయంలోని తపన, అన్వేషకుని గుండెలోని ఆర్తి అవే తాత్విక చర్చల రూపం ధరిస్తాయి. అందుకే అది తెలుగు సాహిత్యంలో ఒక అపురూపమైన కావ్యమయింది. ఆ ఆర్తి, తపన 'పురూరవ'లో యెక్కడా లేవు గనుకనే అది అంత సిద్ధాంతకీకారణ్యంలా తయారయిందని స్పష్టం చేస్తాడు రారా.

సంవేదన ఈ సంచికలోనే (జులై 1968) వుంది మహీధర రామ మోహనరావు గారి స్వయంవరణం నవల మీద రారా చేసిన సమీక్ష. దానికి ఉపోద్ఘాతంగా రాస్తూ రారా, మన సాహిత్యంలో చాలా కాలంగా బూర్జువా భావాలు ఇతివృత్తంగా ఉన్నాయి. కానీ ఆ భావాలు అప్పుడు పాశ్చాత్య విద్యద్వారా, పాశ్చాత్య నాగరికతా సంపర్కం ద్వారా వచ్చినవి. మన సాహిత్యంలో కూడా మనం కొత్తగా నేర్చుకొన్న బూర్జువా భావాలకంటే మన రక్తంలోని ఫ్యూడల్‌వారసత్వం బలీయంగా వున్నట్లు కనపడుతుంది. మన భావకవులు రాసింది కాల్పనికతావాద కవిత్వం, కానీ తొడిగించుకొనేది గంగ పెండేరాలు, చేయించుకొనేది సన్మానాలు, అంటే మనలో సామంత (ఫ్యూడల్) సంస్కారం పోలేదన్న మాట. కానీ రారా ప్రకారం ఇప్పుడిప్పుడే (1968) బూర్జువా భావాలు బలం పుంజుకుంటున్నాయి. ఆ కాలం నాటికి రాష్ట్రంలో పరిశ్రమలు పెద్దగా రాకపోయినా, వర్తకం విస్తరించింది. వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ మనస్తత్వం ప్రబలింది. సాహిత్యంలోనూ ఇది ప్రతిబింబించింది. ప్రేమ ఒక ఆదర్శం కాదు. అది ఒక వాస్తవం. ఇప్పుడు 'మన సాహిత్యంలో రావలసింది ప్రేమను బోధించడం కాదు. ప్రేమను వివాహం ద్వారా సఫలం చేసుకోవడం ఎలా అనేది" - రారా అభిప్రాయం ప్రకారం, "భార్యభర్తల సంబంధమంటే భరించడమూ, భారం కావడమూ కాదనీ, స్వామి భృత్య సంబంధం కాదనీ, కేవలం పడక గదికి, ప్రసూతి ఆస్పత్రికి పరిమితం కాదనీ, అదోక మైత్రి అనీ హృదయ సంబంధమనీ, మధురమైన సాహచర్యమనీ, పూర్ణ మానవ జీవితమనే స్వర్గానికి నిచ్చెన అనీ యెంచే వాళ్లకు, యెంచగల వాళ్లకు, యెంచగల సంస్కారమున్న వాళ్లకు మాత్రమే ఈ తిరుగుబాటు ప్రబోధించబడింది."

'స్వయంవరణం' నవలలో తరాల అంతరాన్ని మరో దృక్పథం నుంచి చూడటం కన్పిస్తుంది. అందులో రెండు

తరాలు రెండు వ్యవస్థలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. రెండు తరాల మధ్య అంతరం రెండు వ్యవస్థల మధ్య అంతరమయింది. అవే సామంత (ఫ్యూడల్). ఆధునిక వ్యవస్థలు, సామంతవాద అవశేషాలున్న పెద్దలు, ప్రేమించి పెళ్లి చేసుకోవడాన్ని వ్యతిరేకిస్తారు. ఈనాటి యువతరం సాహసించి యేరికోరి పెళ్లి చేసుకుంటే అప్పుడు తెలుస్తుంది పుత్ర ప్రేమకంటే సామంతవాద ప్రభావం నూరు రెట్లు ఎక్కువ అని. ఆ నవలలో యువతీ యువకులు ఘర్షణకు దిగరు. వాళ్లు చేసిందల్లా యేమిటంటే పెద్దవాళ్ల అభీష్టాలను తృణీకరించి, వాళ్లకు చెప్పకుండా వివాహం చేసుకోవడం. అంతటితో నవల అంతమవుతుంది. మనం పెట్టుబడిదారీ ప్రజాస్వామిక వ్యవస్థలో ఉన్నాం కనుకనే ఇది సాధ్యమైందంటాడు రారా. బూర్జువా భావాలు ప్రబలంగా ఉన్నాయి గనుకనే యువతలో తిరుగుబాటు తత్వం అబ్బింది అని ఆయన అభిప్రాయం. కుల పిచ్చి మరలా రేకెత్తిందని, మత మారణ హోమాలు మరలా విజృంభించినాయని తెలిస్తే ఆయన ఎలా స్పందించేవాడో.

'సంవేదన' సంపాదకత్వంపై రెండే ఆక్షేపణలు వచ్చాయి. 'పత్రిక మరీ ఘాటుగా వుందనేది మొదటి ఆక్షేపణ. పత్రిక నిండా రారా వుంటున్నాడనీ, అంతా రారా ఒన్‌మాన్‌షో అనేది రెండవ ఆక్షేపణ," దీనికి రారా సమాధానమిస్తూ పరిస్థితిని స్పష్టం చేశాడు. దేశంలోని రచయితలెవ్వరూ తమ రచనలు పంపడం లేదు గనుకనే నేను రాయవలసి వస్తున్నది. ఇంకా కొన్నాళ్లు గడిస్తే నాకు శ్రమ తగ్గుతుందని ఆశిస్తున్నాను. కానీ నా కాంట్రిబ్యూషన్ తగ్గితే స్టాండర్డ్ తగ్గిపోతుందని మిత్రులు అంటూనే వున్నారు. మొత్తం మీద యిదొక విషమ పరిస్థితిగానే వుంది' అంటాడు రారా.

ప్రగతి ప్రచురణాలయం, మాస్కోలో రారా దాదాపు ఆరేళ్లు పనిచేశాడు. తెలుగు అనువాదకునిగా. ఈ ప్రవాసాన్ని గురించి రాస్తూ ఆయన 'ఇక్కడ నేను ద్వీపాంతర వాసంలో వుంటున్నాను' అన్నాడు. ఈ భావన రారాకు కలిగిన మాట వాస్తవం. దీనికనేక కారణాలున్నాయి. అనువాదాలు ఎక్కువ చేయాల్సి వచ్చేది. సరైన నిఘంటువులు కూడా లేవక్కడ. మొదట ఆయన కొంత కాలం డిక్షనరీ లేకుండానే అనువదించాల్సి వచ్చేది. తర్వాత తన సహచరుడైన లక్ష్మణరావుగారు తన మాతృదేశం తిరిగి వస్తూ, ఆయన దగ్గరున్న ఇంగ్లీషు-తెలుగు నిఘంటువు ఇచ్చారు రారాకు. రారాకు రష్యన్ రాక పోవడం ఒక పెద్ద ఇబ్బందిగా తయారయింది. అక్కడ ఈ దశలో రారాకు అందింది సాపేక్షంగా తక్కువే. సోవియట్ యూనియన్‌లో మేధావులు చేసే పనికీ, శారీరక శ్రమకూ చెల్లించే వేతనంలో ఎక్కువ తేడా వుండేది కాదు. అందువల్ల రారా తనకు ఇచ్చింది తక్కువే అని భావించేవాడు. విశ్వనాథ రెడ్డికి 17.03.70న రాసిన ఒక లేఖలో తనకు అనువాదం పనికి ముట్టే పైకం వివరాలు రాశాడు. ఆయన మాటల్లోనే 'మొదటి నెల నవంబరులో ఫిక్స్‌డ్ శాలరి 250 రూబుళ్లు యిచ్చినారు. తరువాత పీస్ వర్క్ బేసిస్ మీద పని చేస్తున్నాను. నెలకు 400 రూబుళ్లు పని చేసుకోవడం కష్టం కాదు. కానీ ఇప్పుడు ఇచ్చేది 60శాతం మాత్రమే. తక్కిన 40శాతం యెప్పుడో నా అనువాదమంతా తనిఖీ చేసి, సవరణలుంటే చేసి అప్రూవ్ చేసిన తరువాత, కొన్ని నెలల తరువాత ఇస్తారు. 400 రూబుల్స్ పని చేసినా 240 రూబుల్స్ మాత్రమే నెలఖరులో వస్తుందన్న మాట. అందులో సుమారు 30 రూబుల్స్ ఇన్‌కం టాక్స్ పోతుంది. 80 రూబుల్స్ నెలనెలా ఇండియాకు పంపుతున్నాను. ఇక నాకు మిగిలేది 130లో సంసారం జరగడం కష్టం. నెలకు 500 రూబుళ్లపైన పని చేసుకుంటే గాని సంసారం జరగదు. అందుకని రేయింబగళ్లు ఒక్క క్షణం వృథా కాకుండా పని చేసుకోక తప్పలేదు. (రారా లేఖలు, పుట 165) చేసిన అనువాదాన్ని పున: పరిశీలించుకునేందుకు సమయం దొరికేది కాదు' అంటాడు రారా.

రష్యను భాష రానందువల్ల రష్యా మేధో జీవితాన్ని సరిగా అంచనా కట్టడానికి రారాకు వీలు పడలేదు. ఇది స్పష్టం. ఇంగ్లీషు నుంచే కాదు. ఫ్రెంచి, జర్మన్, స్పానిష్, ఇటాలియన్ పోలిష్, హిందీ, జపనీస్, కొరియన్ లాంటి ఎన్నో భాషల సాహిత్యం రష్యనులకు ప్రపంచ సాహిత్యం - శాస్త్ర విజ్ఞానం, సామాజిక శాస్త్రాల ఆధునాతన సాహిత్యం అందుబాటులో వుంది వాళ్ల భాషలోనే. కాబట్టి వాళ్ళు తమకు ఇంగ్లీషు తెలియనందుకు విచారించరు. మరి రారాకు ఇంగ్లీషు పట్ల ఎక్కువగానే అభిమానం వుంది అనేది తెలిసిందే. మాస్కోలో వున్నప్పుడు రష్యను భాషను నేర్చుకోవాలని ప్రయత్నించినా అది ఆయనకు వంట బట్టలేదట. ఆ భాషను అధ్యయనం చేసే తీరిక కూడా ఆయనకు దొరకలేదు.

**(సాహిత్య అకాడమీ ప్రచురణ 'రారా' నుండి)**

◆

# శ్వాస

బి. వేణుగోపాల్ రెడ్డి
9908171441



"సిస్టర్ పిల్లవాడు ఏడుపు బంజేసిండు. ఏమి సప్పుడు లేదు" అంటూ జహీర తమకు ఎదురుగానున్న బెడ్‌లో పండబెట్టిన మొగబిడ్డని చూసి భయంతో పరదా తెరిచి గట్టిగా లేబర్ రూంలో ఉన్న సిస్టర్, డాక్టర్‌కు తెలియజేసింది. అపుడే పుట్టిన తన మనుమరాలిని అపురూపంగా చూస్తూ, క్లీన్ చేస్తూ "యా అల్లా బిడ్డకు ఏమి కావద్దు" మనసులో ప్రార్థించుకుంది జహీరా.

పుట్టినవాళ్లను పుట్టినట్లు లేబర్ రూంకు అటాచ్డ్‌గా పరదాతో ఉన్న గదిలో పండబెడుతున్నారు హాస్పిటల్ సిబ్బంది. బిడ్డ ఏడుస్తున్నడా లేదా అనేది ఏమి పట్టించుకోకుండా యాంత్రికంగా పనిచేస్తున్నారు. కనీసం పుట్టిన బిడ్డను గుడ్డతో క్లీన్ కూడా చేయడం లేదు. ఇంత నిర్లక్ష్యమా!

ఆ బిడ్డ తల్లికి స్టిచెస్ వేయడం మధ్యలోనే ఆపిన డాక్టర్ బిడ్డను తలకిందులుగా వేలాడదీసి వీపు మీద టప టప కొట్టింది. నోట్లో పైపు పెట్టి నీళ్లను తీసే ప్రయత్నం చేసింది. లాభం లేదు. పుట్టిన వెంటనే నోటిని క్లీన్ చేసేది ఉండె. కాని పట్టించుకునే తీరిక ఎక్కడ వారికి. వరసగా పది డెలివరీలను ఏకధాటిగా చేయాలి. దాదాపు అన్నీ సిజేరియన్‌లే. ఒకటి అర నార్మల్ డెలివరీలు. ముఖ్యంగా నార్మల్ డెలివరీలకు సమయం అలవాటైపోయింది. సిజేరియన్ వల్ల స్త్రీలకు లైఫ్‌లాంగ్ చాలా సమస్యలొస్తున్నాయి. విపరీతమైన అనారోగ్య సమస్యలతో బాధపడుతున్నారు.

ఒకవైపు తన బిడ్డకు ఏమైందో ఏమో అని ఆ తల్లి తల్లడిల్లుతున్నది. తీవ్ర రక్తస్రావం, భరించలేని నొప్పిని పంటి బిగువున భరించి బిడ్డ కోసం పరితపిస్తున్నది. పండంటి బిడ్డకు ఏమైందోనని ఆమె మనసు తల్లడిల్లుతున్నది. తొమ్మిది నెల్లు ఎంతో ఓపికగా కేరింగ్ తీసుకుంటే ఫలితం ఇదా! పిండం పడినకాడి నుంచి డాక్టర్లు ఇచ్చే మందులు లెక్కేలేదు. పిండం మందులతోనే పెర్గుతున్నది. ముందటి కాలంల ఏ మందులు తిని పిల్లల్ని కన్నరు. విషతుల్యమైన శరీరాలకు మందుల కూడే గతైనపుడు ఈ మందులు ఒక లెక్కా! ఇంతకు ముందే ఒకసారి మిస్‌కారేజ్ కావడం వల్ల డాక్టర్‌ను చేంజ్ చేసినం. మంచిగా పుట్టాలని ఆమె కనపడిన ప్రతి దైవానికైతే మొక్కుకున్నది. ఫలితం గిట్లా ఉంటదనుకోలేదు. వాస్తవానికి ఈ ఊళ్లో ట్రీట్‌మెంట్ సరిగా దొరకదని ప్రతీతి. కాని చక్కగా తిని, యాల్లకు మందులు వేసుకుంటే ఎందుకు మంచిగ పుట్టరనుకున్నం. గింతల్నే గిట్లయిపాయే! బయట ఉన్న మేము గాబరాపడుతున్నాము. "ఏమి కాదు" అని మాకు మేము సర్దిచెప్పుకుంటున్నాం.

డాక్టర్‌గారి భర్త కూడా పిల్లల డాక్టరే. వేడి నీళ్లకు చన్నీళ్లన్నమాట. ప్రపంచంలో ఏ ప్రొఫెషనల్స్‌కు ఈ థియరి తెలవదు ఒక డాక్టర్లకు తప్ప. మళ్లీ ఐఎఎస్‌లకు, ట్రెయినింగ్‌కు ముందు పెళ్లయిన అవి పెటాకులు అవ్వాల్సిందే. అఫ్‌కోర్స్ కొన్ని మాత్రమే. సిస్టర్ పిలిస్తే వచ్చాడు చిల్డ్రన్స్ డాక్టర్. అపుడే పుట్టిన బిడ్డను ఉల్టా పల్టా చేశాడు. వీపుపైన చరిచాడు. ఇక్కడ లాభం లేదనుకున్నడు. తెల్లటి గుడ్డలో చుట్టి నా చేతిలో పెట్టాడు. బద్మాష్.

"నేను లెటర్ రాసిస్తాను. బేబి ఉమ్మ నీరు మింగింది. ఊపిరి తిత్తులలోకి వెల్లింది. ఇక్కడ ఆక్సిజన్ లేదు, వెంటిలేటర్లు లేవు. గవర్నమెంటు దవాఖానాకే పోండ్లి" అని బిడ్డను చేతిలో పెట్టేసిండు. "ఆగకండి. తొందరగా వెళ్లండి" అంటూ ఆ డాక్టర్ తొందరపెట్టాడు. ఏమి మాట్లాడలేని స్థితిలో సర్కారి దవాఖానకు బయలుదేరాము. సీరియస్ కేసులైనపుడు డాక్టర్లు చేతులేత్తేయడం పరిపాటి.

అప్పటి వరకు "మొగబిడ్డ పుట్టిందని" సిస్టర్ ఒక తలుపు రెక్క తెరిచి చెపితే, ఎంత సంతోషించినం. టైము చూసుకున్నం. మొదటగా చెల్లెకి ఫోన్ చేసి గుడ్ న్యూస్ చెప్పినం. మా తాతనే పుట్టిండని వాని తాత సంబరపడ్డడు. ఇంతల్నే మా గుండెలపైన పిడుగుపడ్డట్లయింది. సంతోషమంతా ఆవిరైపోయింది. ప్రొద్దున ఐదున్నరకు వస్తే తొమ్మిది గంటల వరకు డెలివరీ ఎందుకు ఆలస్యం చేసిందో... మా గాచారమే.

ఎందుకు ఇంత పెద్ద నర్సింగ్‌హోమ్‌లు? నాలుగైదు అంతస్థుల భవనాలు కట్టుకొని ఆక్సిజన్ కూడా ఉండకుండా ఎందుకు హాస్పిటల్స్ నడుపుతున్నారు? పుట్టిన పిల్లలను చంపడానికా! ఒకవేళ డెలివరీ సమయంలో తల్లికే ఆక్సిజన్ అవసరం పడితే.. ఆమె సంగతి? అందరిని గాలిల కలపడమా? కనీస వసతులు కూడా లేని హాస్పిటల్స్‌కు ఏమి తెలుసుకోకుండా వెళుతున్న మనంత అజ్ఞానులు ఉండరేమో! మనవారి ప్రాణాలకు విలువ లేదా? సర్కారు వీరికి ఎందుకు అనుమతులు ఇస్తున్నదో? మా ఊళ్లో చాలా మంది మహారాష్ట్రకు పొరుగు పట్టణాలకు వెళ్లి వైద్యం చేయించుకుంటారు. యావత్మాల్, నాఖ్‌పూర్, వార్ధాకు వెళుతారు. పాలకుల నిర్లక్ష్యం వల్ల రోడ్లు సరిగా లేకున్న, పేషెంట్ బాగు కోసం అటువైపే వెళుతున్నారు. మన దగ్గర లక్షలు ఖర్చు అయ్యే వైద్యానికి వందల్లో వేలల్లో మంచి వైద్యాన్ని అందిస్తారు. డాక్టర్లు కూడా అద్భుతంగా రిసీవ్ చేసుకుంటారు. చాలా మంది అంటుంటారు అక్కడి డాక్టర్లకు ధాతృత్వము ఎక్కువేనట. మన డాక్టర్లు అయితే మాట కూడా సరిగా మాట్లాడరు. పేషెంట్ కండీషన్ కూడా సరిగా చెప్పరు. సీరియస్ అయే సమయానికి వాళ్లే యావత్మల్ తీసుకు వెళ్ళండి, వార్ధా తీసుకువెళ్ళండి అంటుంటారు. సీరియస్ అయే సమయానికి కాళ్లు చేతులు ఆడని స్థితిలో మనముంటాము. ఆ స్థితి దాటి పేషెంట్ ఉంటాడు. ఈ స్థితి పగవానికి కూడా రావద్దు. ఇంత బాధలో మనను ఇన్ని ఆలోచినస్తూ కలవరపడుతున్నది. పాపం పెద్దమ్మ నడవడం కష్టమవుతున్నా పిల్లవాన్ని ఓపికగా ఎత్తుకొని నడుస్తున్నది. "పిల్లవానికి ఏమైందోనని" వాని తాత ఒకటే ఏడుపు.

ఒకప్పటి జనరల్ హాస్పిటల్ రిమ్స్‌గా మారింది. చాలా పెద్ద హాస్పిటల్, మల్టీ స్పెషాలిటి హాస్పిటల్స్‌ను తలదన్నే విధంగా అద్భుతంగా కట్టారు. పరిశుభ్రత ఏమాత్రం లేదు. దుర్గంధం వెదజల్లే పరిసరాల్ని దాటుకుంటూ, పిల్లల వార్డులో అడుగుపెట్టాం.

రెండు వార్డుల్లోను అటు ముప్పయి ఇటు ముప్పయి శిశువులకు చికిత్స చేస్తున్నారు. కొందరికి కృత్రిమ శ్వాస అందిస్తున్నారు. కొందరిని ఇంక్యుబేటర్‌లో ఉంచారు. అపుడే పుట్టిన శిశువులు కావున చాలా సున్నితంగా చికిత్స చేస్తున్నారు. డాక్టర్ కంటే కూడా ఎక్కువ ఓపిక అక్కడున్న సిస్టర్స్‌కు ఉండాలి. ఓపికగా ప్యాడ్స్ మారుస్తున్నారు.

"రెండు రోజులు గడిస్తేనే కాని ఏమి చెప్పలేము. ఉమ్మనీరు ఊపిరితిత్తులలోకి పోయింది. కడుపులోకి పోతే తీసేయవచ్చు. కాని ఊపిరితిత్తులలోకి పోయింది. కృత్రిమ శ్వాస పెట్టినా... కోలుకోవడం కష్టమే. మేమేమి చేయలేని పరిస్థితి" భరోసా ఇవ్వని డాక్టర్ అలా అంటుంటే పిల్లవానికి ఏమవుతుందోనన్న టెన్షన్‌లో మా కాళ్ళు చేతులు ఆడడం లేదు. ఒక నిర్లక్ష్యం ఖరీదు ఇది. ఆక్సిజన్ ఉందనుకుంటే డాక్టర్లు ఇలా అంటున్నారు. తాము చేసే వైద్యానికి వారికే నమ్మకం లేదు. వీళ్లా డాక్టర్స్ అన్న అనుమానం కలుగుతుంది.

బ్రహ్మాండమైన భవనం ఉన్నా ఇక్కడ కూడా పరికరాల కొరతతో సర్కారు వైద్యం మొండికేస్తున్నది. "మీకు వీలైతే వేరే హాస్పిటల్‌కు తీసుకవెళ్ళండి. ఇక్కడ ఆక్సిజన్ ఎప్పుడయిపోతుందో చెప్పలేము". మళ్లీ ఆ డాక్టరన్నాడు ఇంత పెద్ద టౌన్‌లో అది జిల్లా కేంద్ర హాస్పిటల్‌లోనే ఇట్లా ఉంటే మండల కేంద్రాలలో పరిస్థితి ఊహించుకోవచ్చు. ప్రైవేటు

హాస్పిటల్ సంగతి వేరే చెప్పనక్కరలేదు. ఏవో కొన్ని పరికరాలతో మెరుగైన వైద్యం చేస్తున్నామని భ్రమింపచేస్తారు. వేలకు వేలు ఫీజుల వసూలు చేస్తారు. ఏ వైద్య సౌకర్యాలు లేని రోజుల్లో మంత్రసానులు ఏవిధంగా కాన్పు చేస్తారో! కనీసం వారికున్న ఓపిక వీరికి లేకపోవడం విచిత్రం.

చిన్న పిల్ల వైద్యానికి కూడా నిర్లక్ష్య ధోరణిలో వ్యవహరిస్తున్నారు ఆస్పిటల్ సిబ్బంది, "ఎప్పుడు ఆక్సిజన్ అయిపోతుందో తెలువదు" అంటున్నారు. కార్పోరేట్ స్థాయికి దీటున్న ఆస్పిటల్‌లో సౌకర్యాల కొరత! ఇది కుట్రపూరిత ధోరిణా? లేకుంటే నిధుల కొరతనా? లేకుంటే విధుల దుర్వినియోగమా? ఏమిటి వైపరీత్యం. మెరుగైన వైద్యం అందిస్తామంటున్న పాలకుల నిర్లక్ష్యమా? అంతుపట్టదు.

శిశువును వారికి అప్పజెప్పి భారంగా కదిలాము. వాని తల్లి పిల్లవానికి ఏమయిందోనని ఫోన్ చేస్తూనే ఉంది. "ఏమి కాలేదు. ఒక్కరోజు ఆక్సీజన్ పెడితే సరిపోతుంది" అని చెప్పాము. పచ్చి బాలింత. లేకుంటే తన పిల్లవానిని ఆ విధంగా వదిలేదేనా! మాతృత్వం మధురిమ అందినట్టే అంది దూరమైంది. బిడ్డను చూస్తూ తను పడిన కష్టం దూది పింజలా ఎగిరిపోతుండె. ఇపుడు బాధతో పాటు కన్నీటిని దిగమింగడం చాలా కష్టమేమో. ఇపుడు తనకు నిజమైన పరీక్షకాలం. నిరీక్షించి... నిరీక్షించి.. నీరసించి పోతుంది తల్లి మనసు.

వాని తాత ఏడ్చి ఏడ్చి వచ్చిన డాక్టరుకు మొక్కుతున్నాడు. నిమిష నిమిషానికి ఏమైందోనని చూస్తూ వస్తున్నాడు. మనసు మనసులో లేదు. కాళ్లు కదులుతూనే ఉన్నాయి. మరో నలభై ఎనిమిది గంటలు గడిస్తేగాని ఏమి చెప్పలేమంటున్నారు డాక్టర్లు.

కొత్తగా ఏర్పడిన పిల్లల వార్డుకి ఇరువైపుల ఆ పిల్లల బంధువులు, తల్లిదండ్రులున్నారు. ఆ కారిడార్‌లోనే వారి నివాసం. బయట మూసిని తలపించే భరించలేని వాసన. పండుకుందామన్నా నిద్రరాదు. కనీసం కూర్చుందామన్నా కూచోలేము. దుర్గంధం, దోమల బెడద. రోగి పునర్జీవనం పొందే దవాఖానలల్లో తీవ్ర నిర్లక్ష్యం, మొద్దు నిద్ర, సుశిక్షుతులైన డాక్టర్లుంటే సౌకర్యాల లేమి. సౌకర్యాలుంటే డాక్టర్‌ల కొరత వెరసి సర్కార్ వైద్యానికి భయపడవలసిన పరిస్థితి. నిస్సహాయ స్థితిలో పేషెంట్ ప్రాణాలు గాలిలో కలవాల్సిందేనా?

పేషెంట్ తాలుకూ బంధువులే ముందు జాగ్రత్త చర్యగా ఆక్సిజన్ సిలెండర్‌లు మోసుకవస్తున్నారు. వారి పిల్లలను బతికించుకోవాలన్న తపన వారిలో కనపడుతున్నది. పేషెంటు తాలూకు బంధువుల మానసిక పరిస్థితి చెప్పతరం కాదు. మనిషిని అమాంతంగా వేరే ప్రపంచంలోకి విసిరేస్తే ఎట్లా ఉంటుందో అట్లా ఉంటుంది. ఏమి తెలియని సంధిగ్ద స్థితి. క్షణ క్షణం ఒక వ్యథ. ఎపుడు ఏమి వార్త వినాల్సి వస్తుందోనని బయట పేషెంటు బంధువులు తీవ్ర మానసిక వ్యథతో ఉంటారు. నిమిషాలు, గంటలు మనసును మెలిపెట్టి పడేస్తయి. రోజులు లెక్కపెట్టడం అలవాటైపోతుంది. అంపశయ్య పైన పేషెంటు, మండుతున్న కుంపటిపై వారి బంధువులు. ఆ స్థితి నుండి బయటపడితే "తామంతా సంతోషంగా ఈ భూ ప్రపంచంలో ఎవరుండరు" అని అనుకుంటారు. బయట కారిడార్‌లో జీవం లేని మనుషులు. ఒక్కొక్కరిని కదిలిస్తే ఒక భారతం. వారు అనుభవిస్తున్న కష్టాలు, వ్యధలు వింటే మన కష్టం ఒక లెక్కనా! అని అనిపిస్తుంది.

పాపం తులసీబాయి... తన మనుమరాలి కోసం పడరాని పాట్లుపడుతున్నది. తన కోడలు ఇద్దరు కవల పిల్లల్ని కని చనిపోయింది. ఇద్దరు పిల్లలు పోషక లేమితో కనీస బరువు లేకుండా పుట్టారు. ఇద్దర్ని ఈ చిన్న పిల్లల వార్డులో ఉంచారు. కనీస బరువు పెరగడానికి, వీళ్ళ గర్భంలో ఉండగానే అర్థంగాని రోగంతో వీళ్ల తండ్రి. అందరు ఎవరి దారి వాళ్లు చూసుకుంటే తను ఒక్కతి ఇలా... తులసీబాయి కండ్ల నీళ్ళు ఎపుడో ఇనికి పోయినయి. ఇద్దరు పిల్లల్లో ఒక పిల్ల చేతికి రాలేదు. ఈ పిల్లనైనా బతికియ్యమని ఆ కనిపించే దేవుళ్లయిన డాక్టర్లను వేడుకొంటున్నది. తన వారికి కనిపియ్యకుండా చేసిన విధి మరోసారి వెక్కిరిస్తే తాను ఏమవుతుందో... పిచ్చితల్లి. చూసేవాళ్లకు గుండె తరుక్కోక మానదు.

నెలలు నిండకుండా పుట్టిన శిశువుతో ఇక్కడ కిషన్. ప్రసవించిన భార్య తీవ్ర అనారోగ్యంతో గైనకాలజీ వార్డులో. ఎప్పుడు ఏమవుతుందోనని మానసిక వ్యథతో కుమిలిపోతున్నాడు కిషన్. నెలలు నిండకుండా ఉన్న శిశువులను ఇంక్యుబేటర్‌లో ఉంచుతారు. తల్లి గర్భంలో శిశువు ఎట్లా ఉంటుందో ఆ పరిస్థితులు కల్పిస్తారు. నెలా రెండు నెలలు కూడా పట్టవచ్చు. కొందరు కనీస బరువు లేకుండా పుడతారు. రెండు కిలోలు కూడా ఉండరు. సగం కిలో లేదా డెబ్బై ఐదు గ్రాములే ఉంటారు. వారిని కూడా కృత్రిమ పరిస్థితులు కల్పించి, నార్మల్ వెయిట్ అయ్యే వరకు

ఉంచుతారు. లక్ష్మణ్ తన బిడ్డ కోసం నాలుగు మాసాల నుంచి ఓపిక పడుతున్నాడు.

బాలింతయిన తన భార్యను రక్షించుకోలేక, తన బిడ్డ క్షేమం కోసం నాగోరావు ఇక్కడ. భార్యకు నొప్పులొస్తున్నయంటే మండలం కేంద్రంలోని దవాఖానకు తీసుకవస్తే, డ్యూటి డాక్టర్ లేడు. భయంకర నొప్పులతో ఆమె. దిక్కుతోచని స్థితిలో పాపం నాగోరావు. ఎక్కడికి వెళ్లలేని పరిస్థితి. డ్యూటి డాక్టర్ రావడానికి సమయం పట్టేట్లున్నదని స్టాఫ్ నర్సే డెలివరి చేసింది. ఆడబిడ్డ పుట్టింది. స్టాఫ్ నర్స్ డెలివరైతే చేసింది కాని, సరిగ్గా స్టిచెస్ వేయకపోవడమో ఏమో మరి తీవ్ర రక్త స్రావం కాసాగింది. గ్లూకోజ్‌లో ఏమి ఇంజక్ట్ చేసినా ఆగడం లేదు. "డ్యూటి డాక్టరైతే రాదు. ఉట్నూరు ఏరియా ఆస్పిటల్‌కు తీసుకవెళ్లండి" అని స్టాఫ్ నర్స్ తెలియజేసింది. అంబులెన్స్ డ్రైవర్‌కు ఫోన్ చేస్తే, లిఫ్ట్ చేయడంలేదు. నిమిషాలు గంటలవుతున్నాయి. ఏమి చేయాలి. దిక్కుతోచని స్థితిలో నాగోరావు కుటుంబం. బాలింతరాలి పరిస్థితి హృదయ విధారకంగా ఉంది. చివరికి డ్రైవర్ తన మొబైల్ లిఫ్ట్ చేశాడు. పేషెంట్‌ను ఎక్కించుకొని కొద్ది దూరం కదిలిన అంబులెన్స్ మళ్ళీ స్టార్ట్ అవడానికి మొరాయించింది. ప్రాణాలతో చెలగాటమంటే ఇదే. కనీసం డీజిల్ ఉందో లేదో చూసుకోని దవాఖాన యంత్రాంగంను ఏమనాలి. ఏ శిక్ష వేయాలి. ఆదివాసుల ప్రాణాలకు ఏ విలువ ఉందో ఈ సంఘటన చూస్తే అర్థమవుతుంది. ఎలాగో డీజిల్ పోసిన మార్గమధ్యంలోనే తనువు చాలించింది. వారిద్దరి కలల పంట ఇంక్యుబేటర్‌లో ఇక్కడ. నాగోరావు కదిలిస్తే ఒకటే ఏడుపు. మన కళ్ల నీళ్లను తుడుచుకుంటూ "ఉరుకో" అనడం ఎంత ఇబ్బందో! తను అనుకున్న మనిషి తనకు దూరమవడం ఎంత నరకమో! నాగోరావు ముడుచుకొని మూగగా రోదిస్తున్నడు.

వైద్యం అందివ్వడానికి ఇన్ని అవస్థలా? డ్యూటి డాక్టరు అందుబాటులో ఉండడు. సిబ్బంది కొరత. వారి నిర్లక్ష్యం, సౌకర్యాల లేమి. ఇది ఇండియా షైనింగ్. ఏమిటీ వ్యవస్థ మారేదెట్లా? మనుషుల ప్రాణాలకు ఈ దేశంలో విలువ లేదా? తీవ్ర పోషకాహార లోపంతో చనిపోతున్న గర్భవతులు, వారి పిల్లలు. నిత్యం ఆదివాసి ప్రాంతాలలో మనకు కనిపించే దృశ్యం. మలేరియా మరణాలకు లెక్కేలేదు. కనీస వైద్య సౌకర్యాలు లేని ఈ రాజ్య వ్యవస్థను శ్రేయో రాజ్యమందామా! లేక నరకానికి నకళ్లు అందామా! వ్యవస్థను తిట్టుకోవడం తప్పితే ఏమి చేయలేని సంఘజీవులం మనం. విధిని తిట్టుకోవటం తప్ప చేసేది ఏమి ఉండదు.

నా పరిస్థితిని చూసి ఒక పెద్ద మనిషి "బిడ్డ ఏమి కాదు. కాస్త ఓపిక పట్టాలి అంతే. కాలం గడిస్తే అన్ని చక్కబడతాయి. మేము వచ్చి వారం రోజులైతది. అపుడు బిడ్డ పరిస్థితి ఏమి చెప్పరాకుంట ఉండె. ఇపుడు కాస్త మెరుగైంది. ఏం కాదు బిడ్డ. ధైర్యంగా ఉండాలే" అంటూ ధైర్య వచనాలు పలికాడు ఆ పెద్ద మనిషి. ఎవరేమి చెప్పిన మన ఆతృత మనకుంటుంది. చాలా మంది తమ అదృష్టాన్ని నమ్ముకొని ఇక్కడ ఉంటున్నారు. వారిని కదిలిస్తే మనకు స్పష్టంగా తెలుస్తున్నది.

చాలామంది పేద మధ్య తరగతివారున్నారు "బతకడమే దిన దిన గండమైన నేటి కాలంలో మెరుగైన వైద్యం ఎక్కడ దొరుకుతుంది. కష్టమో నష్టమో ఇక్కడ్నే ఉండాలి. పరిస్థితులు చక్కబడితే మనంత అదృష్టవంతులు ఉండరు" లక్ష్మణ్ అంటుండు.

"అవును, అందరికి అందుబాటులోకి మెరుగైన వైద్యం అందించాలి. సర్కారు దవాఖానలకు మంచి వసతులు కల్పించాలె" అని నేనంటుంటే...

"ఏడ కల్పిస్తరు భాయ్... ఆరోగ్యశ్రీ అనుకుంట ప్రైవేటు ఆస్పిటల్‌కే దారిపడుతున్నరు. ఒక పద్ధతి ప్రకారం సర్కారు ఆస్పిటల్‌లను నిర్లక్ష్యం చేస్తున్నరు. ప్రైవేటు దవాఖానాలకు సర్కారోళ్లు పైకం చెల్లించడమేమిటి? అవే పైసలతో సర్కారు దవాఖానలను మల్టీ స్పెషాలిటీ ఆస్పిటల్‌గా మార్చవచ్చు కదా! అప్పుడు ఉన్నోడు లేనోడు అందరు ఒక్క జాగల్నే ట్రీట్‌మెంట్ తీసుకుంటరు. హెల్త్ కార్డులు, ఆరోగ్యశ్రీ కార్డులు ఎందుకు భయ్. హెల్త్ కార్డుల కుంభకోణం రోజూ పేపర్ల వస్తలేదా? ఏమంటరు" అని హైదర్ అంటున్నడు.

నిజమే... ప్రభుత్వాలు ప్రవేటు హాస్పిటల్స్‌ను మేపడం ఏమిటి? ఇది ఒక పద్ధతి ప్రకారం జరుగుతున్న కుట్రనే. చాలా మంది మంత్రులు, ఎమ్మెల్యేలకు సూపర్ స్పెషాల్టీ, మల్టీస్పెషాలిటీ హాస్పిటల్స్ ఉన్నాయి. హైదర్ మంచి అవగాహన ఉన్న వ్యక్తిలా ఉన్నాడు. ఇంక్యుబేటర్‌లో ఉన్న తన బిడ్డ కోసం ఇక్కడున్నాడు. హైదర్ చెప్పిన దానికి అందరు ఏకీభావంగా తల కదిలించారు.

ఆరోగ్యశ్రీలో వర్తించే జబ్బులకు చెందిన రోగులను ఒక పద్ధతి ప్రకారం ప్రైవేటు హాస్పిటల్స్‌కు తరలించే బ్రోకర్లు హాస్పిటల్ చుట్టూ కనిపిస్తున్నారు. ఒక కమీషన్ ఏజెంట్

# కవిని కాలేను.. కానీ..

- కర్లపాలెం హనుమంతరావు
8142283676



కవిత్వం ఓ తపస్సు అయితే
నేను
దీక్షకు దిగే తాపసిని
కాలేకపోవచ్చు కానీ..
మోక్షసిద్ధికి కాసిన్ని
పూలు పండ్లయినా
సమర్పించుకొనె
ఉపాసకుడిని కాగలను

కవిత్వం ఓ సంగీత సుధార్ణవమైతే
నేను
ఎగిసి పడే అలను కాలేనేమో కానీ..
పడి లేచే అలకు మాత్రం
నిర్భయంగా తోడు పోగలను

కవిత్వం ఓ యుద్ధమైతే
నేను
ఆయుధం పట్టి
యోధుడిగా పోరాడలేనేమో కానీ
దుష్టశక్తులని తునుమాడే
యోధ ముష్టిఘాతం
పట్టుగా మాత్రం
ఖచ్చితంగా మారిపోగలను

కానీ..
కవిత్వం ఓ మధ్యేదారి రాజీ
సూత్రమైతే మాత్రం
నేను
ఆ లాలూచీ వధ్యశిల పైన
తలవంచుకునే సంతకంలో
కనీసం
గీత కింది చుక్కగానైనా
మారలేను
వంచనా చిత్రం లిఖించే
కుంచెలో కుచ్చుగా
ఎన్నటికీ మారబోను ♦

---

"మిమ్మల్ని కావాలంటే పట్నంలో మంచి చిల్డ్రన్స్ హాస్పిటల్‌కు తీసుకువెళతా" అన్నాడు. పైసలుంటేనే ప్రైవేటు గురించి ఆలోచించాలి. లేకుంటే ఏ సంఘటన జరిగినా ఎదుర్కోవాలనుకుంట.

"అవసరమైతే చెపుతాను" అన్నాను. కాని మా అందరికి తీసుకువెళితే బాబును బతికించుకోవచ్చు అనే ఉంది. ఏ డాక్టర్ భరోసా ఇవ్వడం లేదు. ఒక డాక్టరు "పిల్లవాడి కండీషన్ బాగాలేదు. భరించే శక్తి ఉంటే హదరాబాద్ వెళ్లండి" అంటున్నాడు. ప్రైవేటు హాస్పిటల్‌లో వసతుల లేమితో సర్కారు దవాఖానకు వస్తే ఇక్కడ అదే పరిస్థితి. ఇక కార్పొరేటు ఆస్పత్రులే దిక్కా? ఆరోగ్యశ్రీ పథకం ద్వారా ప్రత్యక్షంగా, వసతుల కొరత, సిబ్బంది నిర్లక్ష్యం ద్వారా పరోక్షంగా కార్పోరేటు వైద్యాన్ని ప్రోత్సహిస్తున్న సర్కారుకు పేదల ఆరోగ్యంపైన శ్రద్ధ లేదనిపిస్తుంది. ఏ వైద్యం ఎవరిని కాపాడుతుందో అర్థం కాలేని స్థితిలో ఉన్నాము. విధిలేక, గత్యంతరం లేక కార్పోరేటు వైద్యమే మేలనే స్థితిలో మేమున్నాము.

నిమిష నిమిషానికి దిగజారుతున్న పిల్లవాడి కండీషన్ వాని తాత గుండె వేగాన్ని పెంచుతోంది. సెకన్లు, గంటలు ఇరవై నాలుగు గంటలు నిద్రలేదు. సరైన ఆహారం లేదు. పిల్లవాని కోసం పరితపిస్తున్నాడు. దుర్గంధంలో, దోమల్లో ఒక రాత్రి నిర్నిద్రగా...

ప్రొద్దున్న, అవసరానికి ఉంచుకున్న రెండు బాండ్లు విడిపించాడు వాడి తాత. "భరోసా దొరకని వైద్యాన్ని అదృష్టానికో దురదృష్టానికో వదిలేస్తే మూర్ఖత్వం అవుతుంది. ఏమైనా కాని మంచి వైద్యం అందివ్వాలి. చూస్తూ చూస్తూ పండంటి బిడ్డను పోగొట్టుకోలేము" అన్నాడు. మంచి వైద్యం కోసం పట్నం నుండి వచ్చిన పేరున్న చిల్డ్రన్ హాస్పిటల్ అంబులెన్స్‌లో పయనమయ్యాం. కాలాన్ని నమ్ముకున్న మనుషుల ఓదార్పుల మధ్య ఒక దీర్ఘ శ్వాస. పరుగెత్తే కాలమే పేదవారికి ఊపిరిగా మారుతున్నది. ఒక తపనతో అక్కడి నుండి కదిలాము. తాత చేతిలో భవిష్యత్తు రూపుదిద్దుకుంటోంది. ఒక శ్వాసగా... ఒక ఆశగా.... ♦

# చేనుగట్టు పియానో - సరికొత్త కవిత్వ సస్యరాగం




- మల్లెల నరసింహమూర్తి,
9848155716

"నా రక్తంలో కదలాడే నీడలు మనుషులే. వాటి పరిమళాలే... పలకరింపులే... పలవరింతలే... నా కవితలు." అని అంటున్న కవి ప్రసాదమూర్తి. నేటి ఆధునిక తెలుగు కవిత్వంలో నిరంతర కవితా తపస్వి. అరుదైన కళాత్మక అభివ్యక్తితో, వర్తమాన కాలీన ధాతువులు కవితా వస్తువులుగా కవిత్వ రచన చేస్తున్న కవి శిల్పి.

సమాజాన్ని పీడనకు గురి చేస్తున్న విధ్వంసక శక్తుల్ని ఆధిక్షేపిస్తూ, నిలదీస్తూ ఒక గొప్ప మానవీయ ప్రగతిశీల, ప్రేమాన్విత సమాజాన్ని, దేశాన్ని, ప్రపంచాన్ని కలగంటూ, ఆ దిశలో తన్ను తాను నిర్మలంగా, నిర్ద్వంద్వంగా సమర్పించుకుంటూ, సకలశక్తుల్ని ధారపోస్తూ, గుండెనిండుగా భరోసానిస్తూ, పురోగమిస్తున్న ప్రసాదమూర్తి ఒక 'ప్రామిసింగ్ పొయెట్'. కళ సామాజిక ప్రయోజనం కోసమేనన్న అభ్యుదయ కళా సూత్రాన్ని విశ్వసించి, ఆ మార్గంలో తన కావ్య సృష్టిని చేస్తూ ముందుకు సాగుతున్న బాధ్యతాయుతమైన కళాకారుడు. "కవిత సామాజిక బాధ్యతను కలలో కూడా విస్మరించరాదనే నా వాదన.. నా నివేదన అని తన సామాజిక నిబద్ధతను చెదరని గుండె దిటవుతో ప్రకటించుకున్న కవి ప్రసాదమూర్తి. ఈ తాత్విక నిబద్ధతనే ప్రస్తుత తన 'చేనుగట్టు పియానో' కవితా సంకలనంలో మరింత స్పష్టపరుస్తున్నాడు. 'ఎవరున్నారు వాళ్ళకి' అనే మొట్టమొదటి కవితలో ఇలా.

"ఆకుపచ్చ రాత్రులై భూగోళమంతా అల్లుకున్నా / పేగుల్లో ఆకలి మిన్నాగులు కదులుతున్న అనహాయులకు ఎవరున్నారు?....

మట్టికింద తమను పాతుకుని/నాగలికర్రుకు నెత్తుటి సంతకమై వేలాడే మట్టి మనుషులకు ఎవరున్నారు ఇంకెవరున్నారు...కవులు తప్ప?..

ఇదే సంపుటిలోనే చివరి కవితలో కూడా నిబద్ధత కలిగిన కవులు, రచయితలు, కళాకారులు, ప్రజాపోరాటాల యోధులు నిలబడేది, నిలిచి సర్వశక్తుల్ని ధారపోసేది ప్రజల పక్షాన వుంటూనే అన్న సత్యాన్ని ఇలా అక్షరీకరించాడు. "స్టేట్‌తో మనకు పనేంటి?/ స్టేట్ ధిక్కారమే మన పని కదా/పాలకులు మారితే మనకేంటి/మనం పాలితుల పక్షం కదా.

కులాలు... మతాలు... ప్రాంతాలు/ఎవరి అస్త్రాలైతే మనకెందుకు/మన విల్లంబులు జనం కదా. మానవ సమాజం కేంద్రంగా, బహుముఖీనమైన మానవ జీవనం తన కవిత్వ రచనకు కేంద్ర బిందువుగా ప్రసాదమూర్తి తన తాత్విక నేపథ్యాన్ని ప్రకటించుకున్నాడు. ఈ ఇరుగట్ల మధ్య తన కవిత్వపు సృజన ఝరి, నదీ ప్రవాహం వైవిధ్యభరితంగా, అనేక మలుపులతో మజిలీలతో కొనసాగుతుంది. ఈ ప్రవాహ ధృతిలో, శృతిలో, గతిలో విస్తృత, భౌతిక జీవితం, దాని తాలూకు భౌతిక, వాస్తవికత, సామాజిక సంక్షోభాలు, అలజడులు, ఆందోళనలు, మానవక్రందనలే, మృగ్యమైపోతున్న మానవతా విలువలు సహజమైన మానవ సంబంధాల మధ్య ఏర్పడుతున్న అగాధాలు, రాజకీయ వంచనలు, కుట్రలు, కుతంత్రాలు మూసిపోతున్న నీతి, ధర్మ మార్గాలు.. ఇలాంటి అనేకానేక కల్లోలాల్పించి ఈ కవి గుండె గొంతుకతో అనుభవసారాన్ని పలికిస్తాడు. సంవేదనల్ని అక్షరీకరిస్తాడు. చలనశీలియైన సమాజం పట్ల,

జాగరూకత, మమేక వ్యగ్రత కలిగిన ప్రసాదమూర్తి నిరంతర సంవేదనాశీలాన్ని, సామాజిక కళాభివ్యక్తిని తన కవితా సంపుటాలు కలనేత (1999), మాట్లాడుకోవాలి (2007) నాన్న చెట్టు (2010), పూలండోయ్‌పూలు (2014) అన్నింటిలోనూ స్పష్టంగా అవగతమౌతోంది.

ప్రస్తుత కవితా సంపుటి 'చేనుగట్టు పియానో' కూడా కాంతివంతంగా, శక్తివంతంగా, పదునుదేరిన కళాత్మక సంవిధానంలో, వస్తు రూప సమ్యక్ సమ్మేళనంతో, సమన్వయంతో సాగింది.

పైన ప్రస్తావించబడిన మూలాంశాలు ప్రసాదమూర్తి కవిత్వం నిండా పరచుకొని వుండే విలక్షణ గుణాల కారణంగానే, "ప్రసాదమూర్తి కవిత్వం నిండా వర్తమాన కాలీన ధాతువులు పూర్తిగా మెరుస్తున్నాయి. ఆర్ద్రమైన అభివ్యక్తి ఒక వైపు, అధిక్షేప తీవ్రోక్తి మరొకవైపు గాఢంగా కనిపిస్తున్నాయి." అని డా॥ సి. నారాయణ రెడ్డి ప్రశంసించటం.

"పోర్చుగీసు కవి అడ్రాదే అన్నట్లు ప్రసాదమూర్తి కవితలన్నీ కాంతితో కొట్టుకుంటూ, భూమి మొరటుతనంతో తొలకరి వచ్చాక, కాలువ వదిలాక, ఎండాకాలం అంతా ఎండిన నెర్రెలు పడ్డ చేలల్లోకి తొలిసారి నీళ్లు పారేటప్పుడు వచ్చే వాసనతోనూ, సంగీతంతోనూ, గాలి ఈలల్లోనూ కదులుతూ వుంటాయి." అని కె. శివారెడ్డి మెచ్చుకోవటం.

ఈ కవితా సంపుటి చేనుగట్టు పియానోలో కవి ప్రసాదమూర్తి ఆర్తి కలిగిన మనిషిగా, జీవన సంస్కారం తెలిసినా సామాజికునిగా, కళాత్మకత, భావుకత పండిన కవిగా దర్శనిమిస్తాడు. తన చుట్టూ చలన శీలియైన సమాజంలోని ప్రతి వస్తువులోని అంతర్వస్తువు"ని దర్శించగలిగిన కవి తన అంతర్నేత్రాలతో లోకాన్ని వీక్షించే సాధన దృగ్గోచరమౌతుంది ప్రతి కవితలోను. హడ్సన్ ప్రవచించినట్లు ప్రతి సహృదయుడూ, రసహృదయుడూ, మన లోపలి ప్రపంచం పట్ల బయటి ప్రపంచం పట్ల, సావధానులమౌతాం. అటువంటి చేతనకు, ఎరుకకు ప్రసాదమూర్తి ప్రతి కవితా ఉదాహరణంగా నిలుస్తాయి. వస్తుతత్వాన్ని, అంతస్తత్వాన్ని రేకు రేకూ విడమరచి విప్పి చెబుతాడు ఈ కవి. అలా చెప్పటం ఈ కవికి మహా ఇష్టం.

'చేనుగట్టు పియానో' కవితలో కవి రైతు తన వ్యవసాయాన్ని ఎంత సుందరంగా నిర్వహించాడో చిత్రించబడింది. "రోజూ పొద్దున్నే మేఘం భుజాన వేసుకొని/వ్యవసాయానికి పోతాను./ రాత్రి ఏరుకున్న చుక్కల్ని కొప్పునిండా తురుముకొని/ ఇంద్రధనుస్సుల కొంగుల్ని బొడ్లో దోపుకొని/చెట్లు నా పొలంలో అక్షరాల నాట్లు వేస్తాయి./ఆకాశమూ నెమలీ ఏరువాక పాట నందుకుంటాయి./చేనుగట్టు పియానో మీద ఎలాగూ పిట్టలు నాట్యమే చేస్తాయి."

అలా కవిరైతు సాగించిన జీవన సంగీతం సాగు సాలంతా సాగి కాలం పొడవునా పరిమళించిన మానవ స్వప్నం పంటగా అందితే దాన్ని ప్రపంచ మార్కెట్లో అమ్మకానికి పెట్టి శాంతిని రేటుగా ప్రకటిస్తాడు. ప్రకృతి రుణమాఫీ పత్రాన్ని కవిరైతు చేతుల్లో పెట్టి వెన్నుతడుతుంది. అప్పుడు అర్థాంతరంగా అప్పుల భాధలతో మరణించిన రైతుల ఆత్మలన్నీ చల్లని జల్లులై కురుస్తాయి. ఇదంతా ఒక ఎత్తైతే ముగింపులో "రైతుని బాబయ్యా, పచ్చి పలవరింతల బైతుని" అని చెప్పటంలో కవి విలక్షణ వ్యక్తీకరణ శక్తి మెరుపులా మెరుస్తుంది. ఈ ముగింపులోని వాక్యానికీ, 'ఎవరున్నారు వాళ్ళకి అనే కవితలో కవి ఆర్తితో చెప్పిన వాక్యాలకూ అంతస్సూత్రం, అనుసంధానం వుంది చూడండి. "మట్టికింద తమను పాతుకొని/నాగలి కర్రుకు నెత్తుటి సంతకమై వేలాడే మనుషులకు/ఎవరున్నారు? ఇంకెవరున్నారు కవులు తప్ప."

ఈ విధంగా ప్రసాదమూర్తి కవిత్వ సృజనలో వివిధ కవితల్లో వ్యక్తీకరణల భిన్నత్వంలో, తన మౌలిక భావనల, ఆలోచనల నిబద్ధతల ఏక సూత్రత కనిపించడం మరొక విలక్షణతగా గుర్తించగలం.

ఈ కవితా సంపుటిలో విశేషం వస్తువిస్తృతి. అనేక సామాజికాంశాలు కవితా వస్తువులుగా రూపొందాయి. విలక్షణ కవి ధృక్పథంతో. 'చెరువులో పిట్టల అడుగులు,' 'అల్చిప్ప', పిల్లలేంచేశారు, 'నాక్కాస్త చెప్పండి,' 'ఇక్కడ నది వుండాలి,' 'ఘర్ వాపసీ,' 'ఒంటరి దు:ఖం,' 'వర్షం,' 'మనదారి రహదారి' మొదలైనవి భిన్న వస్తు సంక్షేమం.

ప్రసాదమూర్తి కవిత్వ సృష్టిలో వస్తువు పట్ల శ్రద్ధ, రూపం పట్ల మక్కువ ద్యోతకమవుతాయి. అయినా వస్తురూప సమన్వయం కవిత్వమంతటా అంతర్లీనంగా కొనసాగుతూనే ఉంటుంది. ఈ సమన్వయ సిద్ధి కవి సాధనతో, సంయమనంతో లభించిందని మనం గ్రహిస్తాం.

ప్రసాదమూర్తి ప్రతి కవితా వస్తువు సామాజిక సమకాలీనతను కలిగి ఉంటుంది. వర్తమాన చరిత్రలో కొనసాగుతున్న దుర్మార్గ పరిణామాలను, దుస్సంఘటనల్నీ, కవులు, కళాకారులు నిండు హృదయంతో, మమేకతతో, ఉద్వేగంతో పట్టించుకోవాలి. ప్రతిస్పందించాలన్నదే ఈ కవి ప్రగాఢమైన భావన, తీవ్రమైన ఆలోచన. అందుకే తన కవిత్వ,

## సాహితీస్రవంతికి భూరి విరాళం

విజయనగరం జిల్లా సాహితీస్రవంతి అధ్యక్షులు పి.ఎస్. శ్రీనివాస రావు సాహితీస్రవంతికి వారి తండ్రి పాణంగిపల్లి రామారావు జ్ఞాపకార్థం లక్ష రూపాయలు విరాళం అందజేశారు.

విశాఖపట్నంకు చెందిన శ్రీమతి కోన ఉమాదేవి, రిటైర్డ్ ప్రిన్సిపాల్, సాహితీస్రవంతికి రూ. 25,000 లు (ఇరవై ఐదువేల రూపాయలు) విరాళంగా అందించారు.

విశాఖపట్నంకు చెందిన అయ్యగారి సీతారత్నం రూ. 5000 లు సాహిత్య ప్రస్థానం పత్రికకు విరాళంగా అందించారు. వీరందరికీ , సాహితీ స్రవంతి, సాహిత్య ప్రస్థానం పత్రిక తరపున ధన్యవాదాలు తెలుపుతున్నాం.

2000 సంవత్సరం నుండి నిరాటంకంగా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సాహిత్య ప్రస్థానం మాసపత్రిక వెలువడుతున్న సంగతి తెలిసిందే. పాఠకులు, అభిమానుల సహకారం వల్లనే ఇది సాధ్యమయింది. ఆర్థికంగా భారం అయినప్పటికీ జనవరి 2018 సంచిక నుండి సాహిత్య ప్రస్థానం మాసపత్రిక పేజీలను పెంచడం జరిగింది. సాహిత్య పత్రికల నిర్వహణ గురించి తెలుగు సాహిత్య అభిమానులకు తెలిసిందే. ప్రతీనెలా సంచిక వెలువరించడం ఎప్పటికప్పుడు దినదిన గండమే. అయినా సాహిత్యం పట్ల, తెలుగు భాషపట్ల ఆపేక్ష కలిగిన పాఠకాభిమానుల ప్రోత్సాహమే మాకు బలం. సాహితీ స్రవంతి కార్యకలాపాలు నిరంతరంగా సాగాలన్నా, సాహిత్య ప్రస్థానం మాసపత్రిక నిరాటంకంగా వెలువడాలన్నా ఈ ప్రోత్సాహం చాలా అవసరంగా భావిస్తున్నాం. ఈ ఒరవడి మరికొందరికి ప్రేరణ కలిగిస్తుందని, సాహిత్యాభిమానులు స్పందించి తమ ప్రోత్సాహాన్ని అందించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. సాహిత్య ప్రస్థానం మాసపత్రిక ఖాతా వివరాలు తొలిపేజీలో ఇవ్వడం జరిగింది. గమనించగలరు. ◆

---

తాత్విక దృక్పథాన్ని తానే వివరిస్తూ, విశ్లేషిస్తూ ఇలా అంటాడు. 'నా కవిత్వానికి వస్తే నాకో చూపుంది.' దానికెంత స్పష్టత ఉందో చెప్పలేను గాని, చూడాల్సిందేదో చెప్పగలను'. రాయాల్సిందేదో రాసేతీరతాను. ఈ అభిప్రాయానికి బలమైన సాక్ష్యంగా, 'నాకాస్త చెప్పండి' అనే కవిత ఉదాహరణగా నిలుస్తుంది. మత మౌఢ్యాన్ని ప్రశ్నిస్తుంది. మతం వెనుక ఉన్న రాజకీయ షడ్యాంతరాన్ని కుట్రను ప్రశ్నిస్తుంది. మతం పేరుతో విడిపోతున్న మనుషుల్ని కలపాలని, కాపాడుకోవాలని ఆరాటపడుతుంది. కవి జ్వలిత హృదయం ఊగిపడుతూ, ఉద్రేకపడుతూ, అమానవీయ, అసాంఘిక శక్తుల్ని జుట్టుపట్టి నిలదీస్తూ, జనంపట్ల నిబద్ధతతో, నిమగ్నతతో జనం పక్షాన నిలబడి మాట్లాడతాడు చూడండి ఆ తీవ్ర స్వర ప్రకంపనలు ఈ కవితలో. కవి మనల్ని పిలవడం కాదు, మనం అత్యంత స్వచ్ఛందంగా కవి వెంట ప్రశ్నల దారుల్లో నడిచి వెళ్తాము ఉద్యమ దీప్తితో.

"మనుషుల్ని తినే మతం వాడిది/మన అన్నం కంచాల దగ్గర వాడికేం పని పొమ్మనండి/ అన్నట్లు నేను వెన్నెల తిని, వెలుగును తాగి/దిగంతాలలో ఆనంతానంద తాండవం చేస్తాను. "నా వెన్నుపూసలో చలి కాగుతున్న వీరులనెలా నిషేధిస్తారు!" మనం మనుషులం కదరా/కౌగిలించుకోవడం మాత్రమే తెలిసిన పసిపిల్లలం కదరా/పిల్లల్ని బజ్జో పెట్టడం కూడా చేతకాని వాళ్లు మనుషుల్నేం పాలిస్తారు/చెప్పండి నాకు. మనిషి నుండి మనిషినెలా నిషేధిస్తారు/నానుండి నా కవిత్వాన్నెలా నిషేధిస్తారు."

ప్రసాదమూర్తి కవిత్వంలో పలవరించి కలవరించే జనం, పీడిత జనం, శ్రామిక జనం, రైతు సోదరులు, వీరందరినీ మనం కూడా కవితోపాటు అక్కున చేర్చుకుంటాం, వాళ్లకు తోడుగా నిలుస్తాం, ఓదారుస్తాం, ధైర్యాన్నిస్తాం. బతుకుపట్ల గాఢమైన విశ్వాసం అనే ఆయుధాన్ని చేతుల్లో పెడతాం. ఈ సందర్భంలోనే ప్రసిద్ధ కవి పాబ్లోనెరుడా కవితా పలుకులు స్ఫురణకొస్తాయి. "ఈ భూ ప్రపంచంలో మానవులే మరిచిపోయిన బడుగు, బలహీన వర్గాల మానవులున్నారు/ వారందరూ నా కవిత్వం కన్నా, నా కవిత్వంలోని పదాల కన్నా గొప్ప వారుగా నాకు దర్శనమిస్తారు."

ప్రసాదమూర్తి కవిత్వం క్రొంగొత్త కవిత్వపు పరిభాషతో, సౌందర్యాత్మక అభివ్యక్తితో కూడిన అలంకారికతతో, అత్యంత నవ్యతతో కాంతులొలికే శిల్ప ప్రతిభతో, వస్తురూప సమన్వయంతో అలరారుతూ కవిత్వ ప్రేమికుల్ని, మానవత్వపు విలువలతో పచ్చగా ఎదిగే సమాజం కోసం కలిసిమెలిసే ఉన్నత మానవీయ సంస్కారం కలిగిన మానవ సమూహం కోసం వాగ్దానం చేస్తున్నది. ◆






# కవిత్వ గరిమనాభి 'వాకిలి తెరవని వాన'

- కెంగార మోహన్
9493375447

కాలంతో పరుగులు తీసే కవిత్వం ఇటీవలదే ఐనా వచ్చిందంటే అది వాకిలి తెరవని వాన కవిత్వం. గుండెలోతుల్లోకి వెళ్ళి నిశ్శబ్ధంగా కలకలం సృష్టిస్తుంది. ఏ భ్రమల్లోకో, ఊహల్లోకో తీసుకెళ్ళి మదిని కలగాపులగం చేయని కవిత్వమిది. మనసును నాగలితో దున్నుతుంది, చదును చేస్తుంది, కన్నీటితో తడిపి పసిడిపైరును పండిస్తుంది. నిబద్ధత కల్గిన కవిత్వాన్ని అన్వేషించినపుడు, కాదు కాదు పరిశోధించినపుడు పిలిచి మరీ హృదయాంతరాళంలోకి తీసుకెళ్ళిన సైద్ధాంతిక ధృక్పథమున్న కవిత్వం. దాదాపు పాతికేళ్ళ క్రితం పాపినేని శివశంకర్ ఎక్కడో ఒకచోట "మనిషి ప్రపంచాన్ని ఆకళించుకోవటాన్ని ప్రజ్ఞానం అంటారని, ప్రపంచాన్ని మనిషి ఎట్లా ఆకళించుకుంటాడని, బాహ్యావాస్తవికత తనలో ప్రతి ఫలించడం ద్వారానే ఆకళించుకుంటాడని" చదివిన మాట ఈ కవిత్వం చదివాక అర్థమయ్యింది. వాకిలి తెరవని వాన కవిత్వంలో కూడా కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి అలాంటి స్పర్శే కలిగిస్తారు. ఈ కవితలో..

***'ఎన్నేళ్ళైందో!/కంటిజాలు కనుమరుగవక!/ఎన్నాళ్ళైందో/ మింటిధార కంటికి కనపడక/ఆకాశాన అరుపు లేదు! మెరుపు లేదు!/అవని మీద అదును లేదు! పదును లేదు!/వరపు కరువైంది! బతుకు బరువైంది!/మనసులో విస్తరిస్తున్న ఎడారి తడారిపోతున్న ఆశ/తల్లిడిల్లిపోతున్న జీవావరణం!'***

కరువు కన్నీటి జడివాన రైతుకే కనబడుతుంది. ఇక్కడా అంతే. కవిత్వం చదివితే మరో కవిత్వం రాయడానికి దారి చూపుతుంది, పదునైన కవిత్వానికి పతాకశీర్షికవుతుంది. ఎక్కడి నుండి ఎక్కడికో తీసుకెళ్తుందనడానికి లేదు. కవిని చేయిపట్టుకుని నడిపించినట్టు, ఆశయాలను గుర్తుచేసి మరీ వెలుతురు దారుల్లో నడిపించినట్టుంటుంది. ఇంతటి కవిత్వం రాయడానికి కవి కళ్ళల్లోంచి కనిపించని జలధారలెన్నిసార్లు సెలయేటి ప్రవాహాలయ్యాయో మరి. పదునైన కవిత్వం లేదని, వాస్తవిక సంద్రంలోంచి అలల్లా ఎగసిపడే కవిత్వం కానరాదని చెబుతున్న సందర్భంలో ఈ కవిత్వం నిద్రాణమైన సమాజానికి చురకలేసి మరీ లేపుతుంది.

***'ఎలా! మీరిలా వుంటే ఎలా!/భవితను మోయాల్సిన వాళ్ళు/భావికి చూపివ్వాల్సిన వాళ్ళు/చీకట్లో మూటగట్టి పడేసిన ముత్యాల్లా/వ్యసనాల చిచ్చుల్లో తగలబడుతూ/జీవితాల్ని అర్థాంతరంగా ఆర్పుకుంటూ/ఎలా! మీరిలా వుంటే ఎలా!'***

చూశారా ఎలా నిద్రలేపుతాడో! కవి నిజంగా సమ సమాజానికి వెలుగునిచ్చే సూర్యుడనిపిస్తోంది. నిరంతరం కల్మషం లేకుండా సమాజం నుంచేది ఆశించకుండా సమాజ

# మొగ్గలు



- డాక్టర్ భీంపల్లి శ్రీకాంత్
9032844017

రాత్రి కలల్ని ఒడిసి పట్టుకుంటాను కదా
ఉదయాన్నే అవి సీతాకోకచిలుకల్లా ఎగిరిపోతాయి
కలలు మెలకువలోనే ఆరిపోయే దీపాలు

సుఖాల వెంబడి పరుగెత్తుతాను కదా
దుఃఖాల తోరణాలు ఆహ్వానిస్తూనే ఉంటాయి
సుఖదుఃఖాలు జీవితంలో వచ్చే రాత్రిపగలు

ప్రేమకోసం పరితపించి పోతుంటాను కదా
అందని ద్రాక్షలా అది దూరమైతూనే ఉంటుంది
ప్రేమంటే ఒక ఆత్మీయ ఆలింగనం

నీ ప్రేమకోసం తలుపుతడుతూనే ఉంటాను
నీ హృదయవాకిలిని ఎప్పుడు తెరుస్తావని
నువ్వు ఊపిరి పోస్తేనే కదా నేను బతికేది

నీ కోసం చకోరిపక్షినై ఎదురుచూస్తూనే
నీ పిలుపుకోసం నిరీక్షిస్తూ ఉంటాను
నువ్వు ప్రేమదారిలో కనిపించని దేవతవు ◆

---

శ్రేయస్సు గూర్చే ఆలోచించే ఏకైక వ్యక్తి ఎవరంటే నూటికి నూరు పాళ్ళు కవే.

నిశ్శబ్దంగా సంచరిస్తే కవి ఎలా అవుతాడు. తను నడుస్తూ మరొకరికి దారినివ్వడమే. కొండ్రెడ్డి కవిత్వం ఊహల్లోంచి ఊడి పడింది కాదు.. అనుభూతుల్లోంచి పుట్టింది అంతకంటే కాదు ..వాస్తవజీవన ముఖచిత్రంలోంచి విరుచుకు పడింది. దేనికదే ప్రతీక, దేనికదే పోలిక, దేనికదే అభివ్యక్తి కాదు ప్రతీ కవిత వైవిధ్యమే. ప్రతీ కవితాపంక్తి ఆర్ద్రత స్వరమే. ఈ కవిత చూడండి...

***'కూలబోతున్న/వయసు నిట్టాడికింద/రక్తహీన దేహంలో / యింకా వో స్వచ్ఛమైన/మనిషిని లోన బతికించుకుంటూ/ నిండు జీవితాన్ని కలగంటూ/ఇంటా బయటా నానా యాతన్లు పడుతూన్న/ఆ తాతను చూస్తే నిజంగా సిగ్గేస్తుంది.'***

ఈ కవిత చదివాక గుర్చొచ్చిన మాట షెల్లీ చెప్పినట్టూ ఊహాశక్తి ప్రకటనలా కనిపించినా వాస్తవాన్ని, జీవన గమనాన్ని, జీవిత సత్యాన్ని బోధిస్తుంది. ఈ కవిత్వంలో స్పష్టమైన వాస్తవిక దృష్టికోణం కనిపిస్తుంది. కొండ్రెడ్డి స్వప్నం సేదతీరే సత్రమని, సత్యం శాశ్వతత్వాన్ని ప్రసాదించే స్వగృహమని అంటాడు కాబట్టి ఇది కల్పనో, ఊహనో కాదు. మనకు మనం సంభాళించుకునో, సర్దుకునో పాజిటివ్‌గా ఆలోచించో చదవడానికుపక్రమించాల్సిన పనిలేదు, యదార్థాన్ని ప్రత్యక్షంగా మనోనేత్రంతో చూడాలంటే హృదయపువాకిళ్ళు తెరవాల్సిందే. కవిత్వంలో ఎన్నో భావాలు, దృక్పథాలు, మానసిక సంఘర్షణలు దర్శనమిస్తూనే వుంటాయి. కవి హృదయం నిండుగా ప్రవహించే జీవనది లాంటిదేమో మరి.

***'కళ్ళకు ఆర్థిక పొరలు కమ్మి/కన్నతల్లే కనిపించని ఈ రోజుల్లో/మట్టి అమ్మతనాన్ని/ఆత్మీయంగా గుర్తించే మనుషులున్నారా?/ఈ భూమ్మీద/అసలిప్పుడు, మనిషి తనంతో నిండిన మనిషనే/వాడొకడున్నాడా?'***

మానవత్వం ఆర్థిక పద్మవ్యూహంలో చిక్కి విలవిలాడుతున్నాక ఇంతకంటే గొప్పగా ఏ కవి చెప్పగలడు? కవిత్వం చదువుతున్నంత సేపూ ఓ మానవముఖం రేఖాచిత్రంలా కనిపిస్తుంది. విలువల ప్రపంచంలోకి నడిపించే కవిత్వమిది, వ్యామోహ పంజరంలోంచి విడిపించే చైతన్య స్వరమిది. లోతైన భావోద్రేకాల చిటికెన వేలు పట్టుకుని కలసి నడుస్తూ సాగిపోయే ప్రవాహమిది. ఈ కవిత్వంలో మానవీయ స్పర్శ, మానవత్వ పరిమళాలేకాదు సూదుల్లా గుచ్చుకునే మాటలు, నిప్పులా కాలే వాక్యాలు కవి గరిమనాభిలోంచి ఎగసిపడి ఉన్నత ఆశయం కోసం మనిషిని పునీతం చేయడం కోసం దివిటీ పట్టుకుని నడిపిస్తాయి. ◆





# నీలాంటి స్నేహితుడు కావాలి

ఎ. అన్నపూర్ణ
9490295170

"అపర్ణా! నేను ఇండియా వెళ్ళి కొంతకాలం వుండాలను కుంటున్నాను" మార్నింగ్ బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ చెప్పాడు మహేష్ భార్యతో!

"ఇప్పుడు కోడలికి డెలివరీ టైమ్ నేను రాలేను కదా! తర్వాత వెడదాం" నచ్చచెబుతూ అంది అపర్ణ.

"ఇలా చాలాకాలంగా వాయిదాలు వేస్తున్నావ్. నీకెప్పుడూ తీరికవుండదు. నేను ఒక్కణ్ణే వెడతాను..." అంటూ కోపంగా తనరూమ్‌లోకి వెళ్ళిపోయాడు మహేష్.

"చెబితే అర్థం చేసుకోవు. నీ పట్టుదల నీదే. వెళ్ళి ఒక్కడివే ఎలావుంటావ్?"

కొడుకు వంశీతో చెప్పింది. అతను చెబితే వింటాడేమోనని!

"అలాగే చెప్పిచూస్తాను. నాకూ నమ్మకంలేదు.." అంటూ తండ్రిగదిలోకి వెళ్ళాడు, "డాడ్ చాలాకాలం తర్వాత మీ ఊరు చదువుకున్న స్కూలు కాలేజీ చూడాలనుకోవడం మంచిదే. నేను అర్థం చేసుకోగలను. నెక్స్ట్ ఇయర్ అందరమూ కలిసి ప్లాన్ చేద్దాం" అంటూ తండ్రి దగ్గర కూర్చున్నాడు.

"నువ్వు, మీ మామ్ డాక్టర్లు. తీరిక వుండదని నాకు తెలుసు. మీకూ నాకూ కుదరదు. నేను వెళ్ళగలను. కొద్ది కాలం అక్కడ గడపాలనీ, ఫ్రెండ్స్‌ని కలుసుకోవాలనీ వుంది. నన్నెవరూ ఆపకండి."

"డాడ్ మీరు ఒక్కరూ ఒంటరిగా ఎలావుండగలరు? తోడుకావాలి. మాకు వర్రీగావుంటుంది."

"ఎందుకు వర్రీ... నా పని నేను చేసుకోగలను. బైటికీ వెళ్ళగలను. పిన్నీ బాబాయి వుంటారు మన ఊళ్ళో. హైదరాబాద్‌లో మీనాక్షి అత్తయ్యవుంది. ఏం ఫర్వాలేదు. నేను టికెట్ కొన్నాను." ఇక మాట్లాడటానికి ఏమీలేదన్నట్టు తన నిర్ణయం చెప్పేశాడు మహేష్.

నిజానికి మహేష్‌కేమీ అనారోగ్యంలేదు. డబ్బుకి లోటులేదు. 75 ఏళ్ళ వయసంటే అంతమరీ ముసలితనం కాదు ఈ రోజుల్లో. ఇంట్లో ముగ్గురు డాక్టర్లున్నారు. ఆయన

కూడా ఆరోగ్యంపట్ల నియమాలు పాటిస్తాడు. కనుక ఇక కాదన్లేక పోయాడు వంశీ.

అయితే నలభై ఏళ్ళలో రెండు సార్లు మాత్రమే ఇండియా వెళ్ళిన మహేష్‌ని ఎవరైనా గుర్తుపడతారా? బాగామార్పు వచ్చింది వయసురీత్యా. పిన్ని, బాబాయి, అత్తా వున్నమాట నిజమే. వాళ్ళు కూడా పెద్దవాళ్ళయ్యారు. ఆరోగ్యాలు ఎలా వున్నాయో అని అపర్ణ కొడుకుతో చెప్పి దిగులు పడింది.

"ఫర్వాలేదులే మామ్. ఒకటి రెండు నెలల్లో తిరిగి వచ్చేస్తాన్లే... అన్నాడతను. బోలెడు జాగ్రత్తలు చెప్పి బంధువులకీ స్నేహితులకీ ఇవ్వమని గిఫ్టులు ఇచ్చి పంపించాడు.

ఉత్సాహంగా ఇండియా వెళ్ళాడు మహేష్. తమ్ముడు ఎయిర్ పోర్ట్‌కి వచ్చాడు. "చాలా కాలం అయింది అన్నయ్యా నిన్నుచూసి. చాలా మారిపోయావ్" అంటూ పలకరించాడు సురేష్.

''మారిపోక... అమెరికా వాళ్ళు అమృతం తాగుతారనుకున్నావా! నువ్వు కూడా మారావు. నీకునాకూ ఒక సంవత్సరమేగా తేడా! మీనాక్షి అక్క ఎలావుంది? పిల్లలంతా బాగున్నారా?"

"ఆ అంతా బాగున్నారు. వాట్సప్ వీడియో చాటింగ్‌లో చూస్తూనే వున్నావుగా" అన్నాడు సురేష్.

సురేష్‌కి చదువు రాలేదు. అందుచేత పల్లెటూళ్ళో పొలం చూసుకుంటూ వుండిపోయాడు. మహేష్ తన ఆస్తి కూడా వాళ్ళకి చెందేలా రాశాడు. ఇద్దరు ఆడపిల్లలకీ పెళ్ళిళ్ళు చేశాడు. అమెరికా వెళ్ళి తనబాగు తాను చూసుకోక తమ్ముణ్ణి ఆదుకున్నాడు. అందుచేత తమ్ముడు కుటుంబానికి మహేష్ అంటే గౌరవం. నెలరోజుల పాటు అక్కడ వున్నాక విసుగువచ్చింది.

విజయవాడ లయోలా కాలేజీ చూడాలని వెళ్ళి అక్కడో నెలరోజులు గడిపాడు. చుట్టు పక్కల ప్రదేశాలు తిరిగినా పదిరోజులు గడవటం కష్టం అయింది. ఒక్కణ్ణీ వుండగలను అనుకున్నానుకానీ కష్టమే అనిపించింది. హైదరాబాద్ అయితే కాస్త నయం. ఎవరైనా ఫ్రెండ్స్‌ని కలవచ్చు అని అక్క మీనాక్షితో చెప్పాడు వస్తున్నట్టు.

మీనాక్షి వుంటున్న ఇల్లుకాకుండా మంచి సెంటర్‌లో ఫ్లాట్ ఒకటి ఖాళీగానే వుందనీ నువ్వందులో వుండొచ్చుననీ చెప్పిందావిడ.

''రక్షించావ్. అలాగేవుంటాను. రెంట్ మాత్రం తీసుకోవాలి నువ్వు" అని ఒప్పించాడు. "చిన్నప్పటి నీ పంతం ఇంకా మానుకోలేదన్నమాట. వద్దన్నా వినవుగా.. సరే నీ ఇష్టం!" అందావిడ.

''అవును అక్కా! ఎవరైనా నాకోసం వచ్చినా రెండురోజులు ఆగినా మీకు ఇబ్బంది వుండదు. ఇందులో పంతాలు పట్టింపులూ ఏముంటాయ్" అన్నాడు మహేష్ "నా తమ్ముడు మేలిమి బంగారం" అని మురిసిపోయిందావిడ. అంతేకాకుండా ఇంటి పనికీ వంట చేయడానికీ బంధువులావిడని పంపించింది.

"నువ్వింత ఆరోగ్యంగా తిరుగుతున్నావ్. ఇప్పటకీ వంట చేస్తున్నావా..వంట మనిషివున్నా. ఒకసారి అమెరికా రాకూడదా అంటే మాత్రంరావు" అన్నాడు మహేష్ కోపం నటిస్తూ.

"ఏం లేదురా. తీరావచ్చాక వెనక్కిరాకుండా ఏ దొరబాబునో చూసి పెళ్ళాడి అక్కడే వుండిపోతానని సందేహం" అందావిడ హాస్యమాడుతూ.

" ఆ పని చేద్దూ నీకు పుణ్యం వుంటుంది. మేము ఈజీగా అమెరికా వచ్చేస్తాం కష్టం లేకుండా..." అన్నారు మనవళ్ళు ఆటపట్టిస్తూ.

" ఆ పనేదో అరవైఏళ్ళ క్రితమే చేసుంటే బాగుండేది. ఇటీస్ టూలేట్..." అంది మీనాక్షి ముసిముసి నవ్వులు నవ్వుతూ.

"అక్కా నువ్వింత ఆరోగ్యంగా ఎలావున్నావో అర్థమైంది నువ్వు హాయిగా నవ్వుతూ నీ చుట్టూ వున్నవాళ్ళని నవ్విస్తావు కనుక!" అన్నాడు మహేష్ సంతోషంగా. ఎప్పటి కప్పుడు తండ్రి కబుర్లు తెలుస్తున్నాయ్. బంధువులందరితో ఆయన హ్యాపీగా వున్నారు. అదేచాలు అనుకున్నారు వంశీ అపర్ణలు.

ఒక రోజు తీరికగా క్లాస్ మేట్స్ ఎవరెవరు ఎక్కడ వున్నారా అని ఫేస్‌బుక్‌లో ట్రైచేశాడు. ఎవరూ అందుబాటులో లేరు. కానీ ఉస్మానియా గోల్డెన్ జూబ్లీకి వచ్చేవారి వివరాలు తెలుసుకోగలిగాడు. అయితే వాళ్ళు పట్టుమని పదిమంది కూడాలేరు. కొందరు ఈ లోకంలోనే లేరు. కొందరు కదలలేని స్థితిలో వున్నారు. ఇద్దరు అసలు గుర్తుపట్టలేనంత మారిపోయారు. మరికొందరు విదేశాల్లో స్థిరపడి ఇండియాని పూర్తిగా మర్చిపోయారు. ఫర్వాలేదు గుర్తుపట్టగలరన్న నాగరాజు, ప్రసాద్‌లు హైదరాబాద్‌లోనే వున్నట్టు తెలిశాక మహేష్‌కి పట్టలేని సంతోషం కలిగి ఫోన్ చేశాడు. వాళ్ళు వెంటనే వచ్చేశారు కలుసుకోడానికి.

"మహేష్ మనం మళ్ళీ కల్సుకుంటామని కలలో కూడా అనుకోలేదు" అన్నారు సంబరపడుతూ. వాళ్ళకి మహేష్‌లాంటి

అమెరికా ఫ్రెండ్ ఎవరూలేరు.

"గౌతమ బుద్ధుడికి రాజ్యం సంపద భార్యా బిడ్డల పట్ల వైరాగ్యం కలిగినట్టు నీక్కూడా విరక్తి కలిగి ఇండియా వచ్చావా?" అన్నారు.

"మీతో కొంతకాలం సరదాగా గడపాలని వచ్చాను. అంతేకానీ ఏ విరక్తీ కలగలేదు. నా కుటుంబాన్ని అన్నింటికన్న ఎక్కువగా ప్రేమిస్తాను" అన్నాడు. అదీకాకుండా నేను పుట్టిపెరిగిన వూరు చదివిన స్కూలు అల్లరిచేసిన కాలేజీ దిశానిర్దేశం చేసి మంచి మార్గానికి మళ్ళించిన యూనివర్శిటీని అన్నీ చూశాను. నా సంతోషాన్ని పంచుకోడానికి ఎవరైనా కలిస్తే బాగుండునని అనుకున్నాను. మీరు వచ్చారు." అన్నాడు వాళ్ళ సంగతి తెలియక.

"ఇందులో అంత ఎమోషనల్ ఫీలింగ్స్ ఏమున్నాయ్. చాలాకాలానికి రావడంవలన ఏదో కోల్పోయినట్టు అనిపించిందేమో! అప్పటి రోజులు కావు. ఇక్కడ చదివి ఉన్నత ఉద్యోగాలకి ఎదిగిన వారెవరికీ స్కూలు కాలేజీ గుర్తుకురావు. డొనేషన్లు ఇవ్వాల్సి వుంటుందేమోనని భయం కూడాను. ఇంతకీ మా కోసం ఫారిన్ డ్రింక్స్ తెచ్చావాలేదా? అన్నాడు ప్రసాద్. "ప్రసాద్, రాజూ మీరిద్దరూ ఓవర్ వెయిట్ వున్నారు. ఈ అలవాటువల్లనే కదూ? అంటూ ఇద్దరికీ చెరో బాటిల్ ఇచ్చాడు.

"బాబోయ్ ఇంటికి తీసుకెడితే పార్వతి ఆత్మహత్య అయినా చేసుకుంటుంది. నన్ను హత్య అయినా చేస్తుంది. ఇక్కడే తాగుతాను రోజూ వచ్చి". అన్నాడు నాగరాజు.

"నాకా భయంలేదు" అన్నాడు ప్రసాద్.

"ఏం మీ ఆవిడ కంపెనీ ఇస్తుందా? అన్నాడు నాగరాజు వెకిలిగా. నవ్వుతూ ముగ్గురికీ గ్లాసుల్లో పోశాడు మహేష్.

"వంటావిడ టెంపుల్‌కి వెళ్ళి లేట్‌గా వస్తానంది. మీరు త్వరగా కానిచ్చి ఆవిడ వచ్చేలోగా వెళ్ళిపోవాలి" వార్నింగ్ ఇచ్చాడు మహేష్.

కాలేజీ కబుర్లు, అమెరికాలో లైఫ్ గురించి మంచీ చెడూ మాట్లాడుకుంటూ గడిపేశారు.

"మీకు హెల్త్ కాన్షస్ లేదా బాడీని ఇలా పెంచేశారు? చాలా తగ్గాలి మీరు. ఏం బాగాలేదు" అన్నాడు మహేష్.

"ఇప్పటికి ఆరోగ్యంగానే వున్నాం. మరో అయిదేళ్ళు గడవవా? జీవించినంతకాలమూ ఎంజాయ్ చేయాలన్నదే మా జీవితాశయం! సిగరెట్లు ఏవి? అమెరికా నుంచి వచ్చి నీతులు చెబుతున్నావేంటి మహేష్‌బాబూ?" తాగినమైకం తలకెక్కి ఇష్టం వచ్చినట్టు మాట్లాడుతున్నారు వాళ్ళు.

"లైఫ్ ఎంజాయ్ చేయడమంటే ఇలా పీకల్దాకా తాగి పడుకోటమా?"

"మరి? సంపాదించుకోడం ఎందుకు? మనకోసమే."

"కాదు. దేనికైనా లిమిట్స్ వుండాలి. మీరు ఆరోగ్యం గురించి పట్టించుకోవాలి. అదిలేదు. ఈ డ్రింక్ కోసం డబ్బు వృథా చేస్తున్నారు. దీంతో అనాథలకో, అనారోగ్యానికి బలైపోతున్న వారికో సహాయం చేయచ్చు. చాలా లేట్ అయింది. ఇంటికి వెళ్ళండి" అన్నాడు మహేష్.

వాళ్ళకి ఇంకా తాగాలని వుంది. ఫారిన్ లిక్కర్. అందులో ఫ్రీగావచ్చింది. కానీ మహేష్ బాటిల్స్ తీసేశాడు. అంతా క్లీన్‌చేశాడు. అప్పటికే! వాళ్ళు మత్తుగా తూగుతుంటే మహేష్ మాత్రం బేలన్స్‌డ్‌గా వుండి ఆటోపిల్చి ఇంటికి పంపేశాడు.

మహేష్‌కి కంపెనీ అంటూ రోజూ రావడం మొదలు పెట్టారు ఇద్దరూ.

ఒక రోజు మహేష్ అన్నాడు.

"ఫ్రెండ్స్ మీరు కంపెనీ ఇస్తున్నందుకు థాంక్స్. కానీ నన్నెప్పుడూ మీ ఇంటికి పిలవరేం?"

"అదా... మా ఇంటికి వస్తే నీకు బాగుండదు. విందులు చేయడానికి. పార్వతి నాన్‌వెజ్ వండదు. కూర్చుండ ఖరీదైన సోఫాలుండవ్...

అతిథి సత్కారాలు చేయ అమృత పాత్రలులేవు..

ఎంటర్‌టైన్ చేయడానికి మాకు తాహతూలేదు... రాగం తీస్తూ చెప్పారు ఇద్దరూ. "అవేమీ నాకు అవసరం లేదు. మీ భార్యా పిల్లల్ని చూస్తాను అంతే!"

"సరే ఆదివారం తీసుకువెడతాం" అన్నారు వాళ్ళు.

మొదట ప్రసాద్ ఇంటికి వెళ్ళారు. అతడికి ఇద్దరు కొడుకులు. ఒక కూతురు. ప్రసాద్ భార్య కమలని పరిచయం చేయగానే "మీరు మాలాంటి వాళ్ళ ఇంటికి రావడం సంతోషంగా వుంది. మా అబ్బాయిలు ఇక్కడ చిన్న ఉద్యోగాలు చేస్తున్నారు. ఒక్కడికైనా అమెరికాలో ఉద్యోగం చేయాలన్నది మా ఆశ! మీరు ఫ్రెండ్‌గా ఈ హెల్ప్ చేయండి" అంటూ తన అవసరాన్ని సూటిగా అడిగేసింది.

"అలాగే నమ్మా చేతనైతే తప్పకుండా చేస్తాను" అన్నాడు మహేష్. ఇంటినిండా అక్కర్లేని సామానుతో నింపేశారు. అన్ని అవసరమా అనుకున్నాడు మహేష్. ఆ తర్వాత నాగరాజు ఇంటికి వెళ్ళారు. భార్య పార్వతిని పరిచయం చేశాడు. వాళ్ళకి పిల్లలులేరు. పార్వతికి భక్తీ పూజలూ వ్రతాలు ఎక్కువ.

ధూపదీపాలతో మసిబారిపోయి వున్నాయి గోడలు. అగరవత్తుల బూడిద ఇంతెత్తున దేవుడి మందిరాన్ని కప్పేసింది. ఫ్యాన్ వేయగానే ఆ బూడిద ఎగిరివచ్చి గొంతులోకి ముక్కులోకి పోయి వుక్కిరిబిక్కిరి అయిపోయాడు మహేష్.

పార్వతి నుదుట పెద్దబొట్టుతో గంపెడు బంతిపూలు తల్లో పెట్టుకుని ఏనాటిదో శిథిలమైపోతున్న పట్టుచీర కట్టుకుని బక్కచిక్కిపోయి వుంది. ఎలాగో ఒక అరగంట కూర్చుని భోజనం చేసి వెళ్ళమని బలవంతం చేసినా తప్పించుకుని మరోసారి వస్తానని చెప్పి బైలుదేరుతుంటే "మహేష్‌గారూ నాకు అన్నలు లేరు. వచ్చే శుక్రవారం అన్నల సౌభాగ్యవ్రతం చేయాలని మిమ్మల్ని చూడగానే ఆలోచన వచ్చింది. మీరు తప్పకుండా రావాలి" అంది అభిమానంగా.

ఆవిడ అభిమానం అప్యాయత మర్యాద... అంతా బాగానేవుంది. కానీ మరీ చాదస్తం మనిషి. శుభ్రత తక్కువ. నాగరాజుకైనా బుద్ధిలేదు. ఇంటిని శుభ్రంగా వుంచుకోవాలన్న జ్ఞానంలేదూ? ఇలాంటి వాతావరణంలో తప్పకుండా అనారోగ్యం వస్తుంది. అనుకున్నాడు మహేష్.

మహేష్‌ని సాగనంపుతూ "శుక్రవారం నాడు తప్పకుండారావాలి నువ్వు. ప్రసాద్, కమలా కూడా వస్తారు". అన్నాడు నాగరాజు.

"రాజూ ఒక్క విషయం. పార్వతికి పనిలో సాయంచెయ్. గోడలు మసిబారిపోయి ఇల్లంతా చీకటిగా వుంది. ఆమెకి తీరిక ఓపికా లేకపోతే నువ్వు బాగానే వున్నావు కదా! అగరవత్తుల పొగ బూడిదతో కేన్సర్ వస్తుందని నీకు తెలుసా? మా అబ్బాయి వంశీ, మా ఆవిడ అపర్ణా డాక్టర్లు. కేన్సర్ డిసీజ్‌లో రీసెర్చి కూడా చేస్తున్నారు. అందువలన తెలిసింది చెబుతున్నాను. మనవరకూ వ్యాధులు రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. అలా అయితేనే మీ ఇంటికి వస్తాను. నాకు కావల్సింది నాన్‌వెజ్‌లు డ్రింక్ పార్టీలు కావు." అన్నాడు మందలిస్తూ.

మరోసారి ఇంటికి వచ్చినపుడు "నువ్వు డ్రింక్ మానేయాలి. ఇండియాలో ఫ్రెండ్స్ అడుగుతారని తెచ్చాను కానీ మీ ఆరోగ్యాన్ని పాడు చేయడానికి కాదు. సిగరెట్లు తీసుకురాలేదా అనడిగావ్. లేదు. నేను కాల్చను డ్రింక్ చేయను. మేము వుండేది అరిజోనాస్టేట్‌లో. అక్కడ వేడి ఎక్కువ. అమెరికాలో వుంటున్న ఇండియన్స్ రోజూ మందు లేకుండా బతకలేరని చాలామంది అనుకుంటారు. కానీ కావల్సింది సెల్ఫ్ కంట్రోల్. ఏ కంట్రీ అయినా తాగకుండా వుండటం అనేది సొంత విషయం, పార్వతి చాలా బలహీనంగా వుంది. పైగా ఉపవాసాలు వ్రతాలూ అంటూ మంచి ఆహారం తీసుకోదనిపిస్తోంది. అన్నింటికన్నా నువ్వామె పట్ల ఎలాంటి శ్రద్ధా తీసుకుంటున్నట్టు కనబడటం లేదు. తెలిసో తెలియవో ఇంతకాలం వృధాచేశావ్. ఇప్పుడు ఆమెకు సంతోషం కలిగించు. రోజూ డ్రింక్ చేసి ఇంటికి వెళ్ళి ఆమెకు ఇంకా జీవితంపట్ల విరక్తి కలిగించకు. అపర్ణని వదిలి నేను ఎప్పుడూ ఇంతకాలం వుండలేదు. మేం అమెరికా వెళ్ళినపుడు డిగ్రీ మాత్రమే చదివింది. ఆ తర్వాత వంశీతోబాటే మెడిసిన్ చేసింది. ఆమె చదవాలని కోరింది. అడగటం ఆమె హక్కు. తీర్చడం భర్తగా నా బాధ్యత. ఆమె శ్రద్ధ పట్టుదల నాకు నచ్చింది. అమెరికాలో చదువంటే చాలా ఖరీదైంది. అయినా వెనకాడలేదు. అన్నిరకాలుగా ప్రోత్సహించాను. ఇంటిపని చేశాను. బాబు పసివాడు. వాణ్ణి కంటికి రెప్పలా చూసుకున్నాను. ఈ వేళ హాయిగా సంతోషంగా వున్నాం. నేను రోజూ మీకు ఇచ్చే విస్కీలో వాటర్ కోక్ కలిపాను. మీకు ఎంతసేపు ఫారిన్ లిక్కరనే భ్రమతప్ప అందులో ఏముందో కనిపెట్ట లేకపోయారు. ఆ భ్రమలోనే నిషా తలకెక్కింది. అనుకున్నారు." అంటూ బాటిల్స్ అన్నీ సింక్‌లో పోసి ఖాళీ చేసి గార్బేజ్‌లోకి విసిరేశాడు మహేష్.

నాగరాజు ప్రసాద్ సిగ్గుతో తలవంచుకున్నారు.

శుక్రవారం వెండి దేవుడి సామాన్లు, పూజామందిరం, పట్టుచీర, పసుపు కుంకుమలు తీసుకుని నాగరాజు ఇంటికి వెళ్ళాడు మహేష్.

నాగరాజు పట్టుపంచ, లాల్చీ వేసుకుని గుమ్మంలో సాదరంగా ఆహ్వానించాడు. ఇల్లంతా పరిశుభ్రంగా గోడలకు వేసిన కొత్త పెయింట్‌తో కలకలలాడుతోంది. మహేష్ చాలా సంతోషించాడు. తన మాటను ఆచరణలో పెట్టినందుకు. పార్వతీ విమలలను కూర్చోబెట్టి "మీరిద్దరూ నాకు చెల్లెళ్ళుగా ఈ గిఫ్ట్ కాదనకండి." అంటూ తెచ్చిన ప్యాకెట్లు వాళ్ళకిచ్చాడు.

పార్వతికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. మహేష్ పాదాలని కళ్ళకద్దుకుని "అన్నయ్యా పదేళ్ళుగా నన్నునేను ఓదార్చుకోడానికి ఈ భక్తి మార్గాన్ని ఎంచుకున్నాను. దేవుడి మందిరాన్ని ఇలా అలంకరించాలన్న కోరికను మీ స్నేహితుడు పట్టించుకోలేదు. ఎందుకూ ఖర్చు అన్నారు. ఇత్తడి సామాను చాల్లే అన్నారు. అదీ మా అత్తగారిది. నాకు లంగ్‌కేన్సర్. ఈ విషయం చెప్పాడో లేదో నాకు తెలియదు. ఇకనేను ఎంతకాలమో జీవించను. నేను చేసిన పూజలో, మీ మంచి

తనమో ఈ రోజు నాకు పర్విదినం..." అంటూ దేవుడి మందిరాన్ని అలంకరించింది. దీపాలు వెలిగించింది. ఆ ఇల్లు ఇప్పుడు దేవాలయంలా పవిత్రంగా పరిశుభ్రంగా వుంది.

పిండివంటలతో భోజనం వడ్డించింది. "మీ పుణ్యమా అని మీ స్నేహితుడు కూడా మారిపోయారు. పోనీండి ఈ కేన్సర్ వ్యాధి కూడా ఆయనలో మార్పు తెచ్చిందేమో పోయేముందు నన్ను సంతోషపెడుతున్నారు". అంటూ నవ్వు తెచ్చుకుంది.

"నాగరాజూ నువ్వు క్షమించరాని నేరం చేశావ్. పార్వతి అనారోగ్యం గురించి నాకు ఎందుకు చెప్పలేదూ? ప్రసాద్ నీకూ తెలియదూ?" అడిగాడు కోపంతో.

"తెలీదు మహేష్. రాజు నాతో చెప్పలేదు"

అపరాధిలా తలవంచుకున్నాడు నాగరాజు.

"నువ్వెళ్ళి విశ్రాంతి తీసుకో పార్వతీ. ఈ రోజు చాలా అలిసిపోయావ్". అంటూ చెప్పి ఆమె వెళ్ళి పోయాక "రాజూ... నిన్ను చూస్తే చాలా కోపంగా వుంది. కట్టుకున్న భార్యని ఇంత నిర్లక్ష్యం చేశావా? పిల్లా పాపా లేరే. తన బాధను తీర్చాల్సింది నువ్వే అయినా నీ ఆనందం ముఖ్యం అనుకున్నావా? ఛ... నిన్నసలు ఎందుకు కలిశానా అని బాధగా వుంది."

"లేదు మహష్! నిన్ను కలిసినందువల్లనే మేము మనుషులం అయ్యాం. ఇంతకాలమూ అడవి జంతువుల్లా బ్రతికాం. మా తప్పు ఏమిటో తెల్సుకున్నాం. మా కారణంగానే వాళ్ళిద్దరూ అలా తయారయ్యారు" అన్నాడు ప్రసాద్.

"ముందుగా తెలిస్తే అమెరికా నుంచి మందులు తెప్పించే వాణ్ణికదా! నువ్వసలు పార్వతికి సరైన ట్రీట్‌మెంట్ ఇప్పించావా లేదా? నీకెటూ పిల్లలు లేరు. పార్వతిని చంటిపాపలా చూసుకోవలసిన వాడివి. నిర్లక్ష్యం చేశావ్" అంటూ చీవాట్లు పెట్టాడు.

"నీ దగ్గరి నా తప్పు ఒప్పుకుంటే కాస్త మనశ్శాంతి వుంటుంది. అవును నా సుఖసంతోషాలే చూసుకున్నాను కానీ పార్వతిని పట్టించుకోలేదు. తెలిసేసరికే ఆలస్యమైందని డాక్టర్ చెప్పారు. చివర్లో ఏం చేసినా ఫలితం వుండదన్నారు."

"నేను అపర్ణతో చెప్పి మందులు తెప్పిస్తాను. ఇకనైనా ఆమెకు సంతోషం కలిగించే పన్లుచెయ్. ఆమెకు ఆసరా ఇవ్వు. జాగ్రత్తగా చూసుకో." అన్నాడు మహేష్.

ప్రసాద్‌తో తన ఆవేదన పంచుకుంటూ మహేష్ నా కళ్ళు తెరిపించాడు. ఇకనుంచీ నేను నా కోసం ఒక్క క్షణంకూడా వృథాచేయను" అన్నాడు.

"అవును నాగరాజూ క్లబ్‌ల్లో పేకాట-డ్రింక్ హాబిట్స్ వీటివలన అనర్థమే తప్ప ఎలాంటి వుపయోగమూ లేదు. టైమ్‌పాస్ ఆనందం ఎంజాయ్‌మెంట్ అనే ముసుగువేసి మనల్ని మనం మభ్యపెట్టుకుంటాం అంతే! ఇంత వయసు వచ్చీ లైఫ్ పార్టనర్‌ని అర్థం చేసుకోలేకపోతే, మనం ఒట్టి యూస్‌లెస్‌ఫెలోస్‌మి. మనం ఆనందాన్ని వెదుక్కోవడం కాదు ఇద్దరూ కలసి ఆనందం పంచుకున్నప్పుడే భార్యాభర్తల అనుబంధానికి అసలైన అర్థం." అన్నాడు ప్రసాద్ కూడా పశ్చాత్తాపంతో. అవును భార్యల అసంతృప్తికి ఆరోగ్యం పాడైపోవడానికీ చాలావరకూ భర్తలే కారణం." అన్నాడు నాగరాజు చివరిదశలో గుర్తించి.

"మహేష్‌ని చూసి అమెరికాలో విచ్చలవిడిగా ఆడవాళ్ళతో తిరుగుతారనీ, మందుపార్టీలు, ఖరీదైన ఇళ్ళు, మిలియన్ల సంపాదనతో, అక్కడ వుండే వాళ్ళంతా స్వర్గంలో విహరిస్తారనీ అతనూ అలాంటివాడేనని అపోహపడ్డాం. అసలు ఆ వుద్దేశ్యంతోనే మహేష్‌ని కలుసుకున్నాం. కానీ అతను మనకి జ్ఞానోదయం కలిగించాడు. అతన్ని కలవకపోతే మనం పూర్తిగా నాశనమైపోయేవాళ్ళం. థాంక్స్ ఎలాట్ మహేష్' అని చెప్పాలి అతనికి అనుకున్నారు ఇద్దరూ.

మహేష్ ఇండియావచ్చి నాలుగునెలలు గడిచాయ్.

అతనికి అపర్ణని మిస్ అయినట్టనిపించింది. వెనక్కితిరిగి వెళ్ళడానికి ఏర్పాటు చేసుకున్నాడు. అపర్ణతో చెప్పాడు.

"ఒక్క నెల రోజులు ఆగకూడదా నేనుకూడా వస్తాను మహీ!" అందామె.

"వచ్చి ఏం చేస్తావ్?" అడిగాడు.

"నీ ఫ్రెండ్స్‌ని చూస్తాను. నువ్వు వాళ్ళని గురించి చెప్పాక పార్వతిని చూడాలని చాలా అనిపిస్తోంది."

"వాళ్ళిప్పుడు బాగానే వుంటారు. నువ్వొచ్చి డిస్టర్బ్ చేయకు".

"నీతో వచ్చిన ప్రాబ్లమ్ ఇదే. అనుకున్నది చేయడం మానవు కదా! సరే నీ కోసం అందరం ఎదురు చూస్తూంటాం" అంది అపర్ణ. 'ఇన్నాళ్ళు వుండటమే అరుదు. నువ్వు మమ్మల్ని వదిలి వుండవు మాకు తెలుసు' అనుకుంది ప్రేమగా అపర్ణ తన మనసులో.

◆




## కడపలో సి.పి. బ్రౌన్

డా॥ చింతకుంట శివారెడ్డి

వెల :150/- పేజీలు: 158

ప్రతులకు : 9440859872

ఈ సమగ్ర పరిశోధనలో భాగంగా కొన్ని అంశాల్ని రేఖామాత్రంగానైనా శివారెడ్డి బ్రౌన్ మీద అపారమైన అభిమానంతో, గౌరవంతో ఈ పుస్తకంలో పొందుపరిచాడు. ఈ ప్రయత్నం ఈ పుస్తకం చదివే యువ పరిశోధకుల్లో ఒక చలనాన్ని తప్పక తెస్తుందని నా నమ్మకం.

- ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి




## ప్రవక్త

ద గ్రేట్ వర్క్ ఆఫ్ ఖలీల్ జీబ్రాన్

అనువాదం: బెందాళం క్రిష్ణారావు

వెల : 100/- పేజీలు: 166

ప్రతులకు : 9866115655

బెందాళం క్రిష్ణారావు గారు 'ప్రవక్త'ని మరోసారి తెలుగువాళ్ళకి పరిచయం చేస్తుంటే సంతోషంతో స్వాగతిస్తున్నాను. ఇప్పటి తరంకోసం మరింత సరళసుందరమైన తెలుగులో, అపారమైన ఇష్టంతో చేసిన ప్రయత్నమిది.

- వాడ్రేవు చినవీరభద్రుడు



## మీ'ఢీ'యా సినిమా టీ.వీ.

చొప్పర బాలకోటయ్య

వెల : 75/- పేజీలు: 135

ప్రతులకు : 9441996119

బాలకోటయ్య పుస్తకం మన చేతుల్లోకి వచ్చి వాలింది. మీఢియాకు సంబంధించి చెప్పవలసిన విషయాలన్నింటికీ ఇది ఫుల్‌స్టాప్ కాకపోవచ్చు. ఇది కామానే కావచ్చు. కానీ, ఒక అరగంటసేపు ఈ పుస్తకం ముందు తలవంచితే జీవితకాలం మనుషులుగా చలనంలో ఉంటాం. మనలో ఉన్న కొన్ని బలహీనతలను గుర్తిస్తాం. వాటిని వదులుకొనే బలాన్ని పొందుతాం.

- ఆచార్య మేడిపల్లి రవికుమార్




## సూర్యుడిని నెత్తి కెత్తుకొని...

రావి రంగారావు కవిత్వం

వెల : 100/- పేజీలు: 128

ప్రతులకు : 9247581825

కవిత్వం రాయాలి/ మురికి గుండెల్లో దించే/ రోహిణి కార్తె ఎండమంట లాంటి కవిత్వం రాయాలి./ కవిత్వం రాయాలి.../ తోటమాలిని సేద దీర్చే/ మల్లెపూల పంట లాంటి కవిత్వం రాయాలి.../ కవిత్వం రాయాలి,/ ఒక్క కవితలోనే మంటలు, పంటలు ఉండి తీరాలి.

- రావి రంగారావు




## తరంగ ధ్వానాలు

ప్రగతిశీల పద్యాలు

గార రంగనాథం

వెల : 40/- పేజీలు: 32

ప్రతులకు: 9885758123

నేటికీ వేమన పద్యాలు మెరుపు తీగల్లా మిరుమిట్లు గొలుపుతూ మూఢ విశ్వాసాలతో అంధకార బంధురమౌతున్న సమాజాన్ని కాంతిమంతం చేస్తున్నాయి. ఆయన మార్గంలో ఎందరో పద్యాలు రాసి చరితార్థులయ్యారు. అదేరీతిలో ప్రయత్నించి సమాజాన్ని చైతన్యవంతం చేయాలనే కోరికతో నేటి పరిస్థితులపై నాకుగల అవగాహనతో ఈ పద్యాలు రాశాను.

- గార రంగనాథం




## ప్రేమ విలాసం

(ఖండ కావ్యం) (Address of Love)

కొణతం నాగేశ్వరరావు

వెల : 80/- పేజీలు: 128

ప్రతులకు : 9985144963

నాగేశ్వరరావు గారు "ప్రేమ విలాసం" పేరుతో చక్కని ఖండ కవితా సంపుటిని వెలువరించి పద్యానికి ప్రేమాభిషేకం చేశారు. సమకాలీన సామాజిక విషయాలను చక్కగా పద్యాల్లో రాసి, చిక్కని కవిత్వాన్ని మనకందించారు.

- బీరం సుందరరావు

## అగ్నిశ్వాస




నిఖిలేశ్వర్

వెల :50/- పేజీలు: 80

ప్రతులకు : 9177881201

**కా**లం వెనుక దాగున్న/ రహస్యాన్ని ఎవరు/ విప్పి చెప్పగలరు?/ ప్రజల నాడిని/ నొక్కి పెడుతున్న/ పాలకులకు/ బడికంటే ఈ రోజు/ గుడి మాత్రమే నడవడి సూత్రం!/ ఆశల అడియాసల/ ఎండమావుల్లో/ దుక్కిదున్నేవాడు మన్ను తింటున్నాడు./ దేవరహస్యమైపోయిన కాలం/ భక్తి వ్యాపారుల చేతుల్లో ఒక సరుకు!

**- నిఖిలేశ్వర్**

## ముసి బాస

(దీర్ఘ కవిత)




డా॥ జి.వి. రత్నాకర్

వెల : 60/- పేజీలు: 100

ప్రతులకు : 9849303175

**ర**త్నాకర్ గానం చేసిన శేషయ్య వాస్తవంలో అలాటి ఒక చైతన్య సంకేతం. పోరాట కేతనం. అందుకే రత్నాకర్ కవితకు అనేకానేక అభినందనలు. నేల విడిచి సాము చేసే కవి కుమారులకూ ఆశయం వున్నా అల్లిక తెలియని నవ కవులకూ ఇది ఒక మార్గదర్శిని. గతంలో వీరుల గురించిన బుర్ర కథలూ, నృత్య రూపకాలూ వున్నాయి గాని ఇందులో వున్నది వాటన్నిటిని ఇముడ్చుకున్న విలక్షణ శైలి.

**- తెలకపల్లి రవి**

## అనుసృజన (అనువాద కవితలు)




నిఖిలేశ్వర్

వెల : 100/- పేజీలు: 128

ప్రతులకు : 9177881201

**గ**త ఐదు దశాబ్దాల కాలంలో నేను చేసిన ఈ కవితా అనుసృజన నుంచి కొన్ని నచ్చినవి మాత్రవే ఏరి కవితాభిమానులకు అందజేస్తున్నాను.

**- నిఖిలేశ్వర్**

## మీరే జర్నలిస్ట్




బెందాళం క్రిష్ణారావు

వెల : 250/- పేజీలు: 370

ప్రతులకు : 9866115655

**ర**చయితకు సమాజం పట్ల ఆసక్తి, వృత్తిపట్ల బాధ్యత ఉన్నాయి. బౌద్ధం పట్ల, మార్క్సిజం, అంబేద్కరిజం పట్ల అభిమానం, గౌరవం, సాహిత్యం పట్ల అభిలాష ఉన్నాయి. సుమారు మూడువందల డెబ్బై పేజీలు దాటిన ఈ గ్రంథంలో 92 అధ్యాయాలున్నాయి. నిజానికి ఒక్కో అంశం మీద ఒక్కో పుస్తకం రాయడానికి ఆస్కారం ఉంది. కనుక మితి లేదు. అయితే చాలావరకూ అవగాహన కలిగించడానికి ఈ పుస్తకం దోహదపడుతుంది.

**- డా॥ నాగసూరి వేణుగోపాల్**

## సంకెళ్ళు




కథలు - పుస్తక పరిచయాలు

మంజరి

వెల : 120/- పేజీలు: 110

ప్రతులకు: 9440343479

**మ**ంజరి గారిలోని విశిష్టత ఎలాంటి డొంక తిరుగుడు లేకుండా వాడుక భాషలో రాయడం. మానవ సంబంధాల్ని ఉన్నతంగా చూపించడం. వీరి కథలు పాఠకుల అభిమానాన్ని చూరగొంటాయి. వీటిలోని పదాలు ఈ రచయిత కన్నీళ్ళని కొన్ని కథలు చదివాక నాకనిపించింది. చివరలో ఆరు ప్రపంచ ప్రసిద్ధ పుస్తకాలని చక్కగా పరిచయం చేసారు.

**- మల్లాది వెంకట కృష్ణమూర్తి**

## షానామా - మహాభారతం




తులనాత్మక పరిశీలన

డాక్టర్ యు.ఎ. నరసింహమూర్తి

వెల : 100/- పేజీలు: 143

ప్రతులకు : 9440343479

**ప్ర**పంచ ఇతిహాసాలన్నింటిలోనూ కొన్ని సమాన లక్షణాలుంటాయన్న స్ఫురణతో ఆసియాఖండంలో అతిముఖ్యమైన పారశీకుల షహనామా భారతీయుల మహాభారతాన్ని తులనాత్మకంగా పరిశీలిస్తూ భారతీయుల దార్శనికస్థితిని ఈ రచన వెలుగులోకి తెచ్చింది. పారశీక సంస్కృతికి షహనామా ప్రతిబింబమైతే, భారతీయ తత్వాన్ని ప్రపంచానికి చాటింది మహాభారతం.

**- ప్రచురణ కర్తలు**

## కాకినాడలో అద్దేపల్లి ద్వితీయ వర్ధంతి సభ



కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జనవరి **21**న జరిగిన అద్దేపల్లి వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న డా॥ లంకా వెంకటేశ్వర్లు. చిత్రంలో వుయ్యపు హనుమంతరావు, గడీల శివప్రసాద్ ఉన్నారు.

కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జనవరి 21న ప్రముఖ కవి, విమర్శకులు డా॥ అద్దేపల్లి రామమోహన రావు ద్వితీయ వర్ధంతి సభ కాకినాడలోని గాంధీభవన్‌లో జరిగింది. సభాధ్యక్షులుగా సాహితీస్రవంతి కాకినాడ పట్టణ గౌరవాధ్యక్షులు వుయ్యపు హనుమంతరావు వ్యవహరించారు. ముఖ్యవక్తగా ఏలూరు సబ్‌రిజిస్ట్రార్, ప్రముఖ కవి, పరిశోధకులు డా॥ లంకా వెంకటేశ్వర్లు ప్రసంగించారు. ఆయన మాట్లాడుతూ అద్దేపల్లితో తనకు గల సాహిత్యానుబంధాన్ని నెమరువేసుకొన్నారు. సమకాలీన కవిత్వంలో వృత్తిచైతన్యం అనే అంశంపై తాను చేసిన పిహెచ్‌డి పరిశోధనకు అద్దేపల్లి ఆత్మీయ పరిశోధకునిగా ఉన్నారన్నారు. తన సాహితీయానంలో ప్రతీ అడుగులోనూ అద్దేపల్లి సహాయసహకారాలు దండిగా లభించాయని తెలిపారు. ఈ కార్యక్రమంలో గడీల శివప్రసాద్, నాగాస్త్ర, గనారా, మార్ని జానకిరాం, డా. జోశ్యుల కృష్ణబాబు, ఉండవల్లి, వసుమర్తి పద్మజవాణి, అద్దేపల్లి జ్యోతి, పద్మావతి, వక్కలంక శారద, పుప్పాల సూర్యకుమారి, వూసల ఎర్రాశాస్త్రి, మేడిశెట్టి శ్రీరాములు, గరికపాటి మాష్టారు, శిరీష, ఇంద్రగంటి నరసింహమూర్తి, పెద్దింటి రామకృష్ణలు పాల్గొన్నారు. అనంతరం జరిగిన కవిసమ్మేళనానికి 'శ్రీహస్త' అధ్యక్షత వహించారు. పద్మజావాణి వందన సమర్పణతో సభ ముగిసింది. ◆

## కర్నూలులో సంక్రాంతి రైతుకవనం




సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ప్రతిఏడు సంక్రాంతికి నిర్వహించే కవి సమ్మేళనం రైతుకవనం. సామాజికసమస్యలు రైతుకష్టాలు, కన్నీళ్ళే వేదికగా కొనసాగుతున్నదని సాహితీస్రవంతి రాష్ట్రకార్యదర్శి జంధ్యాల రఘుబాబు అన్నారు. జనవరి 14న కర్నూలు నగరంలోని రాజవిహార్ సమీపంలోని ఆర్కే కలర్ ల్యాబ్ పైన అమృత సైకాలజికల్ కౌన్సిలింగ్ సెంటర్‌లో రైతు సమస్యలు, సంక్రాంతి విశిష్టతపై జరిగిన రైతుకవనానికి హాజరై సందేశమిచ్చారు. గౌరవ అతిథిగా హాజరైన ప్రముఖ నవలా రచయిత యస్‌డివి అజీజ్, ప్రముఖ సైకాలజిస్టు డా. పెద్దిగారి లక్ష్మన్న, సాహితీస్రవంతి జిల్లానాయకులు సుబ్బన్న, మహేశ్వరయ్యలు సందేశాలిచ్చారు. రైతు కవనంలో యువకవి బిడి హర్ష(కర్నూలు), చక్రపాణి(కర్నూలు), డా.రాజారెడ్డి(దిన్నెదేవరపాడు), నిసార్ అహ్మద్(కర్నూలు), సవ్వప్పగారి ఈరన్న(పత్తికొండ), సయ్యద్ జహీర్ అహ్మద్(కర్నూలు), గౌరెడ్డిహరిశ్చంద్రారెడ్డి(కర్నూలు), కృష్ణమూర్తి(కర్నూలు), ప్రమోద్ చక్రవర్తి(కర్నూలు), సుకన్య(నందికొట్కూరు), సుధాకర్(ఎమ్మిగనూర్), బిడి సుధీర్ రాజులు రైతు సమస్యలపై గళాలను వినిపించారు. ◆



విజయనగరంలో జనవరి **17**న చాసో భవన్‌లో జరిగిన చాసో స్ఫూర్తి సాహిత్య పురస్కార సభలో జి.వి. పూర్ణచంద్, చందు సుబ్బారావు, పురస్కార గ్రహీత, ఒరియా కథా రచయిత గౌరి హరిదాస్, చాగంటి తులసి, వెలుగు రామినాయుడ్ని, చాగంటి కృష్ణకుమారి, చీకటి దివాకర్ తదితరులు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




పేజీలు 160 రూ 120/-




పేజీలు 128 రూ 100/-




పేజీలు 296 రూ 200/-



పేజీలు 144 రూ 100/-




పేజీలు 160 రూ 110/-




పేజీలు 144 రూ 100/-




పేజీలు 536 రూ 350/-




పేజీలు 128 రూ 100/-




పేజీలు 152 రూ 100/-



పేజీలు 160 రూ 100/-

## ప్రజాశక్తి బుక్‌హౌస్

27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ - 2, ఫోన్ : 0866 - 2577533

**బ్రాంచీలు :** విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు, కాకినాడ,ఏలూరు, విజయనగరం, ఒంగోలు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 02.02.2018 . Date of Publication: 27.01.2018

PRSVMO2A 189



If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059

68

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | FRSVMOSA189 |
| పుస్తకం పేరు | [illegible] NO |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యవిది | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |